దేశీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
నవంబరు - 1954
రెండున్నర రూపాయలు

దేశీ ప్రెస్,
విజయవాడ-2.



సంపాదకులు:
బొందలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ.

# రెండు మాటలు......

వ్యక్తిగతమైన జాబుల్లోగాని రచయిత 'తను' కనపడడు. కథలలో, నవలలలో, నాటకాల్లో పాత్రల ప్రభావంతోనో, సంఘటనల పరంపరలోనో 'తను' మరుగునపడిపోతాడు. అందు చేత రచయిత అభిప్రాయాలు, ఆశయాలు, అభిరుచులు ఒక్క జాబులద్వారానే తెలుసుకోవచ్చు.

అయితే తెలుగులో అలాంటి సాహిత్యం లేదనే చెప్ప వచ్చు. అలాంటి సాహిత్యసృష్టి కష్టసాధ్యమైన పనికూడాను. అసలు ఎవరూ తమ ఉత్తరాలకు కాపీలు వుంచుకోరు. ఉత్తరం అందుకున్నవారుకూడా వాటిని జాగ్రత్తగా వుంచేవారుకూడా అరుదే!

కాని శరత్ తను వ్రాసే జాబు లన్నిటికీ నమూనా లుంచుకునో, లేక పత్రికలలో ప్రచురించుతూనో వచ్చారు. ప్రసిద్ధ బెంగాలీ రచయిత శ్రీ వ్రజేంద్రనాథ్ పత్రికల, శరత్ చంద్రుని మిత్రుల సాయంలో చాలా ఉత్తరాలను సేకరించి పుస్తకంగా ప్రచురించారు; ఇప్పటికీ ఒకటీ అరా సేకరించి ప్రచురించుతూనే వున్నారు.

ఈ పుస్తకం శ్రీ వ్రజేంద్రగారి పుస్తకానికి అను వాదమే. వారు సేకరించిన ఉత్తరాలన్నీ ఇందులో వున్నాయి; ఇంకా లభించితే మలిసంస్కరణలో చేర్చగలం.

సంపూర్ణ శరత్ సాహిత్యాన్ని తెలుగులోనికి తీసుకు వచ్చిన మేము 'శరత్ ఉత్తరాలను', 'శరత్ జీవితాన్ని' ప్రచురించి 'చంద్రుని కొక నూలుపోగన్నట్టు' శరత్‌ని ఇంకా తెలుగు పాఠకుల హృదయాలకు దగ్గరగా తీసుకురావా లనుకున్నాం. ఆ ప్రయత్నంలో మొదటి మెట్టే ఇది. సంపూర్ణ, సమగ్ర శరత్ జీవితం కూడా త్వరలో నే వస్తుంది.

—సంపాదకులు.



# శరత్ ఉత్తరాలలోని వ్యక్తులు.

1. ఉపేంద్రనాధ్ గంగోపాధ్యాయ : శరత్‌కి వరుసకు మామ. ప్రసిద్ధ బెంగాలీ నవలాకారుడు. 'విచిత్ర' అను బెంగాలీ మాస పత్రిక సంపాదకుడు. శశినాధ్, రాజపథ, అమూలతరు, అస్తరాగ్, దిక్‌శూల మొదలైన నవలలు. నవగ్రహ, గిరికా ఆదిగాగల కథా సంపుటములు 'ఆత్మకథ' వీరి ముఖ్య రచనలు.

2. ప్రమథనాధ భట్టాచార్య : శరత్ చంద్రుని మిత్రుడు, సాహిత్య ప్రియుడు.

3. ఫణీంద్రనాధ్ పాల్ : 'యమున' పత్రిక సంపాదకుడు. వీరిపత్రిక లోనే మొట్టమొదట శరత్ చంద్రుని రచనలు తరుచు ప్రచురింపబడుతూ ఉండేవి. దానివల్లనే వారు సాహిత్య జగతిలో ప్రఖ్యాతులయ్యారు.

4. హేమేంద్ర కుమార్‌రాయ్ : ప్రసిద్ధ కథకులు, నవలాకారులూ. చాలా అపరాధ పరిశోధక నవలలు కూడా వ్రాశారు. పసరా, మధు పర్క, సిందూర్ చుపడీ, మాలాచందన్ ఆదిగాగల కథల సంపుటులు; ఆలేయార్ ఆలో, జహేర్ అల్‌పనా, కాలవైశాఖీ, పాయేర్‌ధులో మొదలైన నవలలు వ్రాశారు. 'యౌవనేర్‌దాన్' అను వీరి కవితా సంపుటికూడా వుంది.

5. హరిదాస్ చటోపాధ్యాయ : శరత్ చంద్రుని పుస్తకాలు ప్రచురించిన గురుదాస్ చటోపాధ్యాయ అండ్ సన్సు యజమాని.

6. మణిలాల్ గంగోపాధ్యాయ : 'భారతి'పత్రికకు సంపాదకులు. పాశ్చాత్య కథలను అనువదించటంలో దక్షులు. కల్పకథా, అల్‌పనా, ఝూంప్, మహువా, సాపడీ, జలఛవి మొదలైన కథల సంపుటములు, •ముక్తార్ ముక్తి అను నాటకం వ్రాశారు.

7. సుధీర్‌చంద్ర సర్కార్ : శరత్ చంద్రుని సాహితీ మిత్రుడు. బాల సాహిత్యకారుడు. 'మధుచక్ర' అనే పిల్లల పత్రికకు సంపాదకుడు'

8. మురళీధరవసు : బాల సాహిత్య స్రష్ట, శరత్ చంద్రుని మిత్రుడు.

9. ప్రమథనాథ్ చౌదరి : ప్రసిద్ధ బెంగాలీ కవి, కథకుడు, నవలాకారుడు, వ్యాస రచయిత. 'సబుజపత్ర' సంపాదకుడు. వీరబలేర్ హాల్ ఖాతా, నానా కథా, వీరబలేర్ టిప్పణి, నానాచర్చ, ఘర్‌బహిరే, మొదలైన వీరి వ్యాససంపుటములు, నీలలోహితేర్ ఆదిప్రేమ, చార్ యారీకథా ఆదిగాగల కథల సంపుటములు వచ్చాయి. దర్శన, సంగీతం, రైతుసమస్యలమీద చారిత్రకమైనవి, ఇంకెన్నో పుస్తకాలు వ్రాశారు. వీరి హాస్యరచనలు తరుచు వీరబల్ పేరున ప్రచురింపబడుతూ వుండేవి. వీరు రవీంద్రుని బావగారు.

10. లీలారాణీ గంగోపాధ్యాయ : శరత్ చంద్రుని శిష్యురాలు, కథా రచయిత్రి.

11. హరిదాస్ శాస్త్రి : శరత్ చంద్రుని మిత్రుడు.

12. అక్షయచంద్ర సర్కార్ : సాహిత్య ప్రియుడు. శరత్ చంద్రుని ఆత్మీయుడు.

13. దిలీప్ కుమార్ రాయ్ : ప్రసిద్ధ బెంగాలీ నాటక రచయిత ద్విజేంద్రలాల్ రాయ్ కుమారుడు. నవలాకారుడు, వ్యాస రచయిత. గాయకుడు, అరవిందుని శిష్యుడు. మనేర్ పరస్, రంగేర్ పరస్, బహువల్లభ, దుధారా, దోలా మొదలైనవి వీరి ప్రసిద్ధ నవలలు. తీర్థకర్ మొదలైన ఎన్నో వ్యాస సంపుటములు ప్రచురితమైనాయి. యాత్ర, సంగీతం, ఇంకా ఎన్నో విషయాలమీద చాలా వ్యాసాలు వ్రాశారు. శరత్ చంద్రుని 'నిష్కృతి' వీరు ఇంగ్లీషులోనికి అనువదించారు. శరత్ వీరిని తరుచు 'మంటూ' అని సంబోధించేవారు.

14. భూపేంద్రకిశోర్ రక్షితరాయ్ : విప్లవ యోధుడు, శరత్ చంద్రుని మిత్రుడు. 'వేణు' అను పత్రికకు సంపాదకుడు.

15. కృష్ణేంద్రు నారాయణ బౌమిక్ : 'భోటరంగ' అను హాస్యరస పత్రికకు సంపాదకుడు. శరత్ చంద్రుని భక్తుడు, సాహిత్య ప్రియుడు.

16. అతులానందరాయ్ : శరత్ చంద్రుని భక్తుడు, సాహిత్య ప్రియుడు.

17. అవినాశచంద్ర ఘోషాల్ : శరత్ చంద్రుని మిత్రుడు. 'వాతాయన్' అను పత్రికకు సంపాదకుడు.

18. మతిలాల్ రాయ్ : అరవిందఘోష్ భక్తుడు, అనుయాయి. అనేక భీమా కంపెనీల నిర్వాహకుడు. ప్రవర్తక్ అనే మాస పత్రిక సంపాదకుడు. దర్శనశాస్త్ర రచయిత.

19. పశుపతి చటోపాధ్యాయ : నాటక కర్త, పత్రికా రచయిత. శరత్ చంద్రుని భక్తుడు.

20. జహాన్ఆరా చౌదరి : 'వర్షవాణి', 'బేగమ్' సంపాదకురాలు.

21. కాజీఅబ్దుల్ బదూద్ : శబ్దకోశములు, నవలలు, వ్యాసాలు, జీవిత చరిత్రలు వ్రాశారు. మీరపరివార్, హిందూ ముసల్మాన్, గేటే, క్రీయేటివ్ బెంగాల్ మొదలైనవి వీరి రచనలు.

22. ఉమాప్రసాద్ గంగోపాధ్యాయ : కీ. శే. అశుతోష్ ముఖర్జీ పుత్రుడు. సాహిత్య ప్రియుడు, 'వంగవాణీ' సంపాదకులు. ఈ పత్రికలోనే శరత్ చంద్రుని 'పథేర్‌దాబీ' మొదటిసారి సీరియల్‌గా ప్రచురితమైంది.

23. రవీంద్రనాథ్ టాగూర్ : పరిచయం అనవసరం, విశ్వకవి.

24. కేదార్‌నాథ్ ఉపాధ్యాయ : ప్రసిద్ధ కథకులు, నవలాకారులు. బెంగాలీ సాహిత్యంలో 'దాదామోసాయ్' పేరున ప్రఖ్యాతి గన్నవారు

వీరు శేషప్రశ్న, అమరాకి వోకే, కబులతి, సాథేయ్, దుక్కేర్, దివాళీ మొదలైన లెక్కకు మించిన నవలలు, కథలు వ్రాశారు. వీరు బక్సర్ విద్రోహ సమయంలో తిన చైనా యాత్రవివరణ యిచ్చారు.

25. చారుచంద్ర వంద్యోపాధ్యాయ : నవలాకారుడు. యమునా పులినే, భిఖారిని, దోటానా, చోర్, కాంటా, హేర్ ఫేర్, హై ఫేన్ మొదలైనవి వీరి ప్రసిద్ధ రచనలు.

26. మహేంద్రనాథ్ కారక్ : బెంగాలులో పోద్ అను నిమ్నజాతి పుద్ధారకుడు. 'పౌండు క్షత్రియవంశ పరిచయ' అను పుస్తకం వ్రాశారు. శరత్ భక్తుడు.

27. అమల్ హోమ్ : ప్రసిద్ధ పత్రికా రచయిత, సాహిత్య ప్రియుడు శరత్ చంద్రుని భక్తుడు.

28. సురేంద్రనాధ గంగోపాధ్యాయ : సాహిత్య ప్రియుడు వరుసకు శరత్ చంద్రునికి మామ.

29. మణీంద్రనాధరాయ్ : సాహితీ ప్రియుడు. శరత్ చంద్రుని మిత్రుని కుమారుడు.

30. బుద్ధదేవ భట్టాచార్య : శరత్ అభిమాని, సాహిత్య ప్రియుడు. వృక్ష శాస్త్రాధ్యాపకుడు.



రంగూన్,
10-1-1913.

శ్రీ ఉపేంద్రనాథ గంగోపాధ్యాయునికి !

నీ ఉత్తరం చేరింది. నా కోపం పోయింది. రెండు రోజుల క్రితం ఫణీంద్ర్ కూడా ఒక ఉత్తరం రాశాడు; 'చరిత్ర హీనులు' పంపించాడు మీ మీద నాకు కోపం వచ్చినా ఎన్నాళ్ళో ఉండదు. ఇప్పుడు నాకేమీ కోపంలేదు. కాని నిన్న మొన్నటి వరకూ కోపంగానే ఉన్నాను. ఉత్తరానికి జవాబైనా రాయకుండా మీరేం చేస్తూ ఉంటారో నా కర్థంకాదు. ఒక్కొక్కప్పుడు మతి తిరిగిపోతూ ఉంటుందా యేమిటి? ఎవరేపని చేసినా బాగా ఆలోచించే చేస్తారని నే ననుకుంటాను. అదే నాకు ఉన్న దురలవాటు. 'సెన్సిటివ్' (సున్నితమైన) అనే ఆంగ్ల పదం ఉందికదూ! నాలో అది ఒకపిసరు అధికంగానే ఉంది. సురేంద్ర్ కు రెండువారాల క్రితం రాశాను ఒక ఉత్తరం. ఇంతవరకు జవాబులేదు—వీళ్ళు ఉత్తరాలు ఎందుకు రాస్తారో హఠాత్తుగా ఎందుకు రాయటం మానేస్తారో నాకు అర్థం కాకుండా ఉంది. నువ్వు సమాజానికి 'కాశీనాథ్' ఇవ్వటం నాకు బాగుండలేదు. చిన్నప్పుడు అభ్యాసంకోసం రాసిన కథ అది. 'భోరుషు'లాంటి కథే అది.........అచ్చువేయించటం మాట అలా ఉంచు... ఇతర్లకు చూపించటానిక్కూడా నా కిష్టలేదు. అది ముద్రితమై నా పేరుప్రతిష్టలు మట్టిపాలు కాకుండుగాక ! 'భోరుషు' ముద్రించారు, చాలు.

యమునపట్ల నాకు ఆదరణ లేకపోవటం ఏమిటి? చేతనైన సాయం తప్పకుండా చేస్తాను. కాని చిన్నకథలు రాయాలన్న కోరిక నా కిప్పుడు లేదు. మీారే రాయండి. ఎలా రాయాలో ఆ నియమ నిబంధనలు తెలుపుతాను. 'చరిత్ర హీనులు' ఎప్పుడు పూర్తి అవుతుందో నేను చెప్పలేను. పూర్తి అయిన తర్వాత సమాజపతికే పంపిస్తానని చెప్పలేను. నువ్వు కలకత్తాలోనే ఉంటే నీకే పంపిస్తాను. 'కాశీనాథ్' అచ్చు వెయ్యవద్దని సమాజపతికి ఉత్తరం రాయి. అది అచ్చువేస్తే మాత్రం నేను తలెత్తుకు తిరగటానికి వీల్లేదు. రెండు మూడు కథలురాసి పంపమన్నావు. ఒకవేళ రాయగలిగితే ఎవరెవరికి పంపిస్తాను?—నీకా? ఫణికా?

ఒక రహస్య విషయం; నీకే రాస్తున్నాను: గిరి అప్పుడు చాల చిన్నవాడు... అంటే నేను సపరివారంగా ఇవతలికి వచ్చేసి నప్పుడు, ఇన్ని సంవత్సరాలు గడచిన తరువాత ఇప్పుడు నేనతనికి గుర్తు ఉండకపోవచ్చు. ఇంకో సంగతి: ఒకనాడు నే నతని పుస్తకాన్ని కొనాలనుకున్నాను. నేను డబ్బులు పెట్టికొంటే అతను బాధపడతాడని నువ్వు చెప్పావు. అందుచేత నేను కొనలేదు. ఒక ప్రతి పంపించ వలసిందిగా కోరుతూ ఉత్తరం రాశాను. కాని అతను పంపలేదు. చిన్నప్పటినించీ అతని ప్రవృత్తి నాకు తెలుసు. ఉత్తరాలు నేను రాస్తున్నాను కాబట్టి వాళ్ళూ రాస్తున్నారు. వాళ్ళు ఒక లిఖితమాస పత్రిక నడుపు తున్నారు. ఇంతవరకూ ఒక్క ప్రతికూడా నాకు వాళ్ళు చదవటానికి పంపించలేదు. బహుశః నావంటి మూర్ఖుడికి వాళ్ళ పత్రికలోని అంశాలు గ్రాహ్యం కావని అభిప్రాయ పడుతున్నారు

కామాలు! పోనీ, అందుకు విచారించవలసిన అవసరం లేదు. ప్రపంచరీతి అలాగే ఉంటుంది కామాలు! ఇప్పుడు నా ఆరోగ్యం బాగానే ఉంటోంది. స్ఫోటకం పోసి నయమైంది. ఇప్పుడు నేను ఎక్కువగా చదవటం మానేశాను. అసంపూర్తిగా విడిచిపెట్టిన 'మహాశ్వేత' (తైలచిత్రము) ను నెమ్మదిగా పూర్తిచేస్తున్నాను. నువ్వు ఒక పెద్ద నవల రాస్తున్నావుకదూ! వకీలు వృత్తి చేస్తూ ఉన్నా రచన మానివేయ నక్కర్లేదు.

నే నీ దేశం విడిచిపెట్టి కలకత్తా రావటం పడకపోవచ్చు. ఇక్కడ నా ఆరోగ్యం బాగుండక పోవచ్చు. బాగుండపోయినా సరే నే నక్కడికి రావటం సముచితం కాదనిపిస్తోంది. నా ఫౌంటెన్ కలం నీ చేతిలో అక్షయం ఔగాక! అది చాలా చాలా రాసింది. అవసరం పడితే ఇంకా చాలా రాయగలదు.

ఇంతే సంగతులు. 'చంద్రనాథ్' పూర్తి అయితే, సురేంద్ర్ వొప్పుకుంటే, వీలైనంత వరకు సరిదిద్ది ఫణికి పంపుతాను. జవాబు రాయి.

—శరత్.

౨

24, జాన్‌స్ట్రీట్
రంగూన్, 26-4-1913.

శ్రీ చరణములకు:

నీ ఉత్తరం చూచి చాల ఆశ్చర్యపోయాను. అంతకు నూరురెట్లు దుఃఖపడ్డానుకూడా. 'నువ్వు నన్ను ద్వేషిస్తున్నావు' అని నేను అంటానా? నువ్వు నమ్ముతావా? మనం కలకత్తాలో

కలిసివున్న దినాలు నేను మరచిపోలేదు. నేను స్వతహా అనేక విషయాలు మాత్రం ఇంత తొందరగా మరచిపోను. అసలు మరచిపోలేనేమోకూడాను. ఒకసారి నన్ను, నా మాటల్ని స్మృతికి తెచ్చుకున్నావంటే... 'నువు నన్ను ద్వేషిస్తున్నావు' అనేమాట నా నోటినుంచి వెలువడదని గ్రహించుకుంటావు. నా తత్వం నీకు బాగా తెలుసునని నా అభిప్రాయం. నువు నా మంచికోరేవాడివి, ఆత్మీయుడివి, దగ్గరచుట్టానివి. మీ అన్న దమ్ముల్లో ఏదో వివాదం వస్తే నేను జోక్యంకలగజేసుకుంటానా? నువు నన్ను ద్వేషిస్తున్నావన్నమాట నే నన్నానని నువు నమ్మావా! నమ్మి ఇలా ఉత్తరం రాయటానికి నువు ఎలా సాహసించావు? నేను చెడ్డవాడినే కావచ్చు. అయినా అంత అధమవ్యక్తినా?. నేను అటువంటిమాట కలలోకూడా అను కోను. నువు నా మనస్సుకు చాల బాధ కలిగించావు. ఇలా అనవసరంగా నాకింత బాధ కలిగించినందుకు నా మరణా నంతరం నువు కూడా చాల విచారపడతావు. నువు నన్ను చాల నీచుడుగా భావిస్తున్నావు కామాలు. నీ ఉత్తరం చదువుకున్న తరువాత నా కలాగే తోస్తున్నది. బహుశః నే నంత మూర్ఖుణ్ణి, నీచుణ్ణి కావటం వల్లనే...కలకత్తాలో మనం అంత సన్ని హితంగా ఉన్న రోజుల్ని కూడా మరచిపోయి...నువు ఆ మాట విశ్వసించి ఉండవచ్చు. ఇప్పటికైనా ఆ యపోహ నీకు లేనట్లు వెంటనే తెలుపమని నా ప్రార్థన. 'నా మీద నీకు ద్వేషం ఉండబట్టే కామాలు ఆ పుస్తకాలు అచ్చువేయించటానికి పూనుకున్నావు'—అంటూ సురేంద్ర్‌కు కొద్దిరోజుల క్రితమే ఉత్తరం రాశాను. అలా ఎందువల్ల రాశానంటే—సమాజపతికి

నేనుకూడా రాశాను ఆ పుస్తకాల్ని అచ్చువెయ్యొద్దు అని. అందుకు జవాబేమీ ఇవ్వకండానే అచ్చువేయటం ఆపలేదు — సరికదా, సాగిస్తూనే ఉన్నారు. ఏమైనా గానీ, ఇప్పుడు లోగుట్టు తెలిసివచ్చింది. నువ్వుకూడా సమాజపతికి ఆమాటే చెప్పావు. అతని విషయం ఇప్పుడింకా ఎక్కువగా తెసులుకో గలిగాను. నువ్వు నా మంచికోరేవాడివని నాకు నమ్మకం ఉండబట్టే ఈనాడు నేను ఇటువంటి కథలు రాయగలుగు తున్నాను. నేను మానవ హృదయాన్ని ఎరుగుదును 'నేను శరత్‌ను నిజంగా ప్రేమిస్తున్నాను' అని నువ్వు నిస్సంకోచంగా భగవంతుని ముందు చెప్పగలవు; నాకు తెలుసా సంగతి

పోనీ, ఆ సంగతికేమి......ఒక్క 'చంద్రనాథ్' ను పురస్కరించుకుని ఇంత హంగామా ఎందుకు? దాన్ని ఫణి తన పత్రికలో ఎలా ప్రచురించగలుగుతాడో నాకు దుర్గ్రాహ్యంగా ఉంది.

మీరందరూ విషయం సొంతంగా తెలుసుకోకుండా, ముందు వెనకలు ఆలోచించకుండా నన్ను ఇలా నాలుగు మూలలనించీ అర్థించి చాల పిచ్చిపనే చేశారు. దాని ఫలి తమూ అనుభవిస్తున్నారు. తప్పంతా మీదే; మరెవ్వరిదీకాదు; ఫణికోసంగాను నువ్వు ఇరకాటంలో పడినట్టు అడుగడుగునా తెలుస్తూనే ఉంది.

నేనూ ఇప్పుడు సంకటంలోనే పడ్డాను. 'చంద్రనాథ్' ఉన్నది ఉన్నట్టుగానే ప్రచురించటం నా ఉద్దేశంకాదు. అయినా కొంత భాగం ప్రచురితమైపోయింది. మిగిలిన భాగమైనా సవి రించటానికి నా దగ్గరలేదు. పంపిస్తే తిరిగి తనకు చేరదేమోనని

సురేంద్ర్ చాల భయపడుతున్నాడల్లేఉంది. అతనికి నా రచన లంటే చాల ఆదరం. అందుకనే అతడు తటపటాయిస్తున్నా డనుకుంటా.

మరో సంగతి: 'భారతవర్ష' లో ప్రచురించేందుకు ప్రమధబాబు 'చరిత్రహీనులు' పంపవలసిందిగా కోరుతున్నాడు. చివరకు ఈ విధంగా గందరగోళం అయింది. ఏం చెయ్యను? అతడు నాకు ఎన్నాళ్ళనుంచో మిత్రుడు. తన పత్రికలో 'చరిత్ర హీనులు' ప్రచురిస్తాననీ, ఆ ఆశతోనే... ప్రచురణార్థం వచ్చిన నాలుగైదు నవలలను తిరిగిపంపించి వేశాననీ అందరితో చెబు తున్నాడు. ఇది 'భారతవర్ష' సంపాదకుని కథ. మరో వైపున 'యమున' లో 'చరిత్రహీనులు' ప్రచురిస్తామని ప్రకటించారు. సమాజపతికూడా అడుగడుక్కీ రిజిష్టరు ఉత్తరాలు రాస్తు న్నాడు. నేనేం చెయ్యాలో అర్థంకావటం లేదు. ఇప్పుడే వచ్చింది ప్రమధనాద్ విచారం సూచిస్తూ రాసిన ఉత్తరం... పెద్ద ఉత్తరం. అది అతనికి పంపకపోతే తాను లోకులకు ముఖం చూపించలేడట. తన మిత్రులందర్నీ వొదులుకోవలసి వస్తుందిట. ఏం చెయ్యమంటావు? కాస్త ఆలోచించి జవాబురాయి. ఈ వ్యవహారమంతా మొదటినుంచి చివరిదాకా నీకు తెలుసు. కాబట్టి నీ సలహా అవసరం.

ఆరోగ్యం ఏమీ బాగుండటం లేదు. ఏడెనిమిదిరోజుల నించీ జ్వరం వస్తోంది. అవసరమనితోస్తే ఈ ఉత్తరం సురేంద్ర్‌కు చూపించు. మీ అన్నదమ్ములు మీలో మీరు ఎంతైనా వివాదపడండి. కాని నేను మీకు ఒకప్పుడు ఉపాధ్యాయుడను. కనీసం పెద్దవాడిననైనా అయినా గౌరవించండి. —శరత్.

(ఫణిబాబూ! ఈ ఉత్తరం నువు చదువుతుని ఉపేంద్ర్‌కు పంపించు.)

3

24, డాల్హౌస్ స్ట్రీట్,
రంగూన్; 10 - 5 - 1913.

ప్రియ ఉపేంద్ర్ !

ఇవాళ నీ ఉత్తరంతో పాటు ప్రమథనాథ్ ఉత్తరంకూడా చేరింది. నీకు నా యెడల కలిగిన అపోహ తొలగినందుకు నాకు కలిగిన సంతృప్తిని వర్ణించటం చాలా కష్టంగా ఉంటుంది. నీ హృదయంలో ఇప్పుడేవిధమైన క్లేశంగాని, దుఃఖంగాని లేదు. కాబట్టి అతి సహజంగా నా కర్తవ్యాన్ని నిర్ధారణ చేయగలిగావు. నేనొక మూర్ఖుడనని రాశాను. అది అబద్ధం అంటావా ? మీ ముందు నేనొక పండితుణ్ణిగా భావిస్తానా ? అంత అహం భావమా నాకు? ఏవో కొన్ని కథలు సృష్టిస్తాననుకో. అందులో పాండిత్యం ఏముంది ? బి. ఎ, ఎం. ఏ, బి యల్-ఇత్యాది డిగ్రీలను నేను గౌరవిస్తానని రాశాను. నా కథలకు తన మిత్ర బృందంలో మంచి ప్రచారం లభించినట్లు ప్రమథ బాబు రాశాడు. ద్విజేంద్రలాల్ రాయ్ నమ్మటానికి వీల్లేనంత అధికంగా ప్రశంసించాడు. 'నారీర్ మూల్య' అమూల్యవస్తువుగా పరిగణింపబడుతోంది. నా కథల్లాంటి కథలు రవిబాబు కూడా రాయలేదనీ, వంగభాషలో ఇటువంటి వ్యాసం ఇంతకుపూర్వం ఎక్కడా లేదనీ ద్విజబాబు రాస్తున్నాడు. నిజానిజాలు భగవంతునికి తెలియాలి. ఫణిబాబు నడుపుతూన్న ప్రతిక చాల చిన్నది. కాని అటువంటి మంచి పత్రిక మరొకటి లేదు. ఇలాగే కష్టించి తన పత్రికను ఫణి సాగిస్తాడుగాక ! ఇప్పుడే గాకపోయినా, ఏనాటికైనా శ్రీవృద్ధి సిద్ధిస్తుంది. కాని ప్రయత్నము, పరిశ్రమ అవసరం. అతడు నాకు తమ్ముడు లాంటివాడు. అతని పత్రికనించి ఎలాగో

తప్పించుకుంటే మరో పత్రికవచ్చి మీదపడుతుంది. ఈ సమయంలో నాకుపది చేతులు ఉన్నా పనిసాగేలా కనిపించటంలేదు. 'చరిత్రహీనులు' అతని పత్రికలో ప్రచురితం కాదని నీకెవరు చెప్పారు? ప్రమథబాబుకు చదువుకోటానికంటూ ఇచ్చాను. అతడు దాన్ని తన పత్రికలోనే ప్రచురిస్తానని చెబుతూ వుండవచ్చు. కాని అందుకు నా సమ్మతి ఉండాలికదా! కాని వాళ్లు నా సమ్మతి అడగటంలేదు. రాత ప్రతి చూచి అతడు భయపడి పోయినట్టు కనిపిస్తుంది. సావిత్రిని అతడు కేవలం పరిచారికను గానే అర్థం చేసుకున్నట్టున్నాడు. కాని అతను కన్నులు తెరచి చూడగలిగితే... కథ ఎలా ఏ విధంగా ముగుస్తుందో ఊహించుకోగలిగితే... ఏ బొగ్గులోనించి ఎలాంటి అమూల్య వజ్రం ఉత్పన్న మాతుందో తెలుసుగలిగితే... ఇంత తేలిగ్గా దాన్ని విడిచిపెట్టడు, చేతుల్లోకి వచ్చిన రత్నాన్ని పోగొట్టుకున్నానే అని అతడు ఏనాటికైనా పశ్చాత్తాపడి తీరుతాడు. ఉపసంహారం ఎలా ఉంటుంది? అని అతడు ప్రశ్నిస్తున్నాడు. మొట్టమొదటి సారిగా ఈ నవలను తన పత్రికలో ప్రచురించుటానికి కతడు వెనకముందాడు తున్నాడంటే ఆశ్చర్యంమేమీ లేదు. కాని వాళ్ళే అంటున్నారు 'చరిత్రహీనులు'లో చివరిభాగం (మీరు చదివినంతవరకు) రవిబాబు రచనల్ని మించిపోయింది అని; అంటే శైలిలోను కథా సంవిధానంలోను, కాని ఉపసంహారం నేనెక్కడ పాడు చేస్తానో అని అతని భయం ఒక 'మెస్' లోని పరిచారికను తీసుకొచ్చి ప్రారంభంలోనే పరిచయం చేసిన రచయిత చివరిదాకా తన రచనా పాటవాన్ని కాపాడుకోగలుగుతాడని అతడు విశ్వసించలేక పోతున్నాడు. అంత మాత్రం

కూడా చాతగాకపోతే ఇంతవరకూ మీ గౌరవాన్ని చూరగొన గలుగుతానా? ఇంకో సంగతి: 'భారతవర్ష'ను నా పత్రిక గానే చూచుకోవలసిందిగా ప్రమథబాబు కోరుతున్నాడు. అలాగే చూచుకుంటున్నాను కూడా. నాకు సాధ్యమైనంత వరకు సాయం చేస్తానని కూడా రాశాను. ఎంతవరకు సాధ్య మౌతుందో మాత్రం తెలుపలేదు. అతడు వెలయిచ్చే రచనలను పుచ్చుకుంటాడట. వెల యిచ్చినంత మాత్రాన్నే అందరి రచ నలూ లభించవు. నా విషయంలో ఈ అంశం ఈపాటికతనికి తెలిసే ఉంటుంది. 'చరిత్రహీనులు' నా చేతిలోకి రావటం తోనే ఫణికి పంపుతాను నా దగ్గరఉంచుకోను. కాని ప్రమథ బాబు మాత్రం తాను ఫణికి దాన్ని ఇవ్వడు. ఫణిమీద అత నికి కొంచెం కోపం ఉంది. అంతేకదా! మాసపత్రికల సంపాద కులు పరస్పరం కలిసి మెలిసి ఉండరు, అది సహజం. ఏమైనా ప్రమథబాబు నాకు బాల్యమిత్రుడేకాదు, మిక్కిలి సన్ని హితుడు. కపటంలేని మనిషి, చాల మంచివాడు. అతడంటే నాకు చాల ప్రీతి అందుచేత అతని పట్టుదలకు నేను లొంగి పోవలసి వస్తుందేమో చెప్పలేను. ఈ విషయమై వివరాలు మున్ముందు తెలుపుతాను.

"మీరంతా 'యమున'ను అభివృద్ధికి తేగలరు—" అని రాశావు. 'మీరంతా' అంటే ఎవరినీ? నువ్వుకూడా 'యమున' అభివృద్ధిని కోరేవాడివే. నిస్వార్థంగా దానికోసం పాటుపడు తున్నావు. కాబట్టే నీ విషయమై నా చెవినిపడిన కొన్ని సంగ తుల్ని నేను నమ్మలేను. ఏదో కొంత కూటనీతి సాగుతోంది కాబోలు! పోనీ, మనం ప్రేమించేవాళ్ళను అలాగే సాయం

ఉత్కృష్టమైనది. 'యమున'లో ప్రచురితం కావాల్సిన వ్యాసాల మాట! వ్యాసాల అవసరంకూడా ఉంది. కథలు మూలాన్నే పత్రికకు విలువ వస్తుందని చాలామంది పెద్దలు భావించరు. చిన్నకథలు రాయమని నన్ను మీరు నిర్బంధించకుండా ఉంటే,...వాటినుంచి మీరు నాకు కాస్త వెసులుబాటు కల్పిస్తే వ్యాసాలుకూడా రాస్తాను. కథలు లాగానే సుస్పష్టమైన ధారాళమైన శైలిలోనే రాస్తాను. ఈ విషయంలో నీ ఉద్దేశం రాయి. చిన్నకథలు రాసేపని మీరు పెట్టుకోనట్లయితే నేను నవలలు, వ్యాసాలు రాస్తాను. లేకపోతే నేను రాత్రిళ్లుకూడా శ్రమపడాల్సి వుంటుంది. నా ఆరోగ్యం బాగుండటం లేదు. రాత్రిళ్లుకూడా శ్రమపడలేను. అందువల్ల గ్రంథ పఠనంకూడా కుంటుపడుతుంది. విమర్శనలు; వ్యాసాలు, చిన్న కథలు, నవలలు అన్నీ నేనే రాస్తూవుంటే లోకులు నన్ను 'సవ్యసాచి' అని పరిహాసం చేస్తారు. ఇంకా ఇతర పత్రికలకు కూడా ఏమైనా పంపుతూ ఉండాలికదా!

'దేవదాస్', 'పాషాణ్' నీదగ్గర ఉన్నాయి. పంపించు. త్వరగ రాయటానికి ఆరంభిస్తాను. ఫణి మూడు వేలు ప్రతులు ముద్రించి ఎందుకలా డబ్బు వృథా చెయ్యటం? ఆ పత్రిక కొనేవాళ్ళ సంఖ్య అంత ఎక్కువగా ఉందా? నేను అలా అనుకోటం లేదు. కాని వచ్చే యేడాదిలోగా ఆ పత్రిక ఉత్తమ పత్రికల జాబితాలో చేరగలదని నాకు పరిపూర్ణ విశ్వాసం ఉంది.

తన పత్రికను వదిలిపెట్టి నేను ఇతర పత్రికలకు రాస్తానేమోనని ఫణికి అస్తమానం భయంగానే వుంది. ఆ భయానికి

కారణం ఏమిటి? అతడు నాకు తమ్ముడు వంటివాడు. ఈ విషయం అతడు ఎందుకు విశ్వసించలేకపోతున్నాడో అతనికే తెలియాలి, నాకు తెలియదు.

నువ్వు రాసిన 'క్రియ విక్రియ' అనే కథ నిజంగా చాలా బాగుంది. ఇంకా కొంచెం పెద్దదిగా ఉండాలి. అంతిమ ఘట్టాన్ని ఇంకా పొడిగించాలి. అటువంటి కథను అంత తొందరగా ఎందుకు ముగించావో నాకు అర్థంకాలేదు. ఒక్క విషయం జ్ఞాపకం ఉంచుకో. కథ పన్నెండు పదమూడు పేజీలు వుండాలి. పరిణామం స్పష్టంగా కనిపించాలి.

సురేంద్ర నా ఉత్తరానికెందుకు జవాబు రాయలేదు? నేనతనికి నా చేతిలోని కలాన్ని ఇచ్చాను. అతని కిచ్చేందుకు కంతకన్నా మంచివస్తువు నా దగ్గరేమీ లేదు. దాన్ని అతడు సద్వినియోగం చేస్తున్నాడా? అడిగి తెలుసుకుని నాకు రాయి. నా కలాన్ని అతడు నిర్లక్ష్యం చేయకుండుగాక! ఇంకా నలుగురికి కలాలు పంపించాలి. యోగేశ్ ముజుందార్ ఎక్కడున్నాడు? పూంటూ, బూడీ, సౌరీన్–వీళ్ళందరికీ పంపటానికి కలాలు జాగ్రత్తచేసి వుంచాను! ఎప్పుడో ఒకరోజున పంపిస్తాను.

గిరీన్ బంకిపూర్‌కు తిరిగి వచ్చాడా? అతడు ఎక్కడ ఉన్నదీ తెలియకపోవటంచేత ఉత్తరం రాయలేకపోతున్నాను. నావద్ద ఫొటో లేదు. ఈ సంగతి నా కెప్పుడూ స్మృతికి తగల్లేదు.

ఇంకో సంగతి: సాధు కృష్ణ బాగచీ ఒక పెద్ద ఉత్తరం రాసి పంపించాడు. అతడన్నీ అబద్ధాలేనని చెబుతున్నాడు. బాగానే వుంది. ఏవి అబద్ధాలో నాకు తెలుసు. ఎదుటివాడు

తానొక మాట అనలేదు అని చెప్పినతర్వాత ఆ విషయానికి అంతటితో స్వస్తి చెప్పెయ్యాలి. అదే సముచితం. ఫణిబాబూ! నువు టెలిగ్రాం ఇచ్చినాకూడా నేను జాబు రాయలేకపోతున్నాను. ఎందువల్లనంటే నీకు పంపించాల్సిన వస్తువు నా చేతుల్లో లేదిప్పుడు. త్వరలో అది నావద్దకు రాగలదని ఆశిస్తున్నాను.

'నారీకామూల్య' పంపిస్తాను. ఆ తరువాత టపాలో 'చంద్రనాథ్' పంపుత్తాను. 'చరిత్రహీనులు' 'యమున'లోనే ప్రచురితం కావాలని నా ఇచ్ఛ. ఈశ్వరుని యిచ్ఛకూడా అదే అగుగాక! కాని అందులో 'మెస్' పరిచారికను పురస్కరించుకుని కొంత గందరగోళం లేచినట్టు విన్నాను. లేవనీగాక! ప్రజలు ఎంతైనా నిందించగలరు. దేన్ని ఎంత ఎక్కువగా నిందిస్తారో దాన్నే అంత ఎక్కువగా చదువుతారు. మంచిదిగాని, చెడ్డదిగాని, ఒకసారి చదవటానికి ఆరంభించిన తర్వాత చదివి తీరుతారు. అర్థంకానివాళ్ళు, కళారహస్యం తెలియనివాళ్ళు నిందిస్తారు. అలా నిందించటంవల్లనే లాభాలున్నాయి. కాని ఆ పుస్తకం సైకాలజీ దృష్ట్యా నిర్దుష్టంగానే వుంటుంది. అందులో సందేహం లేదు. అది ఒక సంపూర్ణ వైజ్ఞానిక నైతిక నవల. (సైంటిఫిక్ ఎథికల్ నవల.)

—శరత్.

౪

24, [illegible] స్ట్రీట్,
రంగూన్, 22 ఆగస్టు 1913.

ప్రియ ఉపేన్!

చాలా రోజులను నీకు ఉత్తరం రాయటానికి కూచున్నాను. నువ్వుకూడా చాలారోజులదాకా నీ క్షేమ సమాచారాలు తెలుపలేదు. తెలుపబోకు. నేనేమీ విచారపడను; ప్రాశ్నేయ పడను. రెండుమూడు నెలలైన తరవాతనైనా సాక్షాత్కరించకపోవు అప్పుడన్ని విషయాలు తెలుస్తాయి.

ఈనెల 'యమున' సంచికవచ్చింది. అందులో నువ్వు రాసిన 'లక్ష్మీలాభం' చదివాను. దాన్నిగురించిన నా అభిప్రాయం నీ మాటల్లోనే చెబుతాను; 'తండ్రిముఖతః కుమారుని గూర్చినప్రశంస విన్నందువల్ల లాభం లేదు. నిజం చెబుతున్నాను. అటువంటి మధురమైనకథ నేనీమధ్య ఎన్నడూ చదవలేదు. నువ్వు రాసిన కథలన్నింటిలోకీ అది చాలా బాగుంది. అనవసరమైన ఆడంబరం ఏమీలేదు కథలో. మానవుల్లోని దోషాలు చూపించటం, ప్రపంచంలోని కష్టాల్ని ప్రదర్శించటం... అటువంటి వేమీ లేవు. ఒక చక్కని పుష్పంలాగా, పవిత్రంగా ఉంది. చాలా మనోహరంగా ఉంది. అటువంటి కథలంటేనే నాకు చాలా ఇష్టం. చదివినతర్వాత ఆనందాతిశయంతో కన్నులు చెమ్మగిలకపోతే అదేం కథ! చాలా బాగా రాశావు ఉపేన్! నిజంగా నాకు కలిగిన అభిప్రాయాన్ని చెబుతున్నాను. అప్పుడప్పుడు అటువంటి కథ చదివే అవకాశం లభిస్తూవుండాలి. నిన్ను సంతోష

పెట్టటం తేలిగ్గా సాధ్యంకాదు. ఇటువంటి వస్తువు దొరికిందంటే చాలు. నాకింకేమీ అక్కర్లేదు. నేనింతగా ప్రశంసించటంనీకు అనుమానాస్పదంగా ఉండవచ్చు, అందరూ నా అభిప్రాయంతో ఏకీభవించకపోవచ్చు. అయినా ఒక్క రవిబాబును మినహా నాకుమల్లే లోతు తెలిసినవాళ్లు ఎవరూ లేరనే చెప్పాలి. అది నా అహంభావం అనుకో; గర్వం అనుకో—నా నిర్ణయం అదే. అటువంటి కథ నేనీ మధ్య ఎక్కడా చదవలేదు. మరో కథ ఒకటి నీవు రాసింది... చాల బాగుందిట. 'భారతవర్ష'లో ప్రచురితమైనట్లు విన్నాను. 'భారతవర్ష' పత్రిక నాకింకా రాలేదు. ఎలా రాశావో నాకు తెలియదు. భావనిష్పత్తి లోనూ, రసపరిపాకంలోనూ ఈ కథలాగే ఉన్నట్టయితే అది కూడా వుత్కృష్ట రచనే అయివుండాలి.

నీ శైలికూడా చాల బాగుంది. నీ భాషాపాండిత్యం, పదలాలిత్యం నాకూవుంటే నా కథలు ఇంకా బాగుండేవి. పొరపాటు, నిన్ను నాతో పోల్చాను. నీకు అవమానం కలగవచ్చు. కాని కలిగిన ఆనందాతిశయంలో నన్ను నేను ఆపుకోలేక పోతున్నాను.

కులాసాగా వుంటున్నావు కదా! నాకు ఆరోగ్యం బాగా వుండటంలేదు. ఈ వర్షాకాలం దుఃఖదాయకంగానే వుంది. పది పన్నెండు రోజులనుంచి జ్వరంతో బాధపడి, రెండు రోజులనుంచే మాత్రమే కులాసాగా వుంటున్నాను. నీకు నా శుభాకాంక్షలు.

—శరత్.

డి. ఐ. జి. దఫ్తర్,
రంగూన్, 26 - 3 - 12.

ప్రమథనాథ్ భట్టాచార్యునికి !

ప్రమథ్! నీ ఉత్తరం చేరింది. వెంటనే ఇవాళే జవాబు రాస్తున్నాను. ఇది నా మాటకు భిన్నం. నా స్వభావం తెలిసిన వారిముందు నన్ను గురించి నేను చెప్పుకోవటం బాగుండదు.

నన్ను గురించి కొన్ని వివరాలు అడిగావు కదూ ! క్లుప్తంగా యీ క్రింద తెలుపుతున్నాను :

1. పట్నానికి వెలుపల నదియొడ్డున ఒక యింట్లో కాపురం

2. ఉద్యోగం చేస్తున్నాను. 90 రూపాయలు జీతం, 10 రూపాయలు అలవెన్సు దొరుకుతున్నాయి. భోజనానికి లోపంలేకుండా రోజులు గడుస్తున్నాయి. నిలవ చేయగలుగు తున్నది ఏమీ లేదు.

3. గుండె జబ్బుగా ఉంది. ఏ క్షణాన్నో...

4. చాలా గ్రంథాలే చదివాను. రాసిందిమాత్రం ఏమీ లేదు. గడచిన పది సంవత్సరాల్లోనూ శరీర విజ్ఞానము, జీవ విజ్ఞానము, మనోవిజ్ఞానము, కొంతవరకు చరిత్ర చదివాను.

5. నా సర్వస్వం పరశురామప్రీతి అయింది. నా పుస్త కాలయం, 'చరిత్రహీనులు' వ్రాతప్రతి అన్నీ తగలబడి పోయాయి. 'నారీకాఇతిహాస్' అయిదారు పేజీలు వ్రాశాను, అదీ తగులబడి పోయింది.

ఈ యేసు అచ్చు వేయించాలనుకున్నాను. ఈ పని నాద్వారా కాదని కామాలు అగ్నిదేవునికి స్వాహా అయినాయి. మళ్ళీ ఆరంభించి రాయాలన్న ఉత్సాహం లేదు. 'చరిత్ర హీనులు' నాలుగువందల పేజీలు ఇంచు మించు అంతా పూర్తి అయింది. అంతా భగ్నం అయిపోయింది.

ఇంకో సంగతి చెప్పాలి. మూడేళ్ళ క్రితం గుండె జబ్బు లక్షణాలు కనిపించినప్పుడు గ్రంథపఠనం పూర్తిగా మానివేసి తైల చిత్రాలు గీయటం ఆరంభించాను. ఈ మూడేళ్ళలో చాలా చిత్రాలు గీచాను. అవి కూడా భస్మీపటలం అయిపోయాయి. చిత్రలేఖన ఉపకరణాలు మాత్రం మిగిలాయి.

ఇప్పుడు నన్నేం చేయమంటావు? నీ సలహా ప్రకారం కొన్నాళ్ళు నడిచి చూస్తాను. నవలలు, వ్యాసాలు, చిత్రలేఖనం... దేన్ని మళ్ళీ ఆరంభించమంటావో చెప్పు.

—శరత్.

౯

రంగూన్,

4 ఏప్రెల్ 1913.

ప్రమథ్!

నీ మొదటి వుత్తరానికే నే నింతవరకూ జవాబు రాయలేదు. నువ్వు ఎప్పుడూ నన్నెందుకింతగా ప్రేమిస్తున్నావోనని ఆలోచిస్తున్నాను. చాలరోజుల నించీ నాకిదే ఆలోచనగా వుంది. పమస్! కొంచెం అహంకారం చూపిస్తున్నాను; క్షమిస్తావా?

క్షమించేట్టయితే చెబుతాను: నవలగాని, చిన్నకథగాని నాకంటే బాగా రాయగలవాళ్ళు ఒక్క రవిబాబు తప్ప మరెవరూ లేరు. ఈ మాట సత్యమని నీ మనస్సుకు తోచి నప్పుడే నవలగాని, చిన్నకథగాని, వ్యాసంగాని పంపించమని అడుగు. లేకపోతే అడక్కు. ఇదే నా ప్రార్థన. ఈ విషయంలో మర్యాదకోసం మొగమాటం చూడనక్కర్లేదు. నాకు సత్యం కావాలి......

—శరత్

## ౬

రంగూన్,
17 ఏప్రిల్ 1913

ప్రమథ్!

నీ వుత్తరం నిన్న చేరింది. ఇవాళ జవాబు రాస్తున్నాను 'చరిత్రహీనులు' తిరగ రాసినంతవరకు (ఈమధ్య చాలరోజులు రాయనేలేదు) నీకు చదవటానికి పంపిద్దామనుకుంటున్నాను. ఈసారి టపాలో, కనీసం ఈ వారంలోనే పంపిస్తాను. మరింకేమీ చెప్పేది లేదు. చదివి మళ్ళీ పంపించు. అందులోని శైలి మీలాంటి వాళ్ళకే కథంగానూ బాగున్నట్టు తోచదు. నీకు నచ్చుతుందో, నచ్చదో; నాకు అనుమానంగానే వుంది. కాబట్టి దాన్ని అచ్చు వెయ్యొద్దు. సమాజపతి దాన్ని తనకిమ్మని చాలా పట్టుదలగా అడుగుతున్నాడు. అతనికి బాగానే నచ్చిందట.. ఇవన్నీ నా వ్యర్థమైన రచనలు. వీటిలోని యథార్థభావాన్ని స్పష్టంగా తెలుసుకోటానికి ఎవరు ప్రయత్నిస్తారు? ఎవరికి [illegible]?

నీ పత్రిక 'భారతవర్ష'లో ప్రచురించటానికి ఇది యోగ్యమైన దేనని నీకుతోస్తే ప్రచురించుకోటానికి అనుమతి నేనిస్తాను. అంతేగాని ఏదో నామంచికోరి ప్రచురించినట్లుగా ప్రచురించ వద్దు. సాహిత్యక్షేత్రంలో సత్యంకావాలి. మొగమాటాలు కావు. అదీగాక మీ ద్విజూబాబు (ద్విజేంద్రలాల్ రాయ్) అభిప్రాయం ఎలావుంటుందో చెప్పలేం. అందులో ఏ అంశం అయినా మరోవిధంగా మార్పుచెయ్యటం అవసరమని మీకు తోచవచ్చు. కాని అలామార్చటానికి వీల్లేదు. ఒక్క పంక్తికూడా మార్చనీయను. ఒక్కవిషయం చెప్పాలి: కేవలం పేరునుబట్టి ప్రారంభించిన తీరునుబట్టీ మాత్రమే 'చరిత్రహీనులు' అయినట్లు అనుకోవద్దు. నేను నీతిశాస్త్ర విద్యార్థిని. నాకు నీతిశాస్త్రం బాగానే తెలుసు. అందులో నాకన్నా ఎక్కువ తెలిసినవాళ్ళు ఉన్నారని నేననుకోను. ఏమైనాగాని చదివి మళ్ళా పంపించు. నిష్పక్షపాతంగా నీ అభిప్రాయం తెలుపు. నీ అభిప్రాయానికి విలువవుంది. కాని నీ అభిప్రాయాన్ని తెలిపేటప్పుడు నా గంభీర ఆశయాన్ని కూడా గుర్తుంచుకో. ప్రచురణార్హమైన వస్తువుగా తోస్తే నాకు రాయి. మిగతా భాగంకూడా రాసేస్తాను. నాకు బాగానే జ్ఞాపకంవుంది. కలంపట్టుకుని ఏదితోస్తే అదే రాసేటువంటి వాణ్ణికాదు. మొదటినుంచి చివరిదాకా ఒక వుద్దేశం పెట్టుకునే రాస్తాను సన్నివేశాల పరంపర మారదు. 'యమున' వైశాఖ మాసపత్రిక ఎలావుంది. 'పథేర్దాబీ' అర్థం అయిందా? వెంటనే జవాబు రాయి.

—శరత్.

౮

రంగూన్,
24 మే 1913.

ప్రమథ్!

రంగూన్ గజెట్‌లో ద్విజూబాబు మరణవార్త చదివి చాల ఆశ్చర్యపోయాను. అతన్ని నేను బాగా ఎరుగుదును. అయితే నీకు ఉన్నంత పరిచయభాగ్యం నాకు లేకపోవచ్చు. అయినా ఆయన్ను గురించి నాకు బాగానే తెలుసును.

ఆయన సాహిత్యపరుడు, వీరుడు. ఆయనకు నా విలువ తెలుసు. ఒకవేళ తెలుసుకోలేకపోయినా వారిముందు నేను సిగ్గుపడ నవసరంలేదు. అందుకనే రాసి పంపించుదామనుకున్నాను. బాగుంటే ప్రచురిస్తారు, లేకపోతే ప్రచురించరు. ఇందులో అభిమాన పడవలసిన అవసరం ఏమీలేదు కాని ఆ కాగితాలనుబట్టి నా విలువ లెక్క కడతారు. ప్రచురణ యోగ్యంగానే తోచవచ్చు. లేకపోతే చింపి పారెయ్యి; లేదా ఫైల్లో పెట్టుకో అంటారు. కాబట్టి ప్రమథ్! నన్ను క్షమించు. నువ్వు నాకు ఎటువంటి మిత్రుడివో నాకు తెలుసు. ఆ సంగతి నేను ఒక్కనాటికీ మరచిపోను. నువ్వు ఒకవేళ నన్ను అపార్థం చేసుకున్నా, నామీద కోపగించుకున్నా నా స్నేహభావం అచంచలంగానే ఉంటుంది. కాని ఇప్పుడిది వేరే సంగతి. మరో పత్రికను పురస్కరించుకుని నా మర్యాద పోగొట్టుకోటానికి నే నంగీకరించను. నేను చిన్న పత్రికల్లోనే రాస్తాను. నాకు అది చాలు. నాకు అక్కడ గౌరవం. అదే లభిస్తుంది. అంతకన్నా ఎక్కువ నాకింకేం కావాలి? 'చరిత్రహీనుల' విషయమై మరోమాట!......నువ్వు రాశావు. — బాబునాడా

సూచించాడు: అది చాల నీతిబాహ్యమైనది, ఏ పత్రికలోనూ ప్రచురించకూడదని అని. బహుశ అంతే కావచ్చు. అకారణంగా నామీద దోషారోపణ చెయ్యటానికి మీరు నాకేమీ శత్రువులు కాదుకదా! సాధారణంగా అందరూ మొదట్లో అలాగే అర్థం చేసుకుంటారని నేనూ అనుకుంటూనే ఉన్నాను.

నా పేరు ప్రతిష్ఠలను గురించి లెక్క చెయ్యటం లేదు నేను. నన్ను గురించి లోకులు ఎలా తలిస్తే అలాఅనుకుంటారు. పోనీ. దాని కేమిటి. కాలం నా బాగోగుల్ని నిర్ణయిస్తుంది. మానవుడు పొగుడుతాడు, నిందిస్తాడు. అందుకు విచారపడటం పొరపాటు...నేను కేవలం పద్యాలే కాదు...ఏమైనా రాయగలను. సంపాదకుని ఎదుట నా రచనల్ని పరీక్ష చేయించుకోలేను. అది నాకు అసాధ్యం, ఒక్క రవిబాబు చేత తప్ప.

—శరత్.

౯

డి. ఏ. జి. దఫ్తర్,
రంగూన్, జనవరి 1913.

ఫణీంద్రనాథ్‌కు!

ఫణిబాబూ! మీరంతా క్షేమమేనా? వెంటనే ఈ ఉత్తరానికి జవాబు రాయటం మరచిపోకు. నాకు చేతనైనంత వగకు చేసి తీరుతాను. ఉపేంద్ర్ ఎక్కడ ఉన్నాడు? అతను భవానీపురం ఎప్పుడు వస్తాడు? నాకు 'చంద్రనాథ్' ఎప్పుడు పంపుతావు? నన్ను ఏమిచేయమంటావో సలహా ఇస్తూ ఉండు లేకపోతే నాకు నేనై ఏమీ చెయ్యలేను. ఇక్కడికి వచ్చినప్పటినించీ స్ఫోటకం పోసి, జ్వరంతో బాధపడుతూ

ఉన్నాను. లేకపోతే ఏదో కొంతరాసేవాణ్ణి. మళ్ళీ ఉత్తరం రాస్తాను. సౌరీన్‌ను అడిగానని చెప్పు.

—శరత్.

౧౦

రంగూన్,

మాఘం - 191?.

ఫణీంద్ర బాబూ !

'రామకి సుమతి' చివరిభాగం పంపిస్తున్నాను. దాని విషయంలో ఒకమాట చెప్పటం అవసరం! కథ కొంచెం పెద్దది అయింది. ఒకే సంచికలో అంతా ప్రకటించటానికి వీలుండదేమో! కాని ఒక సంచికలోనే ప్రకటిస్తే బాగుంటుంది. చిన్న టైపులో వేస్తే ఒకటి రెండు పేజీలు ఎక్కువ ఔతుంది. చిన్న కథల్ని సీరియల్‌గా ప్రకటించటం అంత బాగుండదు. అదీగాక నీ పత్రికకు విశేషప్రచారం కావలసి ఉంది. చిన్న కథలు రాసే అలవాటు నా కిప్పుడు తప్పిపోయింది. కాని రెండుమూడు నెలల్లో మళ్ళీ తగినంత ప్రాక్టీసు పొందగలనని ఆశిస్తున్నాను. ప్రతినెలా పది, పన్నెండు పేజీలకు మించకుండా చిన్నకథలూ, వ్యాసాలూ పంపిస్తూ ఉంటాను. కథలు మాత్రం తప్పకుండా పంపిస్తాను. వాటికే కదా ఇప్పుడు మంచి ఆదరణ ఉంది!

ఇకనించి కథల్ని చాల చిన్నవిగా రాయటానికే ప్రయత్నిస్తాను. నువ్వు ఒకసారి పమాజపతిని కలుసుకో. అతనూ ఒక పత్రిక నడుపుతున్నాడు. మీరిద్దరూ పరస్పరం సంప్రదించుకుంటూ ఉండటం మంచిది. ఈ సారి సంచికలో 'సాహిత్యం'

అన్న శీర్షిక కింద నా పేరుమీద ఏదో చెత్త ప్రచురితం అయింది. అది నేను రాసిందేనంటావా? నేను రాసినట్టు నా కెక్కడా గుర్తు లేదు. ఒకవేళ రాసివుంటే మాత్రం ప్రచురించాలా? చిన్నప్పుడేమేమో చాలా రాస్తాం. అవన్నీ ప్రచురించ వచ్చునా? నువ్వు 'బోఝు' ముద్రించి నన్ను చిన్నపరిచావు. అలాగే సమాజపతి కూడా ఆ చెత్తను ముద్రించి నన్ను చిన్నపరిచాడు. ఇకనుంచి ఏదైనా సరే నా అనుమతి లేకుండా ముద్రించరాదని నిషేధించమంటూ ఉపేంద్ర్‌కు ఉత్తరం రాస్తాను. అవసరమైతే నేను చిన్నకథలు చాలా నే రాస్తాను. నీ పత్రిక చాల చిన్నది. దానికి మూడు నాలుగు రెట్లు పెద్దదైన పత్రికను కూడా నే నొక్కడినే నింపుతాను. ఒక్క కథే కాదు, అన్ని విషయాల మీదా వ్యాసాలు కూడా రాయగలను. నీకు అవసరమైతే నాకు తెలుపు. ఏ విషయం అయినా సరే నేను సిద్ధంగానే ఉన్నాను. "రామ్‌కీ సుమతి"ని రెండు సంచికల్లో ప్రచురిస్తావో, ఒకే సంచికలో ప్రచురిస్తావో నాకు తెలుపు. రెండు సంచికల్లో ప్రచురించేట్టయితే చైత్ర మాస పత్రికకు నేనేమీ రాయవలసిన అవసరం ఉండదు కదా!

'చరిత్రహీనులు' పూర్తి కావచ్చింది. రోజూ ఉదయమప్పుడే రాస్తున్నాను. రాత్రిళ్ళు రాయటం లేదు. రాత్రిళ్ళు పడుకుని ఏదన్నా చదువుతూ ఉంటాను.

ఇంకో సంగతి: నువ్వు కథలుగాని, వ్యాసాలుగాని, నవలలు గాని, 'యమునా'లో ప్రచురించే ముందు నా కొకసారి చూపిస్తే బాగుంటుంది. చైత్రమాసం సంచికను ప్రచురణార్థం వచ్చిన రచనల్ని ఇప్పుడే... అంటే నెలముందుగా నాకు నువ్వు

పంపిస్తే మంచివి ఏరి సరిచేసి పంపిస్తూ ఉంటాను. పుష్య మాసపు 'యమున' సంచిక ఏమీ బాగుండలేదు. చివరి కథ సరిగ్గా లేదు. ఔను. ఈ విధానంవల్ల నీకు పోస్టుఖర్చులు అధికం పౌతాయి; నిజమే కాని అందువల్ల పత్రిక బాగుపడుతుంది. ఇక్కడినించి పంపించేటప్పుడు పోస్టు ఖర్చులు నేనే భరిస్తాను, ప్రచురించేముందు వ్యాసాలన్నీ నేనొకసారి చూడాలని కోరుతున్నాను. నేను ఒక్క కథలే కాదు...ఏమైనా రాయగలను అని మొదటినుంచీ చెబుతూనే ఉన్నాను. కవిత్వం మాత్రం రాయలేను చెప్పొద్దూ. సౌరీన్ బాబు ద్వారా... లేకపోతే ఉపేన్, సురేన్, గిరీన్‌లతో చెప్పి నిరుపమాదేవి కావ్యాల్ని సంపాదించేందుకు ఎందుకు ప్రయత్నం చెయ్యవు? ఆమె అన్నగారైన విభూతి బాబును నువ్వెరుగుదు వనుకుంటాను. అతనికి రాశావంటే నిరూపమాదేవి వ్యాసాల్ని గాని, పద్యాల్ని గాని పొందగలవు. చాల మందికంటే ఆమె వ్యాసాల్ని, పద్యాల్ని చాల బాగా రాస్తుంది.

నా వల్ల కాదగినంత ఉపకారం నేను చేసితీరుతాను తప్పకుండా చేస్తానని వాగ్దానం చేస్తున్నాను. సాహిత్య క్షేత్రంలో నైచ్యం జొరబడలేదింత వరకూ. అదీగాక నా కది వృత్తి కాదు. దాన్ని వృత్తిగా స్వీకరించే ఉద్దేశమూ నాకు లేదు. బ్రతుకుతెరువు కోసం నేను కలం పట్టలేదు.

నేను దగ్గరగా ఉంటే నీకు చాల ఉపకారంగా ఉండేది. కాని నేనీ దేశాన్ని విడిచిపెట్టలేను ఇక్కడ హాయిగానే ఉన్నాను. అనవసరంగా కష్టాల్లో చిక్కుకోటం నాకిష్టంలేదు. అలా చిక్కుకోను కూడా. ఇది నా సంగతి.

వచ్చే యేడాదిలో వీలైతే నీ పత్రికను ఇంకా కొంచెం పెద్దదిచేసి వెల పెంచటానికి ప్రయత్నం చెయ్యి. ప్రతి శీర్షిక కింద చదవటానికి యోగ్యమైన రచనలే ఉండాలి. అందుకనే చిన్నకథల్ని సీరియల్‌గా కాకుండా ఒకే సంచికలో ప్రచు రించటం మంచిదని చెబుతున్నాను.

'చంద్రనాథ్' పంపిస్తూన్నానని ఉపేంద్ర్ చాలసార్లు రాశాడు. కాని అది ఇంతవరకు నాకు చేరలేదు. నీవు 'చంద్ర నాథ్' ప్రచురించదలిస్తే అవసరమైన మార్పులుచేసి తిరుగ రాసి పంపిస్తాను. దాన్ని గురించి మంచిచెడ్డలు భవానీపురంలో సౌరీన్ ముఖతః విన్నాను. జ్ఞాపకం ఉంది. అందుచేత మార్పులు చేసి తిరుగ రాయటం అంతకష్టమైన పనికాదు. ఇటువంటి కొత్త రచనలు నీకు కావాలంటే నాకు రాయి.

—శరత్‌చంద్ర చట్టోపాధ్యాయ.

౧౧

రంగూన్,
12-2-1913.

ఫణిబాబూ !

ఇప్పుడే నీ ఉత్తరం చేరింది. మొదటి అంశం; 'వంగ వాసీ' 'క్రీడాలోకం' ఇత్యాది శీర్షికలకింద ఒకపేజీ వినియో గించటం అనవసరం. నువ్వేమీ భయపడనక్కర్లేదు. నీ పత్రి కలో మంచి మంచి రచనలు ప్రచురిత మౌతూవుంటే ఆసంగతి నేడు కాకపోతే మరికొన్నాళ్ళకైనా దానంతట అదే ప్రచారం ఔతుంది. ఎవరూ అడ్డగించలేరు. నీకేం భయం అక్కర్లేదు. ప్రచారంద్వారా చందాదార్లను ఎక్కువ చేసుకోవాలిగాని

అనుబంధ పత్రాల్ని ముద్రించి డబ్బు ఖర్చుచేయటం మంచిది కాదు.

రెండో అంశం: 'రామ్‌కి సుమతి' చిన్నదైపోయినా ఒకేసారి ప్రచురించటం మంచిది. అటువంటి చిన్న కథల్ని సీరియల్‌గా ప్రచురించటం సముచితంకాదు. రెండు మూడు రోజుల్లోనే మరో కథ పంపుతున్నాను. నీ వద్దనుంచి జాబు రావటంతోనే పంపుతాను. నా ఉద్దేశంలో 'రామ్‌కీ సుమతి' కన్నా ఈ కథ బాగుంటుంది. కాని దానిలాగే ఇదీ పెద్దదే అయింది. అదే విచారం. ఎంత ప్రయత్నించినా కుదించలేక పోయాను. ముందుముందు ఇంకాచిన్నవి రాయటానికి ప్రయత్నించి చూస్తాను.

మూడో అంశం: 'చంద్రనాథ్'ను పురస్కరించుకుని ఒకరకమైన వివాదం లేచింది. అందుచేత దానితో ప్రయోజనం లేదు. 'చరిత్రహీనులు' ప్రచురించవచ్చు. కాని దానికోసం పత్రికను పెద్దది చేయవలసి వుంటుంది. ఎప్పటినించీ పెద్దది చేస్తావో, ధర ఎంత పెడతావో నాకు తెలుపు. ధర పెంచకుండా పత్రిక పెద్దదిచేసి ఖర్చు భరాయించటం కష్టం. అలా చేయకూడదు.

నాలుగో అంశం: సమాజపతితో విరోధం వద్దన్నాను. అంతేగాని అతన్ని ఆశ్రయించమనలేదు. ఫణిబాబూ! నీ దుకాణంలోని వస్తు[illegible] శ్రేష్ఠమైనవి[illegible]...తే ఇవాళ కాకపోతే మరి కొన్నాళ్ళకయినా కొనుగోలుదార్లు ఎక్కువగా వస్తారు. సరుకు సరియైనది [illegible] ఎంతశ్రమ పడినా దుకాణం సాగదు. [illegible], లేకపోతే నెలగడిచిన తర్వాతనో దివాలా [illegible]వలసిందే.

నా చిన్నతనపు అసంబద్ధపు రచనలన్నీ ప్రచురించి మీరు నన్నెంత చిన్నబుచ్చుతున్నారో నేను చెప్పలేను. ఆ రకంగా మీరు నా యెడల ఎంత అన్యాయం చేస్తున్నారో చెప్పలేను. సమాజపతి తెలిసినవాడు. అయినాకూడా అటువంటి రచన ఎందుకు ప్రచురించాడో నాకు ఆశ్చర్యంగా ఉంది.

అయిదో అంశం: సౌరీన్ బాబును నువ్వు ఎప్పుడు ఏ సందర్భంలో కలుసుకున్నావు. అతడు నా 'దీదీ' కి సంబంధించిన విమర్శన చూచాడా? చూచి చాల కోపం తెచ్చుకుని ఉంటాడనుకుంటాను. ఔనా? అయినా నా దోషం ఏముంది? ఎవరు రాశారో వారే దానికి బాధ్యులు. అదీగాక ఆ రచనలను చిన్న టైపులో ప్రచురించారు కదూ!

ఆరోవంశం: నేను రెండుమూడు రోజుల్లో పంపబోయే కొత్తకథను ఏ నెలలో ప్రచురిస్తావు? చైత్రమాస పత్రికలో 'రామ్‌కీ సుమతి' పూర్తి ఔతుంది, కాబట్టి వైశాఖమాస పత్రికలో ప్రచురిస్తావు. ఏ నెలలో ప్రచురించినా సరే, చిన్న టైపులో వేస్తే ఎక్కువపేజీలు పట్టదు. చందాదార్లు చదవటానికి ఎక్కువ రచనలు కనిపిస్తానూ వుంటాయి.

ఏడవ అంశం: వైశాఖమాసం నించీ పత్రిక సర్వాంగ సుందరంగా ఉండాలి. బొమ్మలకోసం ఎక్కువడబ్బు ఖర్చుపెట్టకూడా...ఆ డబ్బుతో మరో విధంగా పత్రికను అభివృద్ధిపరచే ఏర్పాట్లు చెయ్యటం మంచిది. చందాదార్లకు బొమ్మలుకూడా కావాలేమో నాకు తెలియదు. పత్రికల్లో బొమ్మలుకూడా ఉండటం ఈ నాటి ఫేషన్ అయితే...బొమ్మలు కూడా ఉండాల్సిందే మరి! ప్రచురించవలసిన రచనలను సరిచూడడంలో

నాకుకూడా కొంత బాధ్యత ఇస్తే బాగుంటుంది. నేనుకూడా ముందుగా చూచి మంచి చెడ్డలు నిర్ణయిస్తాను. సరిగా పరీక్ష చేసి చూడకుండా చెత్తరచనల్ని పేరుచూచి భ్రమించి ప్రచురించకూడదు.

ఎనిమిదో అంశం: శ్రీమతి నిరూపమాదేవి దయయుంచి తన రచనల్ని నీకు ఇస్తే మంచిదే. ఆమెకు గల కవిత్వ రచనా శక్తి అపూర్వం. శ్రీమతి అనుపమాదేవి రచనలను సంపాదించటం కష్టమే. ఆమె 'భారతి' లో రాస్తూ వుంటుంది. నీ పత్రికకు రాస్తుందో రాయదో చెప్పలేం ఒకవేళ రాసినా పళ్లు కొరుక్కుంటూ, బొమలుకుంచించి రాస్తుందేమో! వారంతా గొప్ప గొప్ప రచయితలు. "యమునలాంటి చిన్న చిన్న పత్రికలను రాయాలనిపించదు వాళ్ళకు. అయినా ప్రయత్నించి చూడు. ప్రయత్నం ఫలిస్తే మంచిదే; ఫలించక పోయినా మంచిదే. నా మూడు పేర్లూ ఏ వంటే—

విమర్శనలు, వ్యాసాలు : అనిలాదేవి

చిన్నకథలు : శరత్ చంద్ర చట్టోపాధ్యాయ్

పెద్దకథలు : అనుపమా.

అన్నీ ఒక్కడే రాస్తూ ఉంటే...సంపాదకునికొక ఒక్క రచయిత తప్ప మరెవ్వరూ దొరకలేదు కామాలనుకుంటారు.

ఇక్కడ నాకొక మిత్రుడున్నాడు, అతనిపేరు ప్రఫుల్లలాహిడీ, బి. ఏ., మంచి విద్యాశాస్త్రనేత్త. వ్యాసాలు చాల చక్కగా రాస్తాడు. పేరుపడ్డ వాడు కాదు. ఎందువల్లనంటే... తన రచనల్ని ఏ పత్రికలోనూ ఇంతవరకూ ప్రచురించలేదు.

'యమున' పత్రికకు వ్యాసాలు రాయవలసిందిగా నే నతన్ని కోరాను. అతడేమైనా రాసియిస్తే పంపిస్తాను.

'యమున' సైజు చాల చిన్నది. ఎక్కువ ప్రయాస పడ నక్కర్లేదు. వెలకూడా తక్కువే. హఠాత్తుగా వెల పెంచేస్తే ఏమౌతుందో చెప్పలేం. ఇప్పుడు కాకపోయినా, కొన్నాళ్ళ కయినా సైజుపెంచి, ధర ఎక్కువ చెయ్యాల్సిందే. నువు వట్టి సోమరివి. ఇలా రోజులు వెళ్ళబుచ్చుతూంటే లాభంలేదు. ఇది తప్ప మరోపనేమీ చెయ్యటానికి నువు నిశ్చయించుకోలేదు. కాబట్టి దీన్నే శ్రద్ధగా చూచుకుంటూ ఉండాలి. మరోవంక గృహపరిస్థితులను కూడా విస్మరించకూడదు. 'ప్రవాసి' మొద లైన చిన్నచిన్న పత్రికలన్నీ ఎంత అభివృద్ధి పొందాయో చూడు! పురుష రచయితలను గురించి విమర్శక వ్యాసాలు రాయవలసిందిగా కోరావు. కాని నా దగ్గర వంగసాహిత్యం ఏమీ లేదు. మాసపత్రికలు కూడా నేను కొనటం లేదు. ఏమీ సామాగ్రి లేకుండా వ్యాసాలెలా రాయను? రాస్తేమాత్రం లోకులదృష్టి ఇటువైపు ఆకర్షిత మౌతుంది. ఏదో గడబిడ లేస్తుంది. నాకు తెలుసు. అయినా నాకేమీ భయంలేదు. నా విమర్శనలో ఏదైనా పొరపాటువుండి, ఎవరైనా దాన్ని నిర్ధా రించగలిగితే (నిర్ధారించటం చాల కష్టం) అదీ మంచిదే.

ఇంకో సంగతి: నా కిక్కడ గ్రంథపఠనకు గాని, ఏదైనా రాసుకోటానికి గాని చాల అభ్యంతరంగా ఉంటున్నది. రోజూ ఉదయకాలం అంతా నీ కోసంగాని 'చరిత్రహీనుల' కోసంగాని వ్యయమై పోతోంది. రాత్రిళ్ళు గ్రంథపఠనం సాగుతోం దనుకో. కాని 'నోట్' చేసుకోటం పడటంలేదు. పొద్దుట్ట

స్పెన్సర్ రాసిన సమస్యాయాత్మక తత్వశాస్త్రం మీద సమాలోచన చేస్తూ...యూరప్ అతని వాదాన్ని అంగీకరించిన, అంగీకరించని ఆయా తత్వజ్ఞులందరి రచనలను గురించీ...ఒక పెద్ద వ్యాసం రాద్దామని పిస్తున్నది నాకు. మనదేశపత్రికలలో కేవలం సాంఖ్య వేదాంత ద్వైతాద్వైత పద్ధతులనూ గురించేగాని మరేయితర దృక్పథాలను గురించీ సమాలోచనలు ప్రచురితం కానటంలేదు. అందుచేత అటువంటి పనేదైనా చేద్దామనిపిస్తూ వుంటుంది నా కప్పుడప్పుడు. చెయ్యమంటావా? దానికి నీ పత్రికలో ప్రచురించటానికి వీలుంటుందా రాస్తావా?

వెంటనే జవాబు రాయి. నువు రాయకపోతే నాలో పుట్టిన ఈ కోరిక నాలోనే అంతరించి పోతుందేమో! అది కూడా ఒక పనికింద పెట్టుకో. రచనలు రిజిస్టర్ పోస్టులోనే పంపుతాను. దానికైన ఖర్చు నువ్వెందుకిచ్చుకోవాలి? పోస్టు ఖర్చులు కూడా తీసుకోవలసినంత దుర్దశలో లేనులే. అటువంటి మాటలు మళ్ళీ ఎప్పుడూ రాయకు.

నీకు దినదినమూ శ్రీవృద్ధి యగుగాక! అది నా ఆశీర్వాదము. అదే నా పారితోషికమున్నూ.

ఇక చంద్రనాథ్ అడగబోకు. అవసరమైతే దానిని మళ్ళీ రాస్తాను. మళ్ళీ రాసినప్పుడు మంచిదల్లా చెడ్డదై పోదు.

నా మూడు పేర్లను గురించీ నీ అభిప్రాయం ఏమిటి? అందువల్ల ఎక్కువగా రాసి పంపటానికి అవకాశం ఉంటుందను కుంటాను. ఒక్క పేరుమీదే చాల రాయటం బాగుండదు. ఏమంటావు?

ఉపేంద్ర ఏమంటున్నాడు. అతడు ఉత్తరం పత్రం రాయటమే లేదు. అతడు దగ్గర లేకపోతే హైరానగా ఉంటుంది. అతనికి నీ మీద చాలప్రేమ. అతనివల్ల చాల పనులౌతాయి.

ఏమైనాగానీ నువ్వేమీ గాభరాపడనక్కర్లేదు. విచారించనక్కర్లేదు. నేను నిన్ను విడిచిపెట్టి పోతాననిగాని; ఏదో ఆశలోపడిపోయి మరో విధంగా వ్యవహరిస్తానని గాని...అటువంటి ఆలోచనలు నీ మనసులోకి రానీకు. నా చరిత్ర అంతా దోష భూయిష్టంకాదు.

ఇతర పత్రికల వాళ్ళు నన్ను బలవంత పెడతారని రాశావు. బలవంతపెట్టనీ...దానగుణం ఇంట్లోనే ఆరంభమౌతుంది (*Charity begins at home*) అంతేకదూ! వెంటనే జవాబు రాయి. నీకు నా ఆశీర్వాదాలు.

—శరత్.

౧౨

చైత్రం - 1913.

ఫణీబాబూ!

నువ్వు పంపిన వ్యాసాలు తిరిగి పంపించేస్తున్నాను. రెండూ బాగానే వున్నాయి. ప్రచురించవచ్చు. 'కళ్లు'మీద రాసిన వ్యాసం బాగుంది.

'చంద్రనాథ్'ను పురస్కరించుకుని చాలా గడబిడ లేచింది. అది ఇంకా సొంతం నా చేతిలోకి రాలేదు. దాని కోసం నన్ను ప్రాధేయపడి అడిగి లాభంలేదు. వాళ్ళు ఇంకా

దాన్ని పంపించలేదు. దాని కోసం నువ్వు తాపత్రయపడకు. కొంచెం కొంచెం తిరగరాసి పంపిస్తున్నారు. నే నెప్పుడో పూర్వం రాసిన రచనలన్నీ ఉన్నవి ఉన్నట్టుగా ప్రచురించటం నా కిష్టం లేదు. వాటిలో అనేక పొరపాట్లు ఉన్నాయి. వాట న్నింటిని సవరించే అవకాశం లభిస్తే ప్రచురించవచ్చు. లేకపోతే ప్రచురించకూడదు. 'కాశీనాథ్' విషయంలో నేను చాల సిగ్గు పడుతున్నాను. ఇష్టమిత్రుల ద్వారా ఇటువంటి కొంచెపాటు నాకు సంభవించటం బాగులేదు. అందరూ నా శ్రేయస్సుకోరే వాళ్ళే మళ్ళీ. కాని నా ఉద్దేశాలకు విరుద్ధంగానే అన్నీ జరుగు తున్నాయి. 'చంద్రనాథ్' ను తిరిగి పంపించకుండా అట్టి పెట్టేసుకున్నారు. 'చరిత్రహీనులు' ప్రచురణ జ్యేష్ఠ మాసంలో ఆరంభిస్తారుట. 'చంద్రనాథ్' ను వైశాఖమాసంలో మొదలు పెడతారేమో! అలాచేస్తే గత్యంతరంలేదు. మిగిలిన భాగాన్ని వీలైనంత వరకు పరిష్కరించి పంపించవలసి వుంటుంది. వైశా ఖంలో ఎంతవరకు ప్రచురిస్తారో చూసుకుని, మిగిలిన భాగం నాకు చేరినా చేరకపోయినా, కొంచెం కొంచెం తిరగరాస్తాను. వైశాఖంలో 'చంద్రనాథ్' ఆరంభించకపోతే 'చరిత్రహీనులు' ఆరంభిస్తాను.

'చరిత్రహీనులు' కోసం చాలమంది ఉత్తరాలు రాస్తు న్నారు. కొందరు డబ్బు ఇస్తామని, కొందరు పేరు ప్రతిష్టలు లభిస్తాయనీ, మరికొందరు ఆ రెండు సమకూరుతాయనీ ఆశలు చూపుతున్నారు. నాకు మాత్రం అవేమీ అక్కర్లేదు. నీకు శ్రేయోదాయకమయ్యే రీతిగా చేస్తానని చెప్పాను. ఆ మాట తప్పను.

ఫాల్గుణ, చైత్ర, వైశాఖమాసాల 'యమున' సంచికలు బి, ప్రథమనాథ భట్టాచార్య, 19, యుగళ కిశోరదాస్ వీధి, కలకత్తా చిరునామాకు పంపించు.

వారు అనగా గురుదాసు బాబు పుత్రులు తాము కొత్తగా ఆరంభించిన పత్రికలో నా రచనలను ప్రచురించటానికి ఆతృత పడుతున్నారు. ప్రమథ బాబు నాకు ప్రియమిత్రుడు. ఏమైనా గానీ ఫాల్గుణ-చైత్ర మాసాల 'యమున' సంచికలు అతనికి పంపించు. అంతేగా, అతని మిత్రులూ నా 'కాశీనాథ్'ను పురస్కరించుకుని ఏదో కొంత రహస్య సమాలోచన కావించినట్టు విన్నాను. 'యమున' పత్రికలో తప్ప మరే పత్రికలోనూ నేను నియమితంగా రాయటానికి ఇష్టపడనని కూడా వారు అభిప్రాయ పడుతున్నట్టు తెలిసింది. అదికూడా మంచిదే. నా రచనలను అవహేళనచేసే ధైర్యం అతనికి లేదు. నేను మూర్ఖుడిని కాదు. ఆ సంగతి ప్రమథబాబుకు తెలుసు.

నిరూపమాదేవిని నీ పత్రికవైపు ఆకర్షించే ప్రయత్నం చెయ్యి. ఆమె నిజంగా చాల బాగా రాస్తుంది. మంచిపేరూ ఉంది. నా రచనలకన్నా ఆమె రచనలు చాల వరకు బాగా వుంటాయని నా ఉద్దేశం. ఈలోగా 'మానసీ' పత్రికాధిపతి శ్రీఫకీరు బాబు కలిస్తే చెప్పు: అతడు రాసిన ఉత్తరం అందింది, త్వరలోనే జవాబు రాస్తానని. నాకు జ్వరంగా ఉంటోంది అందుచేత వెంటనే జవాబు రాయలేదు; రాస్తాను త్వరలోనే.

ఒక్క సంగతి చెప్పగలవా? ఇంకా ఎన్నాళ్ళవరకూ నాకు 'సాహిత్య' పత్రిక మీద అభిమానం వుంటుంది. 'కాశీనాథ్' కన్నా ఉత్కృష్టమైన పుస్తకం రాయగల ఓపిక నాలో

లేదని లోకులు అనుకుంటూ వున్నారు. దీనితో నా పేరు పోతోంది. ఉపేంద్రకు పాపం ఈ సంగతి తెలియదు. అయినా నా మంచికోరే అలా చేశాడు. అందుచేతనే ఓర్పు వహించాను. అంతకన్నా చేసేదేం లేదు. కాని ఒక్కమాట! అతని దగ్గర అటువంటి కథలు ఇంకా ఉన్నాయా? ఉంటే మాత్రం నేను చిక్కులో పడ్డానన్నమాటే. నీకు ఇంకో సంగతికూడా చెప్పాలి. ఆనాడు గిరీణ్‌బాబు ఉత్తరం చేరింది. 'చంద్రనాథ్' ను పురస్కరించుకుని ఉపేంద్రకూ వాళ్ళకూ కొంత సంభాషణ ఏదో జరిగింది. వాళ్ళకు నీ మీద విరోధం ఏమీలేదు. కాని కాశీనాథ్ 'సాహిత్య' పత్రికలో ప్రచురించిన కారణంవల్ల వాళ్ళు 'చంద్రనాథ్' ను తిరిగి ఇచ్చివేసే ఉద్దేశంలో లేరు. వాళ్ళకు నా రచనలంటే చాల యిష్టం. పంపిస్తే తమకు మళ్ళీ రాదేమోనన్న భయంవల్ల, ఇంకే పత్రికకైనా ఇస్తానేమోనన్న అనుమానంవల్ల...పంపటం మానేశారు. గిరీన్‌బాబు కొంచెం కొంచెం నకలురాసి పంపించటానికి సంకల్పించాడు. వాళ్ళు వైశాఖ మాసంలో 'చంద్రనాథ్' ను ప్రచురించటం ఆరంభిస్తే నువ్వు ఉత్తరంద్వారా గాని, తంతిద్వారాగాని నాకు తెలుపు, మరొకసారి సురేన్‌బాబుకు విజ్ఞప్తి చేస్తాను ప్రచురించకపోతే మంచిదే; చరిత్రహీనులు వేసుకుంటాను.

నాకు కథలు, వ్యాసా... ...త్రిమే పంపించు. మిగతావి నువే సరిచూడు. కథ...ర్తిం ముందుగా నాకు చూపించకుండా ఉన్నది ఉన్నట్లు ముద్రించవద్దు

ఉత్తరం చాల తొందర తొందరగా రాసేస్తున్నాను. వేరేపని వుండటంవల్ల. అందుచేత ... విషయా... ...త్రగా

ఆలోచించి రాయలేకపోతున్నాను. కాని రాసినంతవరకు నువ్వు సవ్యంగా గ్రహించగలవు.

ద్విజూబాబును సంపాదకునిగా నియమించి, చాల పెట్టుబడితో హరిదాసుబాబు పత్రిక ఒకటి ఆరంభించారట. మంచి మాటే, వాళ్ళు డబ్బిస్తారు; కాబట్టి మంచి రచనలే దొరకవచ్చు. అదిగాక ధనవంతులకే ఇంకా సాయం లభిస్తూవుంటుంది. లోకంతీరే అది. దాన్ని గురించి ఎక్కువగా ఆలోచించవలసిన పనిలేదు.

జ్యేష్ఠమాసంలో ప్రచురణలకు పంపవలసిన రచనలు వైశాఖం మొదటివారంలోనే పంపిస్తాను. కేవలం 'చంద్రనాథ్' విషయంలోనే నాకు విచారంగా వుంది, అది ఎలాంటి కథో, శైలి ఎలాంటిదో తెలుసుకోకుండా ముద్రించటం ఉచితం కాదు. ఏమైనాగాని దాని విషయమై త్వరలోనే ఏ సంగతీ తెలియగలదని ఆశిస్తున్నాను.

ఆరోగ్యం బాగుండటం లేదు. నిన్న రాత్రినించీ జ్వరంగా వుంది. తీవ్రంకాకుండా తగ్గిపోతే మంచిదే. నీ ఆరోగ్యం ఎలా వుంది? జ్వరం తగ్గిందా?

—శరత్.

## ౧౩

డాన్ స్ట్రీట్
రంగూన్ 3-5-1913

ఫణీబాబూ!

నీ ఉత్తరం చేరింది. నువ్వు పంపిన 'ప్రవాసి' 'మానసి' 'భారతి' 'సాహిత్య' మొదలైన మాసపత్రికలన్నీ కూడా చేరాయి. 'చంద్రనాథ్'లో ఉచితమని తోచిన మార్పులు

చేశాను. అతిమధురమైన కథే. కాని ఆ మాధుర్యం జాస్తి అయింది. చిన్నతనంలోనూ, లేదా తన యౌవనంలోనూ రాసింది కాబట్టి అలా తయారవటం సహజమే. ఏమైనాగానీ, చివరకు అది నా చేతిలోకి వచ్చింది కాబట్టి ఒక మంచి నవలగా పరిష్కరించాలి. కాని అందువల్ల నవల కనీసం రెండింతలు పెరిగేట్టుగా వుంది. ప్రతినెలా దానికి ఇరవై పేజీల చొప్పున ప్రత్యేకించినా మూడునెలలకైనా పూర్తిఔతుందో లేదో సందేహమే. ఏ విధమైన అవినీతితోనూ ఈ కథకు సంబంధం లేదు. అదే ఇందులోని విశేషం. అందరూ చదవవచ్చు. 'చరిత్రహీనులు కళాదృష్ట్యా' చరిత్రనిర్మాణ దృష్ట్యా బాగానే వుంటుంది. కాని దాని రీతి వేరు. 'చరిత్రహీనులు' కోసం ప్రమథబాబు తగాదా చేస్తూనే ఉన్నాడు. ఈ తగాదా మూలంగా చిన్నప్పటినించీ వస్తున్న మా స్నేహం ఎక్కడ చెడిపోతుందోనన్న భయంవల్ల 'చరిత్రహీనులు' చదవటానికి అతనికి పంపించాను. అతని మనసులోవున్న వుద్దేశమేమిటో నాకైతే తెలియదు. కాని నేను మాత్రం నా మనోభావాన్ని విశదంగానే రాశాను. అతని జవాబు ఇంతవరకూ రాలేదు. వచ్చినతర్వాత నీకు తెలుపుతాను. నీ-నా మధ్యగల మిత్రత్వం లోతైనది. నేను వయసు మీరినవాడిని. ఈ వయసులో నేనేమి చేసినా వృథాగా చెయ్యను. నువ్వు నా విషయంలో ఎందుకింత బాధపడతావు అనవసరంగా! 'యమున' బాగా అభివృద్ధి చెందాలి. అది నా లక్ష్యం. మరెందుకైనా దాని కోసం [illegible] 'చరిత్రహీనులు' ఆ సగమే రాసి పడివుంది [illegible] ఏమి కావాలో నాకు తెలియ[illegible] పూర్తిచేస్తానో కూడా నాకు తెలియదు.

'చంద్రనాథ్' ను ఈ సంవత్సరం ప్రకటించాలి. 'యమున' ఏ విధంగా ఈ సంవత్సరం పేరు ప్రతిష్టలు పొందుతుందో ఆ తీరు తెన్నులు కూడా ఆలోచించాలి. ఆ తరువాత వచ్చే సంవత్సరంనాటికి 'యమున'ను ఇంకా అభివృద్ధిలోకి తీసుకురావాలి. ఈ సంవత్సరం చందాదార్లు ఎంతమంది వున్నారు? వెనుకటి సంవత్సరంకన్నా తగ్గారా? పెరిగారా? ఆ విషయం తెలుపు. ఒకవేళ నేను ఇతరపత్రికలకు రాసి, పేరు సంపాదించుకున్నా, అందువల్ల 'యమున'కు ఉపకారమేగాని అపకారంలేదు. కాని ఈ అస్వస్థత మూలాన నేను రాయటం పడదు. అది జరిగే విషయం కాదు. తాపత్రయపడి లాభంలేదు. ఫణిబాబూ! శాంతం వహించి ఆత్మవిశ్వాసంతో ముందుకు నడవాలి. నేను నీ పనిలోనే ఉంటాను. కాని నాకు బలహీనంగా ఉంటోంది. ఎక్కువ పరిశ్రమ చేయలేక పోతున్నాను. ఒక విమర్శకవ్యాసం రాస్తున్నాను. రెండుమూడురోజుల్లో పూర్తిఔతుంది. ఋతేంద్ర ఠాకుర్‌కు విరుద్ధంగా, కొంచెం కటువుగా తయారౌతుందేమో! 'సాహిత్య' పత్రిక ఫాల్గుణమాస సంచికలో అతడొక పరిశోధకవ్యాసం రాశాడు. మొదటినించి చివరదాకా అన్నీ పొరపాట్లే, పురాతత్వ పరిశోధన అంటూ అసంబద్ధపు రాతలు రాయకూడదని చెప్పటమే నా వ్యాసంలో ఉద్దేశం. ఋతేంద్ర ఠాకుర్ తో యమున కేమైనా సంబంధమున్నదేమో నాకు తెలియదు. ఉచితమని తోస్తే ప్రచురించు; లేకపోతే 'సాహిత్య' పత్రికను ఇచ్చెయ్యి ఊహుం. ఆ కథ ఇంతవరకూ దొరకలేదు. నిరుపమాదేవి రచనలేమైనా సంపాదించావా? సంపాదించటం మంచిది. నా స్థానే సౌరీన్ బాబు నా భారం వహిస్తే బాగానే

ఉంటుంది. నిరూపమాదేవి కూడా చాలభాగం నిర్వహించ గలదు. సురేన్, గిరీన్, ఉపేంద్ర కూడా. కాని వారు వ్యాసాలు రాయగలరో లేదో నాకు తెలియదు. వ్యాసాలు రాయ టానికి మనిషి బాగా చదువుకున్నవాడై ఉండాలి. అందువల్ల మనస్సుకు పటిష్ఠత వస్తుంది. కథలూ మొదలైనవి వాళ్ళు రాస్తేట్టయితే నేను కేవలం వ్యాసాల్లో నిమగ్నుడనై వుంటాను. కథలంత ఎక్కువగా రాయలేకపోతున్నాను. రాసినా పూర్వం లాగ బాగుండటంలేదు కూడా. వయసు మళ్ళిందికదూ! విమర్శనాత్మకములైన రచనలవైపే దృష్టిపోతున్నది. కథలనేవి బలవంత బ్రహ్మణార్థంగానే రాస్తున్నాను. బలవంతాన చేసే పనులు ఎలా బాగుంటాయి? ప్రమథ్ ఉత్తరం కూడా ఇందులో పంపుతున్నాను. నా పేరు అనిలాదేవి, ఇది ఎవరికీ తెలియకూడదు. నేనేనని అనుమానపడి ప్రమథ్‌బాబు డి. యల్. రాయ్‌తో చెప్పాడు. అతనికి గట్టిగా ఉత్తరం రాయి.

నీ పత్రికను నా పత్రికగానే భావిస్తున్నాను. దానికి బాధకలిగించే పని నేనేమీ చెయ్యను. ఒక్క ప్రమథబాబు మూలాన్నే చిక్కులో పడేట్టు వున్నాను. అతడు నాకు కేవలం పరిచితుడే కాదు, స్నేహపాత్రుడు; పరమ బంధువు. అందుకన్నే కాస్త ఆలోచిస్తున్నాను. లేకపోతే ఏముందీ? ప్రమథ్‌బాబు ఉత్తరంద్వారా నువ్వు చాల విషయాలు తెలుసుకోగలవు.

ఇప్పుడు నాకు జ్వరం 102 డిగ్రీలు వుంది. ఈ జ్వరం రంగూన్‌లో ఉండటం వల్లకాదు. ఇతర కారణాల వల్ల వస్తున్నది. హృద్రోగానికి సంబంధించినది. ఈ దేశంలో మామూలుగా ఆరోగ్యంగానే వుంటుంది. కాని నాకు మాత్రం దుస్సహంగా ఉంది.

—శరత్.

రంగూన్, 27-3-1913.

ఫణీ బాబూ :

నువు పంపిన రిజిస్టర్డు పార్శిల్ ఇప్పుడే అందింది. రిజిస్టరు చేసినప్పుడు ఇంటి అడ్రస్‌కు ఎందుకు పంపించావు ? ఆఫీసు అడ్రసుకు పంపించటమే మంచిది. ఎందువల్లనంటే టపా వాడు ఇంటికి వెడతాడు; అప్పుడు నేను ఆఫీసులో వుంటాను. రిజిస్టరు చెయ్యనివే ఇంటి అడ్రసుకు పంపిస్తూ ఉండు. ఆ రెండు వ్యాసాలూ చూచి త్వరలోనే పంపుతాను. వైశాఖమాస సంచికకు కొంచెం గడబిడ అయ్యేట్టే ఉంది. ఏమైనా గాని ఈ నెలకు ఇలా కానియ్యి: మొదట 'పథనిర్దేశ్' తరువాత 'నారీ కామూల్య' ఆ తరువాత మిగతా వ్యాసాలు. 'చంద్రనాథ్' ప్రచురించవద్దు. ప్రచురించేందుకు యోగ్యంగా తయారై నప్పుడు క్రమశః ప్రచురిద్దాం. జ్యేష్ఠమాసంలో 'చంద్రనాథ్' గాని 'చరిత్రహీనులు' గాని ఆరంభించి పెద్దటైపులో ఆకర్ష కంగా వుండేలాగు ప్రచురిద్దాం. సురేన్ గిరీన్‌కు ఏమి జవా బిస్తావో చూస్తాను. వైశాఖమాస సంచిక అందంగా తయా రయ్యేలాగు కనిపించటం లేదు. ఔను, నువే నన్ను ప్రథమంగా అడిగావు; అందులో సందేహం లేదు. నేను బ్రతికి వున్నన్ని నాళ్ళూ నువు ఎక్కువగా కష్టపడనవసరం లేదు. కాని నా ఆరోగ్యం ఏమీ బాగుండటంలేదు. అదీగాక నాకు ఇప్పుడు చిన్నకథలు రాయాలనిపించటం లేదు. చాల అవస్థపడి రాస్తు న్నాను. అయినా నీ కోసం రాస్తూనే ఉంటాను. ఈ మధ్య అనేక చోట్లనించి కథలు రాసి పంపించమంటూ చాల ఉత్త రాలు వస్తున్నాయి. నాకేమీ తోచటంలేదు. విస్తారంగా

కథలు రాయటమే పనిపెట్టుకుంటే నా గ్రంథపఠనకూ, సొంత రచనలకూ ఆటంకం కలిగేట్టుంది. రోజుకు రెండుగంటలకంటే ఎక్కువసేపు నేను రాయటంలేదు. పది పన్నెండు గంటలు గ్రంథపఠనకు వినియోగిస్తున్నాను. ఏమైనాగానీ నీ వైశాఖ మాసపత్రిక ఇబ్బంది లేకుండా బయటపడాలి. ఆ తరువాతనెల విషయం ముందుముందు చూచుకోవచ్చు. మొదట నీ చందాదార్ల అభిరుచుల్ని బట్టి మన తరువాత కార్యక్రమం సాగాలి. మీ అమ్మగారు కూడా నా క్షేమసమాచారాల్ని తెలుసుకో గోరటం నా భాగ్యం. నే నిక్కడ హాయిగానే ఉంటున్నానని ఆమెకు చెప్పు. మీరందరూ అక్కడ క్షేమమేకదా! వైశాఖ మాసపత్రిక అనుకున్నంతగా బాగా లేకపోతే...ప్రతినెలా నా కథ ఒకటి ప్రచురితం ఔతుంది అని... అందులో ఒక ప్రకటన చెయ్యి.

నా చిరునామా అందరికీ ఎందుకు తెలుపుతావు నువ్వు? అనేకమంది నన్ను పెద్దపెద్ద పత్రికలకు రాయమని సలహాలిస్తూ ఉత్తరాలు రాస్తున్నారు. పెద్దపెద్ద పత్రికలకు రాస్తే పేరు వస్తుందిట. నీ పత్రిక చిన్నదట! ఎక్కువమంది చదవరట. కావచ్చు. లాభనష్టాలు విచారించిచూస్తే వాళ్ళమాటే వాస్తవం కావచ్చు. అందరూ ఆ విధంగానే అంటారు. కాని నాకు ఆత్మసంభ్రమము, ఆత్మనిర్భరతా ఉన్నాయి. అందరికీ లాభదాయకమని తోచినమార్గమే నాకూ లాభదాయకమని తోచినా అదే నాకూ ఏకమాత్ర అవలంబనం కాదు. ఒక చిన్న పత్రికను చేయగలిగినా... అందులోనే నాకు అధికలాభం కనిపిస్తుంది. అదీగాక నీకు తోడుపడటానికి భరోసా యిచ్చాను.

ఇప్పుడొక నిమిషంలా మరోరకంగా ప్రవర్తిస్తానా? నాలో దోషాలు వుండవచ్చు. కాని నా చరిత్ర పదహారణాలూ దోషభూయిష్టమే కాదు. అన్న మాటమీద నిలబడటానికే ప్రయత్నిస్తాను. నువ్వు ఏమీ విచారపడవద్దు. ఈ నా ఉత్తరం ఎవరికీ చూపించకు. నీ చందాదార్ల సంఖ్య వైశాఖంలో తగ్గకుండా అధికమే అయితే...మున్ముందు అధికతరం అయితీరుతుందని ఆశించవచ్చు. 'పథనిర్దేశ్' పూర్తిగా ఒక సంచికలోనే ప్రచురించు. సీరియల్‌గా వద్దు. స్త్రీలననుసరించి రాసిన వ్యాసంలో అచ్చుతప్పులు చాల ఉన్నాయి, ఒక-చోట 'అనురూపా' బదులు 'అమోఘసి' అన్న పేరు ముద్రితమైంది. నిరుపమా దేవిని సంతోషపెట్టి ఆమె వద్దనించి ఇంకా ఎక్కువ రచనలు సంపాదించటానికి ప్రయత్నించు. ఆమె చాల బాగా రాస్తుంది. ఆమె నా చెల్లెలు; శిష్యురాలు కూడాను.

—శరత్.

౧౪

ఏప్రెల్ 1913.

ఫణిబాబూ !

నువ్వు ఒకపని చేసిపెట్టాలి. ఇప్పుడు నడుస్తూన్న మాస పత్రికల విషయమై నాకు బాగా తెలియదు. అందువల్ల తత్సంబంధమైన వ్యాసం రాయలేకపోతున్నాను ఏమీ తెలియకుండా రాయగల తుచ్ఛ రచయితను కాను. అందువల్ల ప్రయత్నం చేసి రాస్తాను 'యమున' కోసం. కాబట్టి నాలుగైదు మాస పత్రికల్ని వి. పి. ద్వారా పంపించు. వి. పి చెల్లించి తీసుకుంటాను. 'ప్రవాసి' 'సాహిత్య' 'మానసి' 'భారతి' పంపించు.

విలువలేని రచనలిచ్చి పత్రిక ప్రతిష్ట పాడుచెయ్యటా నాకిష్టం లేదు. అన్ని పత్రికలూ ఎలా దొరుకుతాయి నాకు? ఒకటి రెండు పత్రికలవాళ్ళు గౌరవంగా ఊరికనే పంపిస్తున్నారు. అలా పంపించవలసిన అవసరంలేదు. వాళ్ళు ఊరికే పత్రికలు పంపిస్తూ వుండటం, నేను తిరిగి వాళ్ళకేమీ చెల్లించకపోవటం... నాకు సిగ్గుగా ఉంటోంది. ఇలా ఈ సంగతి నోరువిడిచి చెప్పుకోటం కూడా నాకు సిగ్గుగానే వుంది. ఈ విషయాలన్నీ ఆలోచించే నిన్ను ఈ కోరికకోరుతున్నాను. నా అడ్రసు: 24, లోవర్ పోజాఉంగ్‌స్ట్రీట్, వైశాఖం నించీ అయితే మా క్లబ్‌లోకూడా పత్రికలు వస్తూవుంటాయి. కాని క్లబ్ నించి తెచ్చుకుని చదువుకోటానికి అవకాశాలు తక్కువ. ఇలాగ మధ్యమధ్య ఏవో కోరికలు కోరుతూ నీకు బాధకలిగిస్తూ ఉంటాను. నా స్వభావమే అంత. వేరువిధంగా అనుకోవద్దు. నువు నా కన్నా వయసులో చాల చిన్నవాడివి. నాకు తమ్ముడులాంటి వాడివి. అందు చేత మాట మాటకీ వెట్టిచాకిరి చేయించుకుంటూ వుంటాను. ఈ సారి టపాలో రచనలు పంపుతాను; ఉత్తరం కూడా రాస్తాను.

—శరత్.

౧౬.

24, డాక్ స్ట్రీట్,
రంగూన్, వైశాఖం 1913.

ఫణి బాబూ!

వెనుకటి టపాలో 'చంద్రనాథ్' కొంతభాగం పంపించాను. ఈ సారి టపాలో మరికొంత బాగం పంపిస్తాను. చాల

బాధగా వుంది. 'యమున' వైశాఖమాస సంచికకోసం యాతన పడుతున్నాను. తలనొప్పి జాస్తిగా వుంటూంది. ఏ పనీ చెయ్యా లేకపోతున్నాను. గ్రంథపఠనగాని, రచనగాని సాగటం లేదు. సౌరీన్ బాబుకు నా ఆశీర్వచనాలు. ఈ నెల ఎలాగో వెళ్ళబుచ్చాలి. ఆరోగ్యం చిక్కించుకుంటే ఆషాఢమాస సంచికకై విచారపడనక్కర్లేదు. సౌరీన్‌కు జవాబు రాయలేకపోయాను. అతడు నాకొక ఉత్తరం రాశాడు; చదివి చాల ఆనందించాను. నన్నక్కడికి రమ్మని రాశాడు. అటువంటి మిత్రుడు వుండటం ఒక సౌభాగ్యం. సగంమాత్రమే రాసిన 'చరిత్రహీనులు' ప్రమథబాబుకు పంపించాను చదవటానికి. దానికోసం అతడు మాటిమాటికీ ఉత్తరాలు రాస్తూ వుండటం మళ్ళీ మిత్రుని కోరిక కాదనలేక పంపించాను. అతడు దాన్ని తిరిగి పంపించిన తరువాత మిగతా భాగం రాస్తాను. ఈ నెలలో చిన్నకథ రాయలేను. ఒక వ్యాసం రాద్దామని ఆరంభించాను; పూర్తి చెయ్యలేక పోయాను. పూర్తిచేసి నీకు పంపించేసరికి 26 వ తారీఖు వస్తుందనుకుంటాను. కాబట్టి ఈ నెలలో నీకు ఉపయోగపడదేమో! నాకు చాల విచారంగా వుంది. ఎంత ప్రయత్నించినా నేనేమీ రాయలేకపోయాను. ఎవరైనా రాసేవాళ్ళుంటే చెప్పేద్దును. అటువంటి వాడెవడూ దొరకడు. 'యమున' వైశాఖమాస సంచిక నిజంగా బాగుంది. సౌరీన్ రాసిన కథ బాగుంది. వ్యాసాలున్నూ బాగున్నాయి.

—శరత్.

# ౧౨

రంగూన్
24-9-1913

ఫణిబాబూ!

మీ అమ్మగారు అప్పుడప్పుడు నా క్షేమసమాచారాల్ని అడుగుతూ వుండటం నా సౌభాగ్యం, ఆమెగారితో నేనిప్పుడు చాల ఆరోగ్యంగా వున్నానని చెప్పు. నా క్షేమచారాల్ని అడిగి తెలుసుకోవాలనుకునే వాళ్ళు ఈ విశాల ప్రపంచంలో ఎవరూ లేరు. అందుచేత ఎవరైనా నా మంచిచెడ్డలు తెలుసుకోవాలని ఆతృత పడేవారు ఉన్నారని తెలిస్తే నా హృదయం కృతజ్ఞతా పూర్ణమై పోతుంది. నావంటి హతభాగ్యులు ప్రపంచంలో చాల తక్కువమంది వుంటారు. కీర్తిప్రతిష్ఠలు కావాలన్న కోరికగాని, ఉపకారం చేస్తున్నాను, స్వార్థత్యాగం చేస్తున్నాను, అన్న గొప్పగొప్ప భావాలు కాని నా హృదయంలో ఇదివరకు చోటులేదు. ఇప్పుడు చోటటం లేదు. కీర్తి కావాలనుకుంటే దానికోసం ఇదివరకే ప్రయత్నం చేసేవాణ్ణి, ఇన్నాళ్ళు నోరుమూసుకు కూచుంటానా? మరోసంగతి: నేనొక శతద్వారీచండీ పారకునిగా తయారు కావటం నాకిష్టం లేదు. అదినాకు లజ్జాహేతువు. ఏదో ఒక పత్రికలో నియమితంగా రాస్తున్నాన, అది చాలు. నా రచనలంటే యిష్టం గలవాళ్ళు ఆ పత్రికే చదువుతారు. అంతేగాని హోమియోపతి మాత్రల్లాగ అందులో కాస్త, ఇందులో కాస్త రాస్తూ ఎక్కడినుంచో కొంతభాగం తర్జుమా చేస్తూ, ఇతర్ల భావాల్ని దొంగిలిస్తూ— [illegible] క్షుద్రదస్యవ్యవహారాలు నాకు చిన్నప్పటినించీ అలవాటు లేవు. [illegible] నికి ఉపక్రమిస్తే [illegible] గ్రంథపఠన

మూలపడి పోతుంది. నేను చనిపోయిన తరువాత తప్ప ఈలోగా గ్రంథపఠన మానివెయ్యను. నేను చిన్నకథ రాద్దామని ఉపక్రమించటమూ, అది పెద్దదైపోతూ వుండటమూ జరుగుతున్నది. నేనొక ఉద్దేశం పెట్టుకుని కథ ఆరంభిస్తాను. ఆ ఉద్దేశం స్పష్టంగా వ్యక్తమయ్యేవరకూ విడిచిపెట్టను. 'బిందోకాలల్' నీకు నచ్చదని నాకు తెలుసు. బహుశః ప్రచురించటానికి నువ్వు జంకుతావు. నామీద వుండే మొగమాటాన్ని బట్టి నీకు యిష్టం లేకపోయినా ఎక్కడ ప్రచురిస్తావోనని నేను మొదటి నించీ హెచ్చరిక చెబుతూనే వున్నాను. విశ్వాసం ఉండాలి. నిజంగా నీకు నచ్చివుంటే ప్రకటించ మంచిపనే చేశావు. ఈసారితో 'నారీకామూల్య' పూర్తిచేసి మరొకటి ఏదైనా ఆరంభిస్తాను. 'నారీకామూల్యకు' మంచిఖ్యాతే వచ్చింది దానికి పధ్నాలుగు కోట్లు మూల్యంగలదాన్నే రాయటానికి నిశ్చయించాను. ఈ సారి 'ప్రేమకామూల్య' లేకపోతే 'భగవాన్ కామూల్య' రాస్తాను. ఆ తరువాత వరుసగా 'ధర్మకామూల్య' 'సమాజకామూల్య' 'శాస్త్రకామూల్య' 'వేదాంతకామూల్య' 'సత్యకామూల్య' 'సాంఖ్యకామూల్య' 'వేదాంతికామూల్య' రాస్తాను...'చరిత్రహీనులు' పధ్నాలుగు పదిహేను అధ్యాయాలు రాశాను. మిగిలింది కొంతభాగం చిత్తుకాగితాల మీద రాశాను. తిరగరాయాలి. ఆ తరువాతి అధ్యాయాల్ని నిజంగా చాల *Grand* గా తయారు చేస్తాను. మొదట్లో పాఠకులు ఏమైనా అననీ; చివరకు మాత్రం వాళ్ళు అభిప్రాయాల్ని తప్పకుండా మార్చుకుంటారు. నేను అబద్ధపు బడాయిలు చెప్పుకోను. నా

నిజమైన విలువ తెలుసుకోకుండా మాట్లాడను. నిజంగా దీని భాగం చాలా గొప్పగా ఉంటుంది. నైతికంగానీ, అనైతికంగానీ 'ఇదికూడా ఒక రచన' అని ప్రజలనేట్లుగా చేస్తాను. దీని వల్ల నాకు అపకీర్తి వస్తుందన్న భయం ఎందుకూ? అపకీర్తి వస్తే నాకు వస్తుంది. అదిగాక నేను గీతకు టీక రాస్తున్నానని ఎవ రంటారు? దాని పేరు 'చరిత్రహీనులు' ఆ భావం పాఠకునికి ఆదరించే కలిగేట్టు చేశాను. అది నీతిశాస్త్ర ప్రచార సభకు గాని, స్కూళ్ళ పాఠ్యగ్రంథంగాగాని ఉద్దేశించింది కాదు. టాల్‌స్టాయి రాసిన 'రిజరెక్షన్' చదివిన వాళ్ళు 'చరిత్ర హీనులు'కు ఖ్యాతి రేకరంగా విమర్శించరు. కళాదృష్ట్యా, మనో విజ్ఞాన శాస్త్రదృష్ట్యా గొప్పదైన గ్రంథంలో దుశ్చరిత్ర లేకుండా ఉండదు. 'కృష్ణకాంతకే వసీయత్ నామా'లో లేకుండాపోయిందా? డబ్బే ప్రధానం కాదు. దేశసేవ చెయ్యాల్సిన అవసరం వుంది. నలుగురైదుగురికి నిజంగా చదువు సంధ్యలు చెప్పి అక్షరాస్యులను చేయగలిగితే, లోకంలో జరిగే అత్యాచారాలని ఖండిస్తూ బిగ్గరగా ప్రచారం చేయగలిగితే...అంతకన్నా ఆనందకరమైన విషయం ఏముంటుంది? అటువంటి క్షుద్రవ్యక్తిని గురించి ఈనాడు ప్రజలు వినిపించుకోరు. కాని ఒకనాడు వినిపించుకోవలసే వుంటుంది. కాని ఈ సంకల్పంతోనే ఒకప్పుడు నేను 'సాహిత్యసభ' అంటూ స్థాపించాను. కాని ఇవాళ ఆ సభా లేదు; నాకు ఆనాటి శక్తీ లేదు.

—శరత్

రంగూన్

10-10-1916

పణి బాబూ :

నువ్వు పంపిన 'బడదీది' చేరింది. పెద్దరచన కాదు. కాని చిన్నప్పుడు రాసింది. అచ్చువెయ్యకుండా వుంటేనే బాగుండేదేమో!

ఈ నాడు పత్రికల్లో ప్రచురితమౌతున్న చిన్నకథల్లో పదిహేను అణాలవంతు తీసి పారేయవలసినవే. అవి అన్నీ 'సాహిత్యం' కాదు. అసలు కథలే కావు. సిరాఖర్చు; కాగితాల ఖర్చు; పాఠకలోకం మీద అత్యాచారం! ఈ సారి ఎన్నో కథలు ప్రచురించారు. కాని ఒక్కటికూడా మంచిది లేదు. చాలవరకు చదవతగినవి కాదు. ఏ కథలోనూ తత్వం లేదు; భావంలేదు. కేవలం శబ్దాడంబరం మాత్రం కనిపిస్తుంది. ఏవో సన్నివేశాలు కూర్చటం, బలవంతాన (*Pathos*) కరుణ రసాన్ని సృష్టించేందుకు ప్రయత్నించటం. అంతే. ఒక ముసలి వేశ్యను తీసుకుని, అలంకారాలు చేసి లోకుల్ని మురిపింప చేసే ప్రయత్నాలు చూస్తూంటే సిగ్గేస్తుంది. అటువంటి కథలు రాయటానికి ఈ రచయితలంతా చేస్తున్న ప్రయత్నాలు చూస్తూంటే నాకు చాల అసంతృప్తి కలుగుతున్నది; మతి చెడిపోతున్నది. ఈ నాడు చిన్నకథలకు చాల దుర్దశ దాపురించింది.

'చరిత్రహీనులు' విషయమై ఒకటి రెండు మాటలు చెబుతాను: దాన్ని గురించి ఎవరేమీ అనుకుంటున్నా నాకు తెలుసు. ఆ పుస్తకాల విషయమై లోకుల్లో భిన్న భిన్న అభి

ప్రాయాలు వున్నాయి. అవి అద్వైతికము (Immortal) అని చాల మంది చెబుతూనే ఉన్నారు. కాని ఇంగ్లీషు సాహిత్యంలో ఉత్తమ రచనలని చెప్పబడుతున్న గ్రంథాల్లో కొన్ని అద్వైతిక సంఘటనల కూర్పు కనిపిస్తూనే ఉంది. అయినా మన సాహిత్య పరుల అభిప్రాయాలను నాకు తెలుపుతూ ఉండు,

—శరత్.

## ౧౯

రంగూన్,

20-3-1914.

శ్రీ హేమేంద్ర కుమారరాయ్‌కి :

హేమేంద్రబాబూ! ఈమధ్య కొన్నాళ్లు రంగూన్‌లో లేను. నేను తిరిగి రాకముందే మీ ఉత్తరం వచ్చింది. వెంటనే టపాలోనే జవాబు వ్రాయవలసి ఉంది. కాని శరీరం అస్వస్థంగా ఉండటంచేత ఏమి పొరపాట్లు రాస్తానో అన్న భయంతో రాయలేదు. మరోవిధంగా అనుకోకండి. శరీర అనారోగ్యంవల్ల సామాన్య సభ్యతనుకూడా అతిక్రమిస్తానేమో నన్న భయం కలుగుతూ వుంటుంది నాకు. అయినా ముసలివాణ్ణి. మీలా అంతటి కుర్రవాడిని.

'చరిత్రహీనులు' వచ్చే యేడాదిలో సగం గడిచాక పూర్తి అవుతుందేమో! అంతా పూర్తి అయ్యేదాకా దాన్ని సాధారణ పాఠకుడు ఏవిధంగా సమాదరిస్తాడో ఊహించటం కష్టం. నా రచనలపట్ల మీరు చూపిన ఆదరణకు చాల సంతోషిస్తున్నాను. అందరూ అలాగే దయవుంచి ఆదరిస్తే చాలు. అంతేగాని నా రచనలన్నీ సామాన్యమైనవే. వాటిలో ఏమి

విశిష్టత ఉంది? కాని నాకు ఒక్క లక్ష్యం మాత్రం వుంది. నా భావాలకూ రచనకూ సామ్యం ఉందా లేదా అని చూచుకుంటూ వుంటాను. భావాన్ని అనుసరించే రాస్తాను. వాళ్ళే మనుకుంటారో, వీళ్ళేమనుకుంటారో అనే దృష్టి వుండదు నాకు. కాబట్టి కొన్ని రచనలు పాఠకులకు నచ్చుతూ వుంటాయి; కొన్ని నచ్చకుండా పోతాయి. నచ్చకపోయినా సభ్యత పాటించి వారు నన్ను అవమానించటానికి పూనుకోరు. మీ రచనల్లో ఒక విశేషం వుంది. నాకు బాగా నచ్చాయి. మీ దయ ఎక్కువగా సంపాదించుకోమంటూ ఇటీవల ఫణిబాబుకు ఉత్తరం రాశాను. నాకు వంగభాషలో ఎక్కువ ప్రావీణ్యం లేదు. నా శబ్దభాండాగారం చాలా స్వల్పం. కాబట్టి నా రచనలు చాల సరళంగా వుంటాయి. కాఠిన్యానికి తావు లేదు. నా అల్పపాండిత్యమే నా పనికి ఉపయోగించిందని చెప్పవచ్చు. 'భారతవర్ష' పత్రికలో హరిద్వారము మొదలైన తీర్థయాత్రలను గురించిన వ్యాసం హరేమేంద్రరాయ్ రాసినట్టుగా ప్రచురితమైంది. అది మీదేనా? ఈ సంగతి వెంటనే తెలుపండి.

మరొకసారి తీరిక చిక్కినప్పుడు ఇంకా వివరాలు రాస్తాను. మీ ఉత్తరం ఎక్కడో పెట్టాను; ఎంత వెదకినా కనిపించలేదు, అందుచేత ఈ ఉత్తరాన్ని ఫణిబాబు అడ్రసుకు రాస్తున్నాను, బహుశః మీరడిగిన అన్ని ప్రశ్నలకూ జవాబు రాయలేక పోయానేమో! శరీరం చాలా అస్వస్థతగా వుంది. ఇవాల్టికి ఇంతే సంగతులు. ఈసారి ఉత్తరంలో ఇంకొన్ని విష

యాలు రాస్తాను. మీతో చెప్పాల్సిన అంశాలు చాలా వున్నాయి.

ఫణిబాబును, అతని 'యమున' ను కాస్త కనిపెట్టి చూస్తూ వుండండి మీరు కాస్త అతనికి సాయం పోతుంటే నా భారం సగం తగ్గుతుంది.

ఇట్లు
మీ అనుగ్రహాకాంక్షి,
శరత్‌చంద్ర చట్టోపాధ్యాయ.

## ౨౦

రంగూన్,
25-11-1913.

శ్రీహరిదాసు చట్టోపాధ్యాయకు!

'శ్రీకాంత కీ భ్రమణకహానీ' నిజంగా ప్రచురించ టానికి యోగ్యమైన దేనని నే ననుకోలేదు; ఇప్పుడూ అనుకోటంలేదు. కాని ఎవరో ఒకరు ప్రచురించక పోతారా అనుకున్నాను. ఆరంభంలోనే వున్న శ్లేషను పురస్కరించుకుని దానికి మీ పత్రికలో స్థానం ఉంటుందన్న సంగతి విదితమే. కాని అట్టి అభ్యంతరం మరో పత్రికలో వుండదుకదా అన్న ఆశే నాను. అందుకోసమే దాన్ని మీ ద్వారా పంపాను. మీరు రాయమంటే ఇంకా మిగిలింది రాస్తాను. ఆ శ్లేష ఆరంభంలో చివరదాకా సత్యములైన సంఘటనలే రాస్తాను.

నా పేరుమాత్రం ఎవరికీ తెలియకూడదు. అతడెవరు? శ్రీకాంతుని ఆత్మకథతో కొంత సంబంధం వుండవచ్చు. అదీగాక అది భ్రమణ వృత్తాంతం. కాని అందులో 'నేను' నేను

కాదు. ఫలానా వ్యక్తిని కలుసుకున్నాను; ఫలానా వ్యక్తిని అంటి పెట్టుకుని వున్నాను;—అని ఇలా అనుకోటానికి వీల్లేదు. రవిబాబు తన ఆత్మకథ రాసుకున్నాడు. కాని తను మాత్రం ఎలాగ పరదాచాటునే వుంచుకోగలిగాడు! రచన చేతగాని వాళ్ళు...అంటే తమ రచనలను తాము సరిగా విమర్శగా చూడుకోలేని వాళ్ళు. ఎంత గొప్పవాళ్ళయినా సరే...తమ పొడుగాటి రచనలు ప్రచురితం అయిన తర్వాత నిరాశపడక తప్పదు. అన్ని సంఘటనలూ కథలు పోతాయని వాళ్ళ అభిప్రాయం. తాము చూసింది, విన్నది, ఎక్కడో జరిగింది, ఏదైనా సరే ఇతర్లకు చూపించేందుకు, వినిపించేందుకు యోగ్యమైనదేనని భావిస్తారు. చిత్రలేఖనం తెలియని వాళ్ళు కుంచె చేతిలో పుచ్చుకుని కనిపించిందల్లా బొమ్మగీయటానికి చూస్తారు. కాని ఎక్కువ అనుభవం మీద విషయం అది గాదని తెలుస్తుంది. అనేక గొప్పవిషయాలను విడిచిపెట్టవలసి వుంటుంది; ఎంతెంతో చెప్పాలన్న ఆశను అణుచుకోవలసి వుంటుంది; అప్పుడే చిత్రాన్ని గీయగలం. చెప్పటం కన్నా, చిత్రం గీయటం కన్నా చెప్పకుండా వుండటం; చిత్రం గీయకుండా ఉండటమే చాల కష్టం. ఎంతో ఆత్మ సంయమనం కావాలి; ఎంతో లోభాన్ని అణచుకోవాలి. అప్పుడే సత్యాన్ని చెప్పటం, చిత్రించటం సాధ్యమౌతుంది.

అరే, మీకు లెక్చర్ చెబుతున్నానే! క్షమించండి. ఈ విషయాలన్నీ నా కన్నా మీకే ఎక్కువగా తెలుసు. ఏమైనా గాని... 'శ్రీకాంత్' చదివి లోకులు ఎలా ఛీ, ఛీ అంటారో దయచేసి నాకు తెలపండి. అంతవరదాకా మిగిలిన భాగం ఒక్క పంక్తికూడా రాయను.

నేను ఇప్పుడు ఇంకో కథకూడా రాస్తున్నాను. బాగానే వుంటుంది. సుఖాంతమే; కష్టాంతం కాదు. ఎంత తొందరలో పూర్తి చేయగలుగుతానో చూస్తాను.

ఈకథను భావాన్ని 'గోరా'లోని పరేశ్ బాబు ఇచ్చాడు. అంటే అనుకరణ అన్నమాట; తెలుసుకోటం కష్టం. సమాజ పరిస్థితులకు సంబంధించిన కథ. అందంగానే తయారౌతుందని నాకు చాల ఉత్సాహంగా వుంది. కాని దీని తరువాత ఏది వస్తుందో చెప్పలేం.

—శరత్.

౨౧

రంగూన్,
7-12-1913.

రాస్తూన్న కొత్తకథ సకాలంలో పూర్తిచేసి పంపించగలనని ఆశిస్తున్నాను. అది పూర్తిగాని పక్షంలో మరో చిన్న కథ ఒకటి పంపుతాను. దాన్ని పూర్తి చెయ్యకుండా ఎలా పంపను? పూర్తిచేస్తానన్న నమ్మకంతో ప్రచురణ ఆరంభించమనీ చెప్పలేను. కాని 'చంద్రకాంతకీ కహానీ' స్వతంత్ర రచన. మీరు అభయమిస్తే దాన్ని గురించి ఒకమాట చెబుతాను: సంపాదక మహాశయులు దాన్ని నిర్లక్ష్యంగా చూడకుందురుగాక! ఇంతవరకు ప్రచురితమైన, ఇప్పుడు ప్రచురితమౌతూన్న రచనలకన్నా ఇది తక్కువేమి కాదు. ఎన్ని సాంఘిక పరిణామాలో కాల గర్భంలో దాగి వున్నాయి. నేనెంతో ప్రయత్నించి, కష్టపడి బయటికి తెస్తున్న ఈ వస్తువు మీ కెంత ఆదరణను సంపాదించగలదనే నా విశ్వాసం

భంలో ఖరాబుగానే వుంటుంది. కాని మంచివస్తువెప్పుడూ మొదట ఖరాబుగానే కనిపిస్తుంది అంతే నేను చెప్పేమాట! 'యీసారైనా ప్రచురిస్తాగా! అచ్చుపడితే చూడాలన్న ఆశ తోనే దాన్ని మీకు పంపించాను. ఆ సంగతి దాని పీఠికలో రాశాను కూడా.

—శరత్.

## ౨౨

54/36 వాం స్ట్రీట్,
రంగూన్, 22-2-1913.

చాలరోజులాయె మీ దగ్గరనించి ఉత్తరం లేదు. అంతా కులాసాగా వున్నారు కదా! నా వ్యవహారమంతా తల్ల క్రిందులుగా వుందిక్కడ. అంతదూరంనించి కూడా ప్రమథబాబు గాలి సోకి నేనేమైపోతున్నానో నాకే తెలియటంలేదు. ఇప్పుడు ఆరోగ్యం మరీ పాడైపోయింది. ఇది బర్మా జ్వరం. ఈ దేశం విడిచిపెడితేగాని ఈ జ్వరం నన్ను విడిచిపెట్టేటట్టులేదు. నేను బర్మాను విడిచి పెట్టటమో, జ్వరం నన్ను అంటిపెట్టుకుని వుండటమో ఏదో ఒకటి తప్పదు నాకేమీ తోచటంలేదు. ఏమి కావలసి వుందో భగవంతునికే తెలియాలి. బ్రతుకంతా అవిటి బ్రతుకుగా వెళ్ళబుచ్చాలి కామాలు! నాకు చాల భయంగా వుంది. మనస్సంతా చంచలంగా ఉంటోంది. ఏ పనీ చెయ్యలేక పోతున్నాను. ఈ సమాచారమంతా జలధర దాదాను చెప్పి 'సమాజధర్మమూల్యం' చదవటానికి ఇవ్వండి. అంతవరకే ఫెయిర్ రాయగలిగాను. మిగిలిన భాగం తరువాత ఫె . . . . . . స్తాను, ఆ తరువాత రాయదలుచుకున్న

దంతా ఇతర దేశాల సమాజ వ్యవస్థకు మనదేశ సాంఘిక వ్యవస్థకూగల రీతి భేదాలు మాత్రమే. ఇందులో వ్యక్తిగత భావాలకు తావులేదు. దాన్ని 'భారతవర్ష' లో ప్రచురించటం అతనికి ఇష్టమో కాదో నాకు తెలియదు. ఇష్టం లేకపోతే తిరిగి పంపించెయ్యండి. నేను పూర్తిగా రాసి... అందులో ఏమైనా వ్యక్తిగత అంశాలు వుంటే తీసివేసి ప్రచురణ యోగ్యంగా తయారు చేస్తాను. సాంఘిక తత్వాన్ని గురించిన ఈ రచన ఆరంభించి చాల రోజులైంది. ఇంకా ఈ ఉత్తరంలో మీకు చాల విషయాలు చెప్పాలని హృదయం ఉబలాట పడుతోంది. కాని సూక్ష్మంగా, సభ్యరీతిని ఎలా చెప్పాలో నాకు పాలుపోవటం లేదు.

జలధర బాబుకు చాల ఆశలు కల్పించాను. కాని మనస్సు స్థిరంగా వుంటేతప్ప కథలు రాయటం కష్టం. శాశ్వతంగా నేను హతభాగ్యుడుగానే ఉండవలసివస్తే..ఏం చేస్తాను? ఈ దుఃఖాన్ని ఎలాగో సహిస్తాను మరి! నేనిలా అవిటి బ్రతుకు వెళ్ళబుచ్చటం భగవంతుని ఆశీస్సుగా భావించి స్వీకరిస్తాను. నా శరీరం కట్టెలా ఉండేది. దీనికి జ్వరబాధ అంటూ సోకుతుందని నే నెన్నడూ అనుకోలేదు. ఈ జ్వరం అనివార్యమే అయితే ఆవశ్యకమైనదని కూడా భావిస్తాను. చిన్నప్పుడు నాకు భగవంతుడంటే చాలభక్తి వుండేది. కాని మధ్యలో ఆయన్ను పూర్తిగా మరిచి పోయాను. చివరకు ఈ అంతకాలంలో ఆయన వచ్చి నాకు దర్శనం ఇవ్వగోరుతున్నట్టయితే... మంచిదే కదా!

—శరత్.

రంగూన్,
మార్చి 1916.

మీ ఉత్తరం చేరింది. కాని ఇక్కడినించి వారానికి వారానికి ఒకటే ఓడ బయలుదేరి వెడుతుంది. అందుచేత జవాబు రాయటం ఆలస్యం అయింది.

నా వ్యాధిని గురించి తెలుసుకున్న మీదట మీరు రాసినఅంశాలు మీ సహృదయత్వాన్ని తెలుపుతున్నాయిగాని నాకే మాత్రం ఆశకలగటం లేదు. మీకు దీర్ఘాయువు, చిర సౌఖ్యం లభించుగాక! మీకు ఏమాత్రము దుఃఖమూ సోక కుండా భగవంతుడు రక్షించుగాక!

నేను చాల బాధపడుతున్నాను. నయం ఔతుందన్న ఆశ నాకు లేదు. శరీరాన్ని, అవయవాల్ని యథాతథంగా వుంచే నన్ను ఎందుకూ పనికిరాని జీవచ్ఛవంగా తయారు చేయటమే భగవంతుని ఇచ్ఛ కాబోలు. అందుకే నన్నిలా శిక్షిస్తున్నాడు. ఒక చోటినించి ఇంకో చోటికి నడిచిపోగల శక్తిలేదు కాళ్ళుకట్టి పడేశాడు భగవంతుడు. చేతులతో మాత్రమే నీపని నీవు చేసుకోమని ఆయన ఉద్దేశం కావాలు! అలా తోస్తూ వుంటుంది నాకప్పుడప్పుడు. కాని జీర్ణశక్తి కూడా నానాటికి తగ్గిపోతూ ఉన్నది.

మీరు నాకు ఇవ్వదలచుకున్నది...అదే పదివేలు. నేను ఈ యేడాదిలో చావను. కాబట్టి కొంత ఋణం తీర్చుకో గలుగుతాను. కాని కృతజ్ఞతా ఋణం మాత్రం అలాగే ఉంటుంది. ఒక యేడాది సెలవు పుచ్చుకుని వచ్చేస్తాను. ఎప్పుడు టికెట్టు దొరికితే అప్పుడే ఓడ ఎక్కి వచ్చేయాలని

పిస్తోంది. మీరు నాకు మూడువందలు రూపాయలు పంపించగలిగితే సంతోషంగా వచ్చేస్తాను. ఈ దిక్కుమాలిన చోటు నించి వచ్చేసి మీ వద్ద కొంచెం ఆర్థికసహాయం పొందగలిగానంటే... ఈ యేడాదికి ఇంతే చాలు.

ఇప్పుడు కొంచెం బాగానే ఉంటోంది. నొప్పి కొంచెం తగ్గింది. కవిరాజు తైలం మర్దన చేసి చూస్తాను ఏమైనా ఉపగిస్తుందేమో. మీకు నా కోట్లకొలది ఆశీర్వాదాలు. ఇలా మిమ్మల్ని అంతగా ఆశీర్వదించే వాళ్ళు ఎక్కువగా ఉండరనుకుంటాను. సెలవుపెడితే ఆఫీసునించి ఏమైనా జీతం ముట్టుతుందో లేదో తెలియదు. ఇక్కడి ఆఫీసు నియమాలన్నీ పెద్ద దొరగారి ఇష్టా ఇష్టాలమీద ఆధారపడి వుంటాయి. మీరు నాకు ఇవ్వదలచుకున్నదే...అదే నాకు పదివేలు.

—శరత్.

## ౨౪

రంగూన్, మార్చి 1916.

మీరు పంపిన మూడువందల రూపాయలు నిన్న చేరాయి. ఏప్రిల్ 11 తేదీ వరకూ ఓడ టిక్కెట్టు దొరికేట్టు లేదు.

—శరత్.

## ౨౫

266, శివాలయం,

బనారస్ సిటీ, 7-4-20.

కళ్యాణమస్తు! మీ ఉత్తరం చేరింది. ఇక్కడ ఎండలు ఎక్కువగా వున్నాయి. క్షణంకూడా ప్రాణాలు నిల్చేట్టు లేవు.

ఆయన సంభ్రాంతుడై మృత్యువు విషయం చెప్పలేదు. ఆ సంగతే వుచ్చరించలేదు. అన్నాడు కదా: "ఈ జాతకుడికి 47 వ యేట మోక్ష ప్రాప్తి కాకపోతే... ఉత్తరాయణాన ప్రాతఃసంధ్యాకాలంలో 56 వ యేట శరీరత్యాగం చేస్తాడు." ఇంతకూ అసలు విషయం ఏమిటంటే — ఇదంతా నిజం కాదు. నాకు బాగా తెలుసు కాని నా గతజీవితాంశాలను అక్షరాలా వున్నది వున్నట్టు ఎలా చెప్పగలిగాడో నాకు ఆశ్చర్యంగానే వుంది. అదే ప్రస్తుతం ఆలోచిస్తున్నాను. ఏమో, వుండి వుండి ఈ ముసలితనంలో మళ్ళీ పోయి ఆ బంట్లో చేరుతానేమో!

—శరత్.

## ౨౭

ఇకనించి మీరు నన్ను శాసిస్తూ మెలగాలి. శాపం పెట్టి అందర్నీ భస్మీపటలం చేసే శక్తి మాత్రం కాకూడదండి. ఇక్కడ సుభాగబాదుడి అని ఒక సంఖ్యా శాస్త్రజ్ఞుడున్నాడు. అతడేదో లెక్కవేసి నేను చాల ధార్మికవ్యక్తినని నిర్ణయించాడు, ఈ సత్యం అతడొక్కడే చెప్పాడు. ఏమో తీసుకుపోయి నన్నూ ఆ జట్టులో కలిపేస్తాడేమో!

—శరత్.

## ౨౮

సామతాబేడ్, పానిత్రాస్, హావడా.

కళ్యాణమస్తు'...గత బుధవారంనాడు జ్వరంవచ్చింది. ఎనిమిది రోజులైనా ఇంతవరకూ తగ్గలేదు. 'దత్త' నాటకంగా మార్చి ప్రదర్శించటానికి అనుజ్ఞ కోరారు మీరు. అనుజ్ఞ నేను సంతోషపూర్వకంగా ఇవ్వటానికి సంసిద్ధుడనై వున్నాను.

కాని విధి వైపరీత్యం ఏమంటే ఇంతవరకూ నేనా నాటకం పూర్తి చెయ్యలేదు.

ఇంకెవరి చేతనన్నా రాయించాలని మీ ఉద్దేశమా? అతను నాకన్నా త్వరగా రాయగలడా? ఇంకొక రెవరో రాయటం కష్టమైన పనే. అది మొదట నవలరూపంలో రాసింది నేను. ఇంకెవరో అయితే అన్ని అంశాలు చక్కగా జతికట్టి రాస్తాడో లేదో మరి! అతని గమన ప్రద్యుమ్నానుకూలంగా సాగుతుందో లేదో! నేనే అయితే ఆ యిబ్బందులేమీ ఉండవు. ఇప్పుడింక 'విజయ' అనే పేరుతో ఒక నాటకం కూడా రాసి అచ్చువేయించాలని చూస్తున్నాను. మీ రింకెవరి చేతనో రాయించేట్టయితే నేనా పని చెయ్యలేను. దాన్ని సినిమా స్క్రిప్టుగా మార్చాల్సిన అవసరం నాకు లేదు.

మొదటి అంకం ప్రబోధబాబుకు చూడ్డానికి ఇచ్చాను. అతను మళ్ళీ పంపించలేదు. నా దగ్గరున్న చిత్తుకాపీని ఆధారంగా చేసుకుని ప్రద్యుమ్నానుకూలంగా నాటకం రాద్దామని ఆరంభించాను. కాని ఇంతలో ఈ అవాంతరం వచ్చేసింది.

ఆలస్యం అయితే మీకు బాధే. నటీనటులకు మీరు అనవసరంగా వేతనం ఇచ్చుకుంటూ వుండాలి, ఈ పరిస్థితుల్లో నేనేం చెయ్యాలో నాకేం తోచటం లేదు ఒకరకంగా పుస్తకం పూర్తి అయినట్లే. అక్కడక్కడ కొన్ని మార్పులు చేసి, కొన్ని చోట్ల కొంత అదనంగా రాసి కాపీ తయారు చెయ్యటమే. ఈలోగా గనుక ఆరోగ్యం చిక్కితే ఆ పనిపూర్తిచేసి పంపుతాను మీ నిర్ణయం ఇదివరకే తెలిపివుంటే బాగుండేది.

నా స్త్రవిక సంపుటాలు 1981 సంవత్సరం, పాఠకుల కథలు తెలియని ఫాలాలుగల కవిత్వంగాని, కథలుగాని నా ముందుకి వచ్చినాయి. ఎందుకో బ్లాకంటే తెల్పెగా అనిపించాయి. బాగా బోధపడతాయి. ఇంకో సంగతి కొన్నాళ్ళ క్రితం 'సాహి మతి' పత్రికలో మా 'బిందు'ను గురించి విమర్శిస్తూ "హిందూ వితంతువు రాత్రిపూట పరాయి కత్తెంటికి వెళ్ళటంలో ఏమి సభ్యతఉంది?..." ఇలాగ ఏమేమో రాశారు ఒక మిత్రుడు చెప్పాడు. అక్కడికీ ఆ వాక్యాలు నాకు తెలియవు. ఆ విమర్శకుని మూర్ఖతను ఖండిస్తూ చాల తీవ్రంగా ఒక ప్రతి విమర్శరాసి ఏ పత్రికలోనైనా ప్రచురిద్దా మనుకున్నాను. చాల కటువుగా రాద్దామనుకున్నాను. 'నీవయితే సభ్యతలో లోపంలేదు, నువే మూర్ఖుడివి. అందువల్లనే నీకు దానిలో దోషాలు కనిపించాయి...' అంటూ ఘోరంగా రాద్దామను కున్నాను. బిందు ఏమి తప్పు చేసిందో నాకేమీ బోధపడటం లేదు. పాపం ఆమె తనలాంటి ఒక నిస్సహాయుడైన అభాగ్యుడైన మిత్రుడిని చూడ్డానికి రాత్రిపూట చాటుగా వెళ్ళింది. ఎందుకు? చూచి నాలుగు కన్నీటిబొట్లు రాల్చేందుకు — అంతేగా! మనసులో ఆమె కనుపిస్తే కొంచెం స్నేహం ఉంటే ఉండచ్చు. చిన్ననాటి స్నేహితుడు కాబట్టి ఇదొక పెద్ద దోషమా? అసభ్యమా? విధవరాలు కాబట్టికదూ! అంటే ఒక హిందూవితంతువు కళ్ళముందు ఒకవ్యక్తి చచ్చిపోతూ ఉంటే... ఆమె నాస్త చేయిచాచి స్పృశించినంతమాత్రాన అతను బ్రతికేట్లయితే... అంతమాత్రం కూడా అమె చెయ్య కూడదన్నమాట! ఆమె విధవరాలు కావటం వల్లనేకదూ!

ఆ చనిపోయేవ్యక్తి పురుషుడు కావటంవల్లనే కదా! ఇంతేనా హిందూవితంతువుల అదృష్టం!

ఇటువంటి సంకుచితమైన బుద్ధులతో లోకులు ఇతరుల తప్పుల్నే ప్రాముఖ్యంగా వేలెత్తి చూపిస్తూ ఉంటారు. ఇటువంటి విమర్శనలను చదివి 'ఆమాట నిజమే, చాల బాగ రాశాడు' అంటారు.

ఆ విమర్శన ఎలా ఉందో నేను చెప్పలేను. నామిత్రుని ద్వారా విన్నమాటల్నిబట్టి రాస్తున్నాను. ఆ విమర్శన నువ్వు చూసే ఉంటావు.

జపం, తపం, హిందూధర్మం, సన్యాసం – ఇలాంటి గొప్ప గొప్ప పదాలు ఉంటేగాని కథగాని, నవలగాని ఉత్తమమైనది కాదని భావించే పాఠకులూ ఉన్నారు.

ఒక వితంతువుకు వివాహం అయిందని ఏ కథలోనైనా రాశావా అంటే... నువ్వు ఎక్కడికి పారిపోతావు?... 'కొట్టు, చంపు' అంటూ నీమీదికి అంతా దాడివస్తారు— లేనిపోని నిందారోపణలు చెయ్యటంలో వాళ్ళు చాల నేర్పరులు. వాళ్ళబలం అంతా అందులోనే ఉంది. ఛీత్కారం చేస్తూ శరీరబలం ఉపయోగించి విజయం పొందటానికి చూస్తారు. విజయాన్ని సాధిస్తారు కూడా.

రోజురోజుకూ మన సాహిత్యం అంతా ఒకే పోతలో పోసినట్టు తయారౌతోంది. రోజురోజుకూ సంకుచితభావపూర్ణం ఔతోంది. అందుకనే విశృంఖలంగా రాద్దామనిపిస్తూ ఉంటుంది నాకు అప్పుడప్పుడు. కోపంవచ్చి ఎప్పుడో ఉన్నది ఉన్నట్టుగా రాసేస్తానేమో! కొన్నాళ్ళక్రితం నేను మా

అక్కయ్య పేరుమీద 'నారీ కామూల్య' రాశాను అదొక పెద్ద వ్యాసం. మొదట మా అక్కయ్య ఒక ఉత్తరం రాసింది. దాన్నే నేను పెంచి రాశాను. దానిమీద బంధువులు, మిత్రులు నాపై ఎంతకోపం ప్రకటించారో చెప్పలేను. నేను మ్లేచ్ఛుడి ననీ, నిజంగా హిందువును కాదనీకూడా అన్నారుచాల మంది. హిందూధర్మాన్ని నేనెప్పుడూ అవహేళన చెయ్యలేదు; కాని అనాచారం మీద దాడీ చేశాను. దాన్ని భయంకరంగా విమర్శిస్తాం అని చాల మంది బెదిరించారు. అయితే ఇంతవరకూ ఎవరూ ఏమీ చెయ్యలేదు. నేను పైకి బ్రాహ్మణుడుగా కనిపించినా లోపల బ్రాహ్మసమాజికుడనంటూ ఒక మామయ్య ఉత్తరం రాశాడు. అయినా నా మెడలో తులసిమాల ఉంది; సంధ్యావార్చకుండా ఏమీ తినను, అందరిచేతి నీళ్ళు తాగను; చెడుగా అనుకోకు మణిబాబూ! ఈ విషయాలన్నీ నీతో చెప్పటం ఉచితంకాదు. నేను వాస్తవంగా ఎవరినో నీకు తెలుపుతున్నాను. నేను ఇలా ఉంటున్నాకూడా ఆ మామయ్య నన్ను చాల నిందించాడు. నేను ప్రపంచాన్ని మోసగిస్తున్నానన్నాడు. ఇంకా ఏమేమి రాశాడో ఏం చెప్పను? ఆ తరువాత నాకు జ్వరం పెట్టుకు వచ్చింది. లేకపోతే ఇలాగే 'దేవతాలం కా మూల్య' 'హిందూశాస్త్ర కామూల్య' ఇత్యాది శీర్షికలతో పెద్ద పెద్ద వ్యాసాలు ఆరంభించి రాసేవాడినే — ఎందుకీ విషయాలన్నీ! ఇంతవరకు అన్నీ నాసంగతులే రాశాను. మీరెలా ఉంటున్నారు? ఆరోగ్యం బాగుందా? కొత్తగా ఏమన్నా రాశారా? ఔనుగాని, మీరేమి రాసినా

చివరలో అక్షరశుద్ధి పోయి ముగింపు పాడుచేయద్దు. మీ రాతలో ఉన్న లోపం అదే అనుకుంటాను.

ఈ ఉత్తరంలో ఏమేమో రాశాను. చెడ్డగా భావించవద్దు. ఏమైనా అనుచిత వాక్యాలు రాసినప్పటికిన్నీ.

మీరెవరో రాసే భాషను సంబంధించిన ఒకటి రెండు పొరపాట్లను పురస్కరించుకుని విమర్శకులు గందరగోళం చేస్తున్నట్లు తెలుస్తోంది. నేను స్వయంగా మీకున్నట్లే (ఆ పొరపాట్లు) రాయగలను. కాని అలా రాయటంలో నాకు దోషమేమీ కనిపించదు. ఏమైనా మీరుండే భాష, అదే గుణితం రాస్తున్నారు. మంచిదే ఏదైనా మీకు మంచిదనితోచి ఇప్పుడు ఇతర్లు ఆక్షేపిస్తున్నారని మానివేయవద్దు మార్చుకోటం ఆవశ్యకమని మీకు తోస్తేనే మార్చుకోండి.

— శరత్.

---

రంగూన్

శ్రీ సుధీరచంద్ర సర్కార్‌కు!

ప్రియ సుధీర్ ! నీ ఉత్తరం నిన్న రాత్రి చేరింది. ఆలస్యం జరిగిందనీ, అందువల్ల కొంతబాధ ఉందనీ నాకు తెలియదంటావా ? కాని చాలవరకు కొత్తరీతిలో రాయవలసి వుంది. ఒకటి రెండు నెలలు ఆలస్యం అయితేనే మంచిది. ఆరంభంలో ఇంత బాగా దొర్లిన రచన చివరకు విరూపంగా తయారౌతుందేమోనని భయపడుతున్నాను.

అయినా ప్రమాణం అప్పిచ్చేమనక్కర్లేదు ఈసారి టపాలో చాల భాగం పంపిస్తాను. మళ్ళీ రాయటం అనేసరికి భయంగా వుంటుంది. ఒకసారి ఇదివరకు చెప్పినమాటే మళ్ళీ చెప్పలేను. అచ్చు అయినంతవరకు నాకు ఎక్కువ కాపీలు రాలేదు. అచ్చు అయినంతవరకు రిజిష్టరు చేసి పంపించు. మొదటివిచ్చి పంపించు. తొందరగా ముగించాలనుకుంటే ఒక పక్షంరోజుల్లో అయిపోతుంది. కాని అలా తొందరపడితే బాగుంటుందా? ఎంత ఆలస్యం అయినా మాఘమాసానికి చాలభాగం అయిపోగలదు. నా చేతుల పరిస్థితి పూర్వంలాగే వుంది. బహుశః ఇప్పట్లో బాగుపడవేమో! ఫాల్గుణమాసంలో వద్దామనుకుంటున్నాను. నీకు నా స్నేహపూర్వక ఆశీర్వాదాలు.

—శరత్.

## 30

14 మార్చి 1916

నేను జీవచ్ఛవంగా తయారైనాను. నీవు వినే వుంటావు. నేను లేచి తిరిగే యోగ్యతలేదు. గ్రంథపఠన, రచన మాత్రం మామూలుగా సాగిస్తూనే వున్నాను కాని మనస్సు ఏమీ బాగుండటం లేదు. ఏ పని చేయటానికీ ఇచ్ఛలేదు. బలవంతాన ఏ పనైనా చేద్దామని కూచున్నా సాగదు. కేవలం ఇదివరకు సగంవరకో, మూడోవంతో, నాలుగోవంతో రాసి వదిలేసిన రచనలు చాలా వున్నాయి... వాటిని పూరించి ఒక రూపంలోకి తీసుకొస్తాను. 'చరిత్రహీనులు' విషయంలో అలా చేయదల్చుకోలేదు. తడవకు రెండేసి అధ్యాయాలు రాసి పంపిస్తాను లేకపోతే నువ్వు వచ్చి నా దగ్గర కూర్చుంటే పని అయిపోతుంది.

నేను ఆయుర్వేద చికిత్స పొందుదామని కలకత్తా వస్తున్నాను. అక్కడ ఒక సంవత్సరం వుంటాను. ఏప్రిల్ 11 వ తేదీన బయలుదేరుతాను. ఈలోగా టిక్కెట్లు దొరకవు. వారానికి ఒక ఓడ, ఒక్కొక్కప్పుడు రెండేసి వారాలకు ఒకటే ఓడ బయలు దేరుతోంది. నువ్వు ఇక్కడికి రావాలనుకుంటే రా. కాని టికట్లు దొరుకుతుందా?

—శరత్.

## ౩౧

54/36 వాం స్ట్రీట్,
రంగూన్, 10-3-1916.

శుభమస్తు: నేను ముసలివాణ్ణి కాబట్టి నిన్ను ఆశీర్వ దిస్తున్నాను. నాతో ఎక్కువ పరిచయం లేకపోయినా నువ్వు ఉత్తరం రాసినందుకు అది నా పరమ సౌభాగ్యంగా భావించ లేనంత అహంభావిని కాదు నేను.

నీ ఉత్తరానికి జవాబు రాయటం ఆలస్యం అయింది. అందుకు మొదటి కారణం: ఇక్కడినించి టపా పదిరోజులకొక సారి గాని వెళ్ళదు. రెండో కారణం: నాకు వంట్లో సుస్తీగా ఉంటోంది.

ఈ వయసులో నాకు ఒంట్లో సుస్తీగా వుంటోందని విచారించటం శోభించదేమో! అయిన ప్రాణుల్ని ఆవరించిన రోగాలు ఒక పట్టాన వీడిపోవు కదా! నలభై సంవత్సరాలు దాటాక ఇటువంటి శరీర బాధలు రావటం మంచిదే అను కుంటూ వుంటాను. నా మనస్సుకు విచారం ఏమీ లేదు. పోనీ ఆ విషయాలెందుకు?

'గ్రామీణ సమాజ్' మీకు అసహ్యం కలిగించలేదనీ పైగా నచ్చిందనీ విని చాల సంతోషించాను. నా బాల్య, యౌవన దశలో చాల భాగం గ్రామంలోనే గడిచాయి. పల్లె లంటే నాకు చాల యిష్టం. అందువల్ల ఇంతదూరాన వున్నా నాకు ఏవో రెండుమూడు విషయాలు జ్ఞాపకంరాగా అవే రాశాను. ముసలితనంలో మరుపు ఎక్కువగానే వుంటుంది. కాని జ్ఞాపకం వున్న ఆ కొంచెమైనా నా ఆ సినాడూ! గ్రామ ప్రజలు తమ నిజమైన భావాలేమిటో దాచకుండా చెప్పే ట్లయితే...అవి చాల ఉపయోగిస్తాయి. నాకి నా స్వదేశ పరి స్థితులు...కలకత్తా మొదలైన పట్నాల్లోని ప్రజల కాల్పనిక నాగరకతా విశేషాల కన్నా...మంచి కథావస్తువు లౌతాయి.

ఇకపోతే సంసారం సంగతి, అందుకు ఉపాయం ఏమిటో పరామర్శించే ఓర్పు ఉందా? దానికెంతో శక్తి, అభిజ్ఞత వుండాలి. అవన్నీ నాకు వున్నట్లుగా నేనేదో చెప్పబోవటం అహం భావం కాదూ!

అయినా మధ్య మధ్య కొన్ని సూచనలు చేశాను. జ్ఞానవిస్తారం వల్లనే గ్రామ జీవితం సంస్కరించాలి. గ్రామం విడిచి ఏ దేశానికో పోయి కూచుని సంస్కరించలేం. గ్రామం లోనే వుండాలి. గ్రామంలోని మంచిచెడ్డలు తెలుసుకోవాలి. గ్రామంలోని అన్నితరగతుల వారితోను సన్నిహిత సంబంధం ఏర్పరచుకోవాలి. ఇవన్నీ చాల అవసరం. ఇలా నాలుగైదు సూచనలు చేశాను.

విశ్వేశ్వరి మాటలు బహుశః నీ దృష్టిని ఎక్కువ ఆకర్షించలేదనుకుంటాను. మరొకసారి నిబ్బరంగా పరిశీలిస్తే

మొదట్లో దృష్టికి తగలని కొన్ని అంశాలు బోధపడవచ్చు. ఒకవేళ నిర్భయంగా చదివినప్పటికీ ఆ మాటలకు ఎక్కువ సాత్త్వికమైన విలువ లేనేలేదేమో! మరొకసారి చదివి కాలం వృథా పుచ్చవలసిన అవసరంకూడా లేదేమో! నీ యిష్టం.

ఇంతవరకూ అన్నీ సంగతులూ రాశాను. ఇక నా గురుత్వానికి సంబంధించిన విషయం వుంది.

నాకు పద్దెనిమిదేళ్ళు దాటకముందు ఆచార్యత్వం వహించే శక్తి చాల వుండేది. అప్పుడు నా దగ్గర శిష్యులుగా వుండినవారు ఈనాడు నన్ను మించి చాల పైకివెళ్ళి కూచున్నారు. ఇప్పుడు వాళ్ళపేర్లు చెప్పాలంటే నువ్వు చాల ఆశ్చర్యపోతావు. నేనొకప్పుడు వాళ్ళ రచనలను చదివి తప్పులు కొట్టేసేవాడిని. మంచిచెడ్డలు సూచించేవాణ్ణి. ముందుమార్గం బోధించేవాణ్ణి.

ఆ తరువాత నా విజ్ఞానం వృద్ధిచెందుతోన్న కొద్దీ ఆచార్యత్వం కోల్పోతూ వచ్చాను. ఇప్పుడది అణుమాత్రం కూడా లేదు. నేను ఇతరులకు ఏ విషయమైనా నేర్పాలి, అన్న భావం నాకు కలలో కూడా లేదు.

ఈ ఉత్తరం మీకు చేరేలోగానే బహుశః నేను ఓడెక్కి రంగూన్ విడిచిపెడతాను. ఈ దేశం విడిచిపెడితే ఆరోగ్యం బాగుపడుతుందేమోనని ఆశ. మరొకసారి నీకు ఈ ముసలివాని ఆశీస్సులు.

—శరత్.

# ౩౨

54/36 వాం స్ట్రీట్,
రంగూన్, 7-4-1918.

శ్రీ మురళీధర వసుకు!

శుభమస్తు! చాలరోజులకు మీ ఉత్తరానికి జవాబు రాయాలని కూచున్నాను. ఇన్నాళ్ళు ఆలస్యం చేశాను. నావద్దనించి జవాబువస్తుందన్న ఆశే మీ కీపాటికి వదులుకుని ఉంటారు.

నేను చాల సోమరిని. ఇటువంటి తప్పులు చేస్తూ వుండటం నాకు అలవాటైపోయింది. అసలు కారణంకూడా ఒకటి వుంది. నాకు కొన్నాళ్ళనించీ జ్వరం నానాటికీ ఎక్కువౌతూంది. ఇక నే నీ దేశంలో వుండలేననిపిస్తోంది. నీళ్ళు మార్చాలి; ఇంకోచోటికి ఎక్కడికన్నా వెళ్ళాల్సిందే. ఈ ఉత్తరం మీకు చేరేలోపునే నా యీ చిరునామా మారిపోతుంది. ఒకవేళ మీరు దయతో దీనికి జవాబు రాయదలచుకుంటే... నా యీ ప్రస్తుత చిరునామా ఎలా తెలుసుకున్నారో కొత్త అడ్రస్ కూడా అలాగే తెలుసుకోగలరు. అయినా మీ కా అవసరం వుండదనుకుంటాను.

నా రచన మీకు నచ్చిందని రాశారు. సంతోషం. అదే నా పరిశ్రమకు తగిన పురస్కారం. మీరా సంగతి రాసి నన్నానంద పరచినందుకు మీకు నా ధన్యవాదాలు. మీకు నా ఆశీస్సులు, [illegible] తులు చేకూరుగాక! భగవంతుడు మిమ్మల్ని రక్షించుగాక!

—శరత్.

# 33

6, నీలకమలకుండు లైన్,
శివపురం, 16-6-16.

ప్రమథ చౌదరికి :

మీ దగ్గరనించి నాకు ఉత్తరం వస్తుందని నే నెప్పుడూ అనుకోలేదు. ఇవాళ మంటూ దగ్గరనించి కూడా ఒక ఉత్తరం వచ్చింది.

నేను ఈ దేశంవచ్చి సుమారు అయిదునెల లయింది. వచ్చినప్పటినించీ మిమ్మల్ని కలుసుకోవాలని అనుకుంటూనే వున్నాను. కాని ఇంత వరకూ సందర్భపడలేదు. ఏ దారిన వస్తే మీ యిల్లు చేరుకోగలనో నాకు తెలియదు. అదీగాక ఏ అసమయాన వచ్చి మీ పనిపాటలకు భంగం కలిగిస్తానేమోనని కూడా భయపడుతున్నాను, ఇప్పుడు మీరే స్వయంగా పిలిచారు కాబట్టి తప్పకుండా వస్తాను. వచ్చే బుధవారం మీ ఆఫీసుకు వచ్చి కలుసుకుంటాను, లేకపోతే శనివారంనాడు బాలీగంజ్‌లో వున్న మీ యింటికే వస్తాను. నేను మిమ్మల్ని తప్పకుండా కలుసుకోవలసిన కారణమూ వుంది. మీ రచనలంటే నాకు చాల ప్రీతి. అందువల్లనే ఇతర్లు మిమ్మల్ని నిందిస్తూ వుంటే నాకు చాల బాధగా వుంటుంది. ఇరుపక్షాల రచనలూ చాలజాగ్రతగా చదువుతున్నాను. ఇంతకూ వాళ్ళ కోపకారణం ఏమిటో నాకు బోధపడటం లేదు. మీ రైనా ఏమి చెప్పదలచుకున్నారో అదీ నాకు దురవగాహంగానే వుంది. వాదప్రతివాదాలు నిజానికిఒక ఉచ్ఛస్థాయికి సంబంధించే వున్నాయి. అందుకు సందేహం లేదు. కాని అసలు విషయం ఏమిటో నాకు బోధపడటం లేదు. నాది చాలమంద బుద్ధి. అందుచేత

ప్రతి విషయమూ గట్టిగా తెలుసుకోవాలని కోరతారు. అందుకే మిమ్మల్ని నేను కలుసుకోవాల్సివుంది. మిమ్మల్ని కలుసుకుంటే అన్ని విషయాలూ బాగా అర్థమౌతాయని నా ఉద్దేశం. శ్రీయుత యాదవేశ్వరపండిత మహాశయుని ఒకనాడు అడిగాను. ఆయన తెలియజెప్పారు. ఈ సారి వంతుమీది.

ఒకనాడు క్షీరోదబాబు (నాటకరచయిత) అన్నారు: వంగసాహిత్యంలో నేనొక రత్నాన్నట. దానికి కారణం ఏమిటీ అంటే నేను రాసే భాషే సరైందిట. కాని ఆయన 'సబుజపత్ర'లో భాషను పాడుపాడు చేశాడు. ఆయన భాష భాషే కాదు.

'సబుజపత్ర' లో భాషకూ, నేను వాడేభాషకూ తారతమ్యం ఎక్కడ వుందో తెలుసుకోలేపోతున్నాను. అది మీ దగ్గరనించి తెలుసుకోవాలి. నా రచన లేమన్నా మీరు చదివారో లేదో, తెలియదు. కాని చదివు వుంటే మాత్రం మీకు తెలుస్తుంది

పండిత మహాశయులా నాడు మరో మాట అన్నారు: వంగభాష సంస్కృత పరిపుష్టం కావాలిట. సంస్కృతం అంటే శ్రద్ధ ఎంతవరకు వుండాలో వారికి స్వయంగా తెలియదు. చాల మందికి తెలియదు. ఈ సమస్యకూడా మీ దగ్గర ఎంతవరకు పరిష్కారం ఔతుందో చూడాలి.

—శరత్.

## ౩౪

6. నీలకమలకుండ లైన్,

శివపురం, 31—6—16.

కొన్నాళ్ళక్రితం మీరు నాకొక పుస్తకం పంపించారు. పుస్తకాలు చదవటం నాకొక అలవాటై పోయింది. అది రాను రాను మహా చెడ్డ అలవాటుగా తయారైంది. పుస్తకం చదివినా చదవకపోయినా మీరు దాన్ని పంపినందుకు నేను స్వీకరిస్తూ ధన్యవాదం తెలుపాలి. అది సభ్యత కాని ఆ సంగతి కూడా నాకు జ్ఞాపకం వుండదు. ఈమాటలో కొంచెం అహంభావం ధ్వనిస్తూ ఉన్నా... అది సత్యమే. చివరకు ఇన్నాళ్ళ తరువాత మీ పుస్తకమే ఆ సభ్యతను నాకు జ్ఞాపకం చేసింది. ఇక ధన్యవాదాలు సమర్పించకుండా ఉండలేను, ఆదిలో ఒకసారి ఇప్పుడూ మరొకసారి చివరిలోనూ సమర్పిస్తాను.

నిన్నరాత్రి పుస్తకం చదవటం పూర్తిచేశాను. అందులోని కథలు చదివి చాల ఆనందించాను. ఈమధ్య ఎప్పుడూ కథలు చదివి అంతగా ఆనందించిన అవకాశంలేదు. దాన్ని ప్రశంసించాల్సివస్తే దానిలోని గుణగణాలు వివరించాల్సి వుంటుంది. ఆపుస్తకాన్ని గూర్చి సవిమర్శగా మీ అభిప్రాయం చెప్పవలసిందిగా మీ మిత్రులు కోరుతున్నారని మీరే నిన్న చెప్పారు. అందువల్లనే ఆపని మీరు చెయ్యాలి, నేను చెయ్యను. ఈ పుస్తకం అందరికీ బాగానే ఉన్నట్లు తోచవచ్చు. కాని రచనలో ఎంత ప్రౌఢత్వం ఉందో, ఎంతకళ ఉందో, అసలైన సౌందర్యం ఎక్కడవుందో, రసస్ఫూర్తి ఎక్కడ కనిపిస్తుందో... మొత్తంమీద దాన్ని రాయటం ఎంతకష్టమో — ఈ విషయాలన్ని స్వయంగా కలం పట్టి రాయగల రోగం

గలవాళ్ళకే తెలుస్తుంది. ఆ విషయం వదలిపెట్టేయండి. అసలు సమాచారం ఏమంటే... రవిబాబు రచనలు చదివిన తరువాత ఎంత ప్రయత్నించినా నేను, అలాగ రాయలేనని స్ఫురించింది. మీరు పంపిన కథల పుస్తకం చదివిన తర్వాత కూడా... ఎంత ప్రయత్నించినా నేనలా రాయలేననే తోచింది. ఈ విషయం సూచించేందుకే నేనీ వుత్తరం రాస్తున్నాను.

నిన్న సాయంత్రం మీ యింటినుంచి బయలుదేరి వస్తూ 'భారతవర్ష' కార్యాలయానికి పోయి 'సోమనాథ్‌కీ కహానీ' అక్కడే చదివాను జలధరబాబు ఇంకా కొంతమంది దాని మీద సమాలోచనకు దిగారు. అప్పుడు నా అభిప్రాయాన్ని నేనూ చెప్పాను. స్వయంగా రచయితలైనవారు దాన్ని తప్పకుండా చదవాలి శైలి నిర్దుష్టంగా వుంది. కథా సంవిధానం సహజంగా వుంది ప్రతి ఘట్టంలో రస పరిపాకం కనిపిస్తూంది. పాత్రల మనోభావాలు ప్రస్ఫుటంగా అభివ్యక్తమౌతున్నాయి. దానిలో స్వయంగా లేఖకులైనవారికి గ్రాహ్యమయ్యే విషయ సామగ్రి చాల వుంది. సాధారణ పాఠకుల కింతగా గ్రాహ్యం కాకపో వచ్చు కాని వాళ్ళకు బాగా వున్నట్లు తోస్తుంది. గ్రంథరచయితలకు మాత్రం బాగుండటమే కాదు; వుపయుక్తంగా కూడా ఔతుంది.

ఇక్కడ మీకో సంగతి చెప్పాలి, ఇంత గొప్పగా రాగలుగుతున్నారని... నా మనసులో ఏ మాత్రమో ఈర్ష్య వుండక పోదు: మీకు నేను కోపంతో ఉత్తరాలు పంపుతున్నానని భావించకు. ఈ మాట ఎందుకు చెపుతున్నానంటే ... 'సాంధ్యారీ'ని పురస్కరించుకుని మీకు అనేకముంది ప్రశంసలు,

పొగడ్తలు అందియుండవచ్చు అందులో చాలవరకు ఇచ్చకాలు గానే మీకు తోచియుండవచ్చు. నాకైతే అలాగే తోస్తాయి సుమీ! ఈ పుస్తకం సాధారణ పాఠకుల కోసం మాత్రం కాదని నేను నిశ్చయంగా చెప్పగలను. మామూలు ప్రజలర్థం చేసుకోలేరు కనుక; 'నువ్వు రవిబాబు కవిత్వంలోని అర్థం ప్రబోధించగలవు' అన్నారు కదా ఆనాడొక పండితుడు ఈ పుస్తకాన్ని చూస్తే ప్రసంగిస్తూ. మామూలు ప్రజలు అర్థం చేసుకోలేరని చెప్పాను. మీరు వేదాంతశాస్త్రంలో పెద్దపండితులే అయినప్పటికీ కావ్యాన్ని అర్థం చేసుకోలేక పోవచ్చు. అదీగాక ఒకరు రాసిన కవిత్వం ప్రతివారికీ అర్థమై తీరవలసిందేనన్న నిబంధన ఏమీ లేదు. రవిబాబు రచించిన 'క్షేమదిషా' చదివి... 'ఇటువంటి అశ్లీలమైన కవిత్వం నేనిదివరకెప్పుడూ చదవలేదు' అంటూ వ్యాఖ్యానించారు గురుదాసుబాబు. సర్ గురుదాస్ గారి ముఖతః వచ్చినమాట కాబట్టి దాన్ని నమ్మాల్సిందేనా? నమ్మకపోవటం ఘోరమైన అపరాధం ఔతుందా?

ఇంగ్లీషులో (*art to hide art*) అనే సూత్రం ఉంది. అంటే... కళను ప్రచ్ఛన్నం చేయటమే కళ. దీని అర్థం తెలియని వాళ్ళకు వాస్తవికమైన సౌందర్యంలో సౌందర్యమే కనిపించదు. మార్వాడీలు ఇల్లు కట్టిస్తారు; ఆ తర్వాత డబ్బు ఖర్చుపెట్టి గోడలనిండా రకరకాల నగిషీలు చెక్కిస్తారు.

పాఠకుల బుద్ధి కుశలత, సంస్కృతి (*Calture*) ఒక స్థాయికి రానంతవరకూ ఈ పుస్తకాన్ని అర్థం చేసుకోలేరు. ఈమాట నేను అనాలని గుర్తించుకొని అన్నమాట కాదు. వారొకసారి కలిసినప్పుడు ఇంకా దీన్నిగురించి మాటాడు

కుందాం. మీకు వెయ్యి ధన్యవాదాలిచ్చి ఇక సెలవుపుచ్చుకుంటాను.

—శరత్.

## 3౫

శివపురం, 2-10-16.

ఇవాళ ఇప్పుడే మీ ఉత్తరం చేరింది. ఇదివరకే మీకొక ఉత్తరం రాసిపంపించాను. నేటివరకు పోస్టు చేయలేను. మీరేమన్నా అనుకుంటారేమోనని ఇవాళే పోస్టు చేశాను. ఒకనాడు వచ్చి కలుసుకుంటాను.

—శరత్.

## 3౬

4, నీలకమలకుండు లైన్,
బాజే - శివపురం, హౌవడా
11-10-1916.

మీ ఉత్తరం వచ్చి ఎన్నాళ్ళో అయినా ఇంతవరకూ జవాబు రాయలేకపోయినందుకు సిగ్గుపడుతున్నాను. మీ యింటికికూడా ఒకసారి రాలేకపోయాను. అందుకుకూడా మీరు మనసులో బాధపడుతూ ఉండవచ్చు. ఎల్లుండి గురువారం నాడు సాయంత్రం మీరు ఇంట్లోనే ఉండేట్లయితే నేనొకసారి వస్తాను. గొప్పవారింటికి వెళ్ళటమంటే నాకు సంకోచంగా, సిగ్గుగా ఉంటుంది; అందువల్ల తరచు రాను.

ఆ సంకోచం నన్నావరించకపోతే ఎల్లుండి తప్పకుండా వస్తాను. ఒకవేళ రాకపోయినట్టయితే... ఎందుకురాలేదో కారణం చెప్పనక్కర్లేదు. ఆ విషయం అలా ఉంచండి.

మీరా యీ పుస్తకంమీద రాయబడిన విమర్శ పత్రికా సంపాదకులకు నచ్చకపోవటానికి కారణం... అది అధిక ప్రశంసాత్మకంగా వుండివుండటంగా నాకు అనుకుంటాను. మీకు తెలుసుకదా: నేటి మన పత్రికా సంపాదకులు ముందు 'పేరు' చూస్తారు. రచనలోని బుద్ధి కుశలతను పరీక్షించరు. ఒక వేళ ఆ విమర్శ నేనే రాసి ప్రచురిస్తుంటే అది బాగుండదు... ఎందువల్లనంటే ఆ పుస్తకంలోని విషయం నా శక్తికి మించింది.. కాని క్రింద నా పేరు ఉండటంలో దానికి ఏ పత్రికలోనైనా స్థానం లభించి తీరుతుంది. కాబట్టి వచ్చేనెలలో నేనే విమర్శ రాసి 'భారతవర్ష'కు గాని 'ప్రవాసి'కి గాని పంపుదామనుకుంటున్నాను. కాని అది ఉత్కృష్ట భారతీయ కళాఖండంగా లేక నా భయం నా విమర్శ మీకు ఆహ్లాదం కలిగించక పోవచ్చు. మీరు అభయం ఇస్తే రాస్తాను.

మీ 'బడే బాబుక్ బడే దిన్'ను శ్రీయుత పాంచకడీ దేవ్ 'మున్సిమానా' అని వర్ణించారు. నిజమే అయినా అది నాకు నచ్చలేదు మీ విమర్శనాశక్తులు వేరుకావచ్చు. నా యీ మతభేదానికి కారణం మీరు ఊహించుకోగలరనుకుంటాను. ఒక పాత్రను మర్కట ప్రాయంగా సృష్టించి చూపటంలో మీ ప్రజ్ఞ అసాధారణం అని ఆయన మీతో చెప్పి వుండవచ్చు. కర్ణ గర్వవాక్య ధోరణి మాంపుకారా, ఒక పాత్రను వ్యక్తినిగా ప్రదర్శించి పాఠకులను నవ్వించటంలో మీరు సారంగమస్తే. కాని నిజంలో ఈ ప్రజ్ఞకన్నా మనిషిని మనిషిగా చూపించగల ప్రజ్ఞే అధికంగా ఉందని నేను గ్రహించాను. గంభీర ప్రకృతి గల సాహిత్య సాధనా [illegible] సాంతరస్థాలు

చెప్పకొంటూన్నప్పుడు కూడా ఒకరకమైన స్త్రీ లక్ష్యభావమే కనిపిస్తూ ఉంటుంది, సొంత కష్టాలు చెప్పకుంటున్నట్టుగా ఉండను. ఇతర్ల దుఃఖగాథ ఏదో చెబుతున్నట్టుగా ఉంటుంది. ఆ చెబుతున్న విషయంలో తనకేమీ సంబంధం లేనట్టుగా చెబుతూ ఉంటారు. మీరూ అన్నం ఇలాగే చెబుతారు. వెదకి చూచినా కథల్లో కి ఎక్కడా కనిపించదు కాని జీవితంలో సంభవిస్తూ ఉండే అనేక విషాదసంఘటనలు పాఠక హృదయాల్ని కలవరపెడుతూ ఉంటాయి మీ రచనలో ఉన్న యీ సహజము, శాంతము, చిరాభ్యాసము అయినశైలి నన్ను ముగ్ధపరచింది. కనుకనే ఇదివరకొకసారి మీకు రాశాను. 'చాంయార్' కథలు అర్ధం చేసువాలంటే పాఠకుల బుద్ధికి లత సంస్కృతి ఒక స్థాయిని చేరివుండాలి అని లేకపోతే అందులోని సౌందర్యం అంతా వాళ్ళకు నిరర్థకమే అయి పోతుంది,

ఒకపాత్రను పరిహాసాస్పదంగా సృష్టించేటప్పుడు రచయిత ఔదాసీన్యం మొదటినుంచి చివరిదాకా వ్యక్తమౌతూ ఉండటం అసంభవం. అక్కడక్కడ దానికి భంగం కలుగుతూ ఉంటుంది. బహుశః అందువల్లనే నాకు 'బడాదిన్' నచ్చలేదనుకుంటాను. అందులోని హాస్యరసం నాకు బోధపడలేదు.

నేను దాన్ని సరిగా అర్థం చేసుకోలేక పోయానేమో కూడాను. అంతేకావచ్చు కాబట్టి నాకు నచ్చటం, నచ్చక పోవటంలో పెద్ద విలువేమీ లేదు ఇంతసేపు అనవసరంగా అర్థంలేని చర్చ చేశానేమో అనిపిస్తోంది నాకు అలా చర్చించే అధికారం లేదు, నన్ను క్షమించండి. ఈ అనధికార చర్చ

సమయంగా కూడా చేశానుకాదు. నేను సరిగా చదువుకున్నవాణ్ణికాదు, ఇంగ్లీషు బాగా రాని కారణంవల్ల మీ రచనలోని మంచిచెడ్డలు ఓపిగ్గా పరిశీలించలేక పోయానేమో! ఆ ఓపిక సుశిక్షితులకే ఉంటుంది. గొప్పగొప్పవారి పెద్దపెద్ద విమర్శనలను చదవకపోయినా సాధారణ ప్రపంచ జ్ఞానంతో విషయాన్ని అర్థం చేసుకోలేకపోరు, కాని ప్రత్యక్ష అనుభవం లేని విషయాల్లోకి మాత్రం బుద్ధిచొరదు బైటకెళ్ళని మూసి వున్నదే; తలుపు మూసివున్న సంగతికూడా విస్మృతిలో పడిపోతుంది. శబ్దాలు అర్థమైనంత మాత్రాన అంతా అర్థమైనట్లుగానే భావిస్తారు. అందువల్లనే వంగభాషలో మంచి విమర్శనా గ్రంథాలు లేవనీ, విమర్శనారీతులు తెలుసుకునే బలంకూడా వంగీయులకు లేదనీ ఆంగ్లభాషావేత్తలు, అంటున్నారు. క్రమబద్ధంగా ఎక్కడైనా శిష్యత్వం చేసి నేర్చుకోవాలనే అనుకోము. నాకు నేర్చుకోవాలనే ఉంది. అందుకనే ఇన్ని సంగతులు రాశాను. ఈసంగతులన్నీ నేను విద్వాంసులద్వారా విన్నాను. కాని నాకు నచ్చటం, నచ్చకపోవటంలో విలువ ఏమీ లేదు. ఇలాంటి విమర్శనే రాసి పంపించదలచాను. పంపిస్తే ప్రచురణ ఔతుంది; ఇందుకు మీ అనుమతికూడా అడగవలసిన అవసరం లేదనుకున్నాను. ఇంతకూ మీరచనలపట్ల నాకు అత్యంతశ్రద్ధ ఉండబట్టే ఇలా కొంతవరకు నా అనౌచిత్యాన్ని వెల్లడించి మీ అభిప్రాయాన్ని తెలుసుకోగోరుతున్నాను. మీరేమీ కష్టమనుకోకుండా ఉంటే ఈ చెప్పిన విషయాలతో ముగించేస్తాను — మీ రచనలపట్ల నాకున్న శ్రద్ధ గమనిస్తారుగాక!

—శరత్.

బాజే–శివపురం, 11-7-1919.

శ్రీమతి లీలారాణి గంగోపాధ్యాయ్‌కు !

శుభమస్తు! నీ ఉత్తరం, 'మిలన్' చేరాయి. మొదటి నుంచి చివరదాకా చదివాను; నా పుస్తకం నీకు నచ్చిందని రాశావు. రచయితకు అంతకన్నా మించిన పురస్కారం మరేం కావాలి ?

నా యెడల భక్తి ప్రకటించావు. వినయం లేనిచోట భక్తి మంచి వస్తువే, వుండాల్సిందే. కాని ఎవరియెడల భక్తి చూపుతున్నామో — అని కూడా ఆలోచించుకోవటం అవసరం.

నీతో నాకు పరిచయం లేదు. కాబట్టి అధికంగా ప్రశ్నించటం బాగుండదు కాని ఒక్క ప్రశ్న అడగాలని పిస్తోంది. నువు బ్రహ్మసమాజానికి చెందిన దానివికావు కదా! వితంతు వివాహం (కథలో) చేయించాలని ఎందుకు కోరుతున్నావు?

ఇది తాత్కాలికంగా వుద్భవించిన భావావేశమా? లేక హేము, గుణి వీరిద్దరి పరిస్థితులూ చూచి కరుణ వుత్పన్నమైందా? (హేము, గుణి నవలలోని పాత్రలు) అదే అయితే, 'మిలన్' (సమ్మేళనం) పొందటంతో చిత్తం ప్రసన్న మయేట్లయితే... ఇట్టి సమ్మేళనకు ఒక విశేషమూల్యం వున్నట్టు నేను భావించ లేను.

నీ రచనలోని మంచిచెడ్డల విచారణ ద్వారా దాని విలువ కట్టటం ఈ చిన్న ఉత్తరంలో సాధ్యంగాని పని.

నువు నా పుస్తకాలన్నీ చదివావో లేదో నా కైతే తెలియదు. ఒక వేళ చదివి యున్నట్లయితే...మన సమాజంలో

అనేక మంచిమంచి జీవితాలు... కేవలం వితంతు వివాహాలు జరక్కపోవటం వల్లనే ... శాశ్వతంగా వ్యర్థములు, నిష్ఫలములు అయిపోతున్నాయని నీకు అవగతమై వుంటుంది. ఇంతకన్నా నీ విషయంలో అధికంగా నేను చెప్పేది లేదు.

—శరత్.

౩౮

బాజే - శివపురం, హావడా

26-7-1919.

శుభమస్తు! నీ ఉత్తరం చేరింది. నాకు ఉత్తరం రాసి, జవాబుకోసం ఎదురు చూడ్డం దురాశేనంటివి. నా యీ చక్కని అలవాటును గురించి నువ్వేమనుకుంటున్నావో నని ఆలోచిస్తున్నాను. నిజంగా నా దగ్గరనించి జవాబు పొందటం చాల కష్టం. నేను చెడ్డ సోమరిని. అది పరమ సత్యం.

అయినా ఇంతవరకు నీకు రెండు ఉత్తరాలు రాశాను. ఎలా రాశానా అని నాకు నేనే ఆలోచించుకున్నాను. నువ్వు నా పట్ల చూపించిన భక్తే అసంభవాన్ని సంభవం చేసింది. నిజానికి ఆ వస్తువు మనిషిచేత ఎంత విచిత్రమైన పనైనా చేయిస్తుంది. నన్ను తన అన్నలాగా ఆదరిస్తున్న వ్యక్తికే జాబు రాస్తున్నాను; అన్నభావంలో ఎంత గర్వం ప్రచ్ఛన్నమై వుంది.

నీకు నేనేమీ బోధించింది లేదు. నిన్నెప్పుడూ నేను చూడేలేదు. ఎవరి బిడ్డవో, ఎవరి కోడలివో నాకేమీ తెలియదు. అయినా నువ్వు నా చెల్లెలివని చెప్పుకుంటున్నావు. ఇటువంటి మహాభాగ్యం ఎవరికో, ఎప్పుడో లభిస్తూ వుంటుంది. అలా లభించినవానికి ఒక రకమైన సమ్మోదం ఆవహిస్తుంది.

నువు నన్ను ఎప్పుడూ ఎరక్కపోయినా, హిందువుల యింటికోడలివై నిన్నుకొంచంగా నాకు వృత్తాంతం రాస్తున్నావు. ఈ పని అందరూ చేయలేరు నేనుకూడా నిన్నుకొంచంగానే జవాబులు రాస్తున్నాను; ఏవేవో ప్రశ్న లడుగుతున్నాను. అయినా నీకు నా మీద ఏ విధమైన దురభిప్రాయం లేక పోవటం వల్లనే నువు ఉత్తరాలు రాయగలుగుతున్నావు. వుంటే రాయజాలవు నా మీద ఏ కొంచెం విశ్వాసం ప్రీతి వుండాలి. లేకపోతే నే నిన్ని పుస్తకాలు రాసిన ప్రయోజనం ఏమిటి?

బాగుంది నా చెల్లెలులాగా నీకు ఇష్టమైనప్పుడల్లా ఉత్తరాలు రాస్తూవుండు. నాకు నిజమైన శిష్యురాలు, సహోదరి మరొకర్తె వుంది. ఆమె పేరు నిరుపమాదేవి. నేటి సాహిత్యలోకంలో పేరుగాంచిన వ్యక్తి. నువు ఎరిగే వుంటావు. 'దీది' 'అన్నపూర్ణా మందిర్', 'విధిలిపి' మొదలైనవన్నీ ఆమె రాసిన గ్రంథాలే—ఆమె మొదట పదహారేళ్ళ వయసులో భర్తను కోల్పోయి విచారగ్రస్త అయింది. వితంతువు కావటం స్త్రీకి ఒక మహావిపత్తు అనిగాని, ముత్తయిదువుగా వుండటమే స్త్రీ జీవితానికి సఫలత అనిగాని అనుకోకూడదు. ఆ రెండు అబద్ధాలే' అని నే నామెకు చాలాసార్లు బోధించాను. ఆ తరువాత ఆమె చిత్తాన్ని సారస్వతం వైపు మరలించుకుంది. ఆమె రాసిన రచనలను చాలవాటిని సరిదిద్ది పెట్టాను. రచనా విధానం నేను పట్టుపట్టి నేర్పాను. ఇవాళ ఆమె వ్యక్తిత్వం నిలబెట్టుకోగలిగింది. కేవలం స్త్రీ కావటం వల్ల కాదు. అది నాకు చాల గర్వకారణమైన విషయం.

భర్త అంటే ఏమిటో తెలియని దశలోనే, భర్త గతించిన బాల వితంతువు తిరిగి పెళ్ళి చేసుకుంటే తప్పేమిటి? అని అడిగావు. నీ నోట వచ్చిన ఆ ప్రశ్నకు చాల విలువ వుంది. నా గ్రంథాల్లో ఏ ఒక్క బాల వితంతువు పట్లనైనా నీకు కనికరం ఉత్పన్నమై వుంటే నా రచనలకు పురస్కారం లభించినట్లే.

ఇక నవ రచనల విషయమై ఒకమాట చెబుతాను: ఈనాడు వంగభాషలో నవలలు అసంఖ్యాకంగా వస్తున్నాయి. వాటిల్లో నాకు రెండు అంశాలు కనిపిస్తున్నాయి. మొదటిది: పురుషుల రచనలు నిస్సారంగా వుంటున్నాయి. చదవటానికి యోగ్యంగా లేవు; పైగా వారి రచనలు పదిహేను అణాల వంతు దొంగిలించిన భావాలే. అందుకు వాళ్ళు సిగ్గు పడరు కామాలు! పుస్తకాలు అమ్ముడుపోతే చాలు వాళ్ళకు.

రెండవది: స్త్రీల రచనలు మాత్రం ఎలాగున్నా ఇతర చోట్లనించి దొంగిలించి తెచ్చిన సరుకు మాత్రం కాదు. తమ సంకుచిత పరిసరాల్లోనించి... తాము చూచింది, తమ జీవితంలో యథార్థంగా తమకు అనుభవంలోకి వచ్చిన దాన్ని కథా వస్తువుగా తీసుకుని తమ కల్పనాశక్తి తోడుగా ఏదో రాయటానికి ప్రయత్నం చేశారు. అందుచేత వారి రచనలలో కృత్రిమపు పోకళ్ళు చాల తక్కువ.

నీ రచనలలో నువ్వు చూపిన సత్సాహసము, రచనా సారళ్యం నన్ను ముగ్ధపరిచాయి. రచన అంత బాగ లేకపోయినప్పటికీ కృత్రిమత్వం లేకపోవటంచేత మొత్తం మీద సుందరంగానే వుంది. మిగతా భాగాన్ని నా చేత రాయించి, నా

సమయాన్ని వృథా చెయ్యకు. నువ్వే స్వతంత్రంగా పుస్తకం పూర్తి చెయ్యి. నీకు నా ఆశీర్వాదాలు. నువ్వు ఎవరికీ లొంగి పడేదానివి కావు.

ఒక వుపదేశ వాక్యం చెబుతాను. స్త్రీకి భర్త పరమ పూజనీయుడైన వ్యక్తి కి అందర్నీ మించిన గురుతుల్యుడు, అని అర్థం చేసుకోకూడదు. ఈ రకమైన భావం స్త్రీని చిన్న పరుస్తుంది; ఆమెను ఒక తుచ్ఛ వస్తువుగా తయారు చేసేస్తుంది.

నువ్వు ఎప్పుడు ఏ పుస్తకం రాద్దామని ఆరంభించినా ఈ అంశాన్ని మాత్రం బాగా జ్ఞాపకం వుంచుకో. పతికి విరుద్ధంగా ఏ విధమైన భావమూ మనస్సులోనికి రానీయకూడదు; కాని భర్త అనేవాడు కూడా మనిషే. మనిషికి భగవంతుడని పూజించినందువల్ల ఫలితం లేదు. పూజించే వారూ, పూజింపబడేవారు కూడా చిన్నతనం పొందవలసి వుంటుంది.

ఒక్క ప్రశ్న అడుగుతాను; "భర్తను చూడని ఎరగని బాల వితంతు ..."

కాని భర్తను ఒకసారి చూచిన, ఎరిగిన...అంటే పది పదిహేను సంవత్సరాల యీడులో వితంతువైన యువతికి తన సుదీర్ఘ భవిష్యత్ జీవితంలో ఎవరినైనా ప్రేమించటానికిగాని, పెండ్లి చేసుకోటానికి గాని అధికారం లేదా? ఎందుకు లేదు? కొంచెం ఆలోచించి చూస్తే ఇందులో దాగి వున్న సంస్కారం ఇదే: "స్త్రీ పురుషుని వస్తువు. స్త్రీకి స్వతంత్ర వ్యక్తిత్వం లేదు" అని.

"హేమ సంశయయాత్మకంగా రోజులు గడుపుతోంది. ధైర్యంలేని వ్యక్తికి బంధనమే మంచిది కాదా!"

ఈ ప్రశ్న యొక్క అంతిమ పరిష్కారం అయినప్పుడు అంటే వివాహమే స్త్రీకి సర్వోత్కృష్టమైన శ్రేయస్సు అని నిర్ణయించినప్పుడు... బంధనమే మంచిది ఔతుంది.

నే నెక్కడా కథల్లో విధంతు వివాహం చేయించ లేదు. ఈ సంగతి నీకు చిత్రంగా వుండచ్చు. అందుకు సమాధానం ఏమంటే... ప్రపంచంలో చాల చిత్రాలు వుంటాయి, ఎంత ప్రయత్నించినా వాటి కారణం గోచరం కాదు.

నీకు నా ఆశీస్సులు.

—శరత్.

## 38

బాజే - శివపూర్, హొవడా

5 ఆగస్టు 1919.

శుభమస్తు! నువ్వు పంపిన 'కాపీ'... ఇంకా ఇతర రచనలూ చేరాయి. నేను వెంట వెంట ఉత్తరాలు రాస్తున్నందుకు నువ్వు లోలోపల సంతోషిస్తున్నావు కదూ! ఈసారి నీకు చాల విషయాలు రాయాల్సిన అవసరం కనిపిస్తోంది. కాని నీకుమల్లే నేను ఉత్తరాలు క్రమబద్ధంగా రాయలేను సుమా! నా ఉత్తరాలన్నీ విశృంఖలంగా, చిన్నపిల్లలు రాసినట్టు ఉంటాయనీ... చివరవరకూ చదివేదాకా ఓపిక పట్టటం కష్టమనీ... ఎలాగో చివరవరకూ చదివినా అర్థం మనసుకు పట్టేసరికి వొళ్ళంతా చెమటపట్టి పోతుందనీ నా మిత్రులంతా చెబుతూ ఉంటారు. ఒకరకంగా ఆమాట నిజమే, నేను

కాదనలేను అటువంటి ఉత్తరం నమూనాలు నీకూ చూపించకుండా ఉండలేను. ఆసంగతి నీ యిష్ట మిత్రులతో నువ్వు రహస్యంగా చెప్పియుండవచ్చు. అయినా నాకేం కోపం లేదు.

నేను చాలమంది బ్రాహ్మగృహిణులను ఎరుగుదును. వాళ్ళు నన్నొకమిత్రునిగా పాటించి సిస్సంకోచంగా ఉత్తర ప్రత్యుత్తరాలు రాస్తూ ఉంటారు. కాని మన సమాజంలో సొంత చెల్లెలకైనాసరే ఉత్తరం రాయటానికి సంకోచంగానే ఉంటుంది. ఆమె సంరక్షకులు ఏమనుకుంటారో, భర్త ఏమి అనుమానపడతాడో తద్వారా ఆమెకేమీ దుఃఖం కలుగుతుందో అని జంకుగా ఉంటుంది. మన సంఘనియమాలు, న్యాయం అలా ఉన్నాయి స్త్రీలవిషయంలో నాకున్న అనుభవాన్నిబట్టి... నీ ఉత్తరాల్ని చదివినమీదట... సాధారణంగా స్త్రీలకు ఆత్మమర్యాద అనేది ఉత్పన్నమయ్యే వయసులో ఉండే నువ్వు రాస్తున్నావని నేను భావిస్తున్నాను. అందుకనే నీకు ఇన్నివిషయాలు రాద్దామని ఆరంభించాను. ఆ గాంభీర్యం, ఆత్మసంయమనం ఇరవై అయిదేళ్ళలోపుగా స్త్రీకి ఏర్పడవు. ఒకవేళ నీ విషయంలో నా అంచనా తప్పిపోవచ్చు. తప్పిపోకుండా ఉంటేనే నాకు నిశ్చింతగా ఉంటుంది. ఎందువల్లనంటే... ఆ వయః పరిమితిని నువ్వు దాటినప్పుడే ... తరుణ వయస్కురాలైన ఒక యువతికి ఉత్తరంరాయటమంటే ఎందుకు సంకోచం కలుగుతుందో నీకు తేలిగా తెలుస్తుంది. కాని అన్నిటికన్నా గొప్పసంగతి ఏమిటంటే... నువ్వు నన్ను అన్నా అని పిలుస్తున్నావు. అన్నముందు చెల్లెలు సిగ్గుపడాల్సిన అవసరం ఏమీ లేదు. ఏది రాయదలచుకుంటే అదే రాయి; ఎంత

తలచుకుంటే అంతేరాయి. అన్నమీద ఎంత అత్యాచారం అయినా చెయ్యి. ఎంతైనా చెయ్యి—ఎంతైనా వేధించు—నాకు సంతోషమే.

నువ్వు ఉత్తరం రాసే తీరూ అదీ చూస్తోంటే నాకు నిరుపమాదేవి జ్ఞాపకం వస్తుంది. మీ యిద్దరి రచనావిధానం ఒకటే.

నాలుగురోజులనించీ జ్వరంగా ఉంటోంది. దాహం ఎక్కువగా ఉంటోంది. ఎక్కడికీ కదలటం లేదు — అందుచేత నువ్వు పంపినకాపీ తదేకంగా చదివాను. చదువుతూంటే నా కెలా అనిపించిందో తెలుసా? విలువైన వస్తువులు గల దుకాణంలో కొన్ని వస్తువులు చెల్లాచెదరుగా, నిరాదరణగా పడి వుండటం చూచినప్పుడు ... వాటి విలువ తెలిసిన వాడి మనస్సు కెంత కష్టంగా ఉంటుందో నాకూ అలాగే అనిపించింది. ఇలాంటి దశలోనే నిరుపమా దేవి రచనలుకూడా ఒకప్పుడు నా చేతిలో పడ్డాయి.

చెల్లీ! నీవద్ద మంచి విలువైన సరుకులే ఉన్నాయి; అయితే చెల్లాచెదురుగా ఉన్నాయి. నా వృత్తికూడా అదే కాబట్టి దగ్గరఉండి నీచేత రాయిద్దామనిపిస్తూ ఉంటుంది. నిరుపమాదేవికి అలాగే తర్ఫీదు ఇచ్చాను. నీ విషయంలో కూడా అలా చేశానంటే త్వరలోనే మొక్క పెరిగివచ్చి, విస్తరించి, శాఖలన్నీ వికసించిన పూగుత్తులతో నిండిపోతాయి. త్వరలోనే 'దీదీ'లాంటి ఒక ఉత్తమరచన లోకులకు చేకూరుతుంది. కాని అలా జరిగే అవకాశం కనిపించటం లేదు. అందుకు విచారించి లాభంలేదు. అందుకు చింతించి లాభంలేదు.

ఇలాగే కోట్లకొలంది బుద్ధిమంతులు కావలసిన శిక్షణ లభించక మగ్గిపోతున్నారు. వాళ్ళ సంగతి ఆలోచించే దెవరు? ఏదో చెత్త తయారు చేసేవాళ్ళు, గ్రంథకర్తృత్వంతో బ్రతికేవాళ్ళూ తమ చేపల బుట్టలవంటి రచనలతో వంగ సాహిత్యాన్ని కళంకితం చేస్తున్నారు. జీవితంలో వాస్తవిక తత్వాన్ని అనుభవించని వారు. ప్రేమస్వరూపాన్ని దర్శించనివారు మూల మూలల్లో ఒదిగే ఉన్నారు. దుఃఖాన్ని తప్తమై అనుభూతి పరిశుద్ధం కాకుండా, సత్యం అవగతం కాకుండా ఉన్న మహానుభావులే ఈనాడు సాహిత్య ప్రభువులై కూచున్నారు. అందుకనే నేటి పాండిత్యం నానాటికీ దిగజారుతూ ఉంది.

లీలా! హృదయానుభవంలోకి వచ్చిన ప్రతివిషయాన్నీ భాషలో వ్యక్తీకరించకూడదు. అన్ని సంగతులూ కొంచెమో, గొప్పో ఇతర్ల దగ్గర నేర్చుకోవాలి. నీకు నీవై నేర్చుకోలేవు. నేనేం చెయ్యను చెప్పమ్మా! నీకు తగిన శిక్షణయిచ్చి నిరుపమాదేవినిలాగ తయారు చెయ్యగలనుగాని, అందుకు అవకాశం ఏదీ నాకు? లేనిది విచారిస్తే ఏం లాభం?

ఏమైనాగాని ఒక ఉపదేశవాక్యం చెబుతాను. మొదట రాయదలచుకున్నదంతా అధ్యాయాలుగా విభజించుకోవాలి. పక్షాలుగాని వంతు రచయిత తనకు తానై, చెప్పకూడదు. పాత్రద్వారానే చెప్పిస్తూ ఉండాలి. అలా చెప్పించటానికి అవకాశం లేని ఘట్టాల్లోనే రచయిత తానై చెప్పే వాక్యాల్ని పాఠకుడు ఓపిక సడలకుండా వింటాడు. మరో విషయాన్ని తీసుకుని నిన్నూ, పాఠకులనూ దుఃఖపెట్టకూడదు. చాల విషయాలు పాఠకుల ఊహకు విడిచిపెట్టేస్తూ వుండాలి. కాని రచ

యిత కొంత చెప్పటం, మిగిలింది పాఠకుడు ఊహించుకోగల గటం...ఇది శిక్షణ వల్ల, బుద్ధి చాకచక్యం వల్ల సాధ్యం ఔతుంది.

ఇవాళనించీ నీకు శిక్షణ ఆరంభిస్తున్నాను. అధ్యాయాలు విభజించుకుని, నా పుస్తకాల్లో లాగ రాయటానికి ఆరంభించు. రెండు అధ్యాయాలు రాసి నాకు పంపించు, నా సామాన్య శక్తిని అనుసరించి కొట్టివేతలు పెట్టి పంపిస్తాను. కొట్టివేసిన చోట ఎందుకు కొట్టివేశానో రాస్తాను ఇంత పరిశ్రమ నేనెందుకు చేయదలచుకున్నానో తెలుసునా? నీ చేత సాహిత్యమందిరంలో పూజా సామాగ్రిని ఆయత్తం చేయించేందుకే. ఆ సామాగ్రి అల్పమూల్యం కలదిగా వుండరాదు. నేను సూచించిన పద్ధతిలో గల ప్రయోజనాన్ని గుర్తిస్తావను కుంటాను. ఏదో సభ్యతపాటించి నాలుగు ప్రశంసా వాక్యాలో ఇచ్ఛకాలో రాసి నాకూ నీకూకూడా సమయం వృధా చెయ్యటం నా కిష్టం లేదు.

ఒక్కమాట జ్ఞాపకం ఉంచుకో నా ఆశీర్వాద బలం వల్ల నువ్వు ఎవరికీ తీసిపోవు.

నీ కాపీ నాలుగైదు రోజుల్లో పంపిస్తాను. 'కాలో', కథను నా 'పరిణీత'లో లాగ అధ్యాయాలుగా విభజించి పంపలేవూ? చెల్లీ! మొదట చాల కష్టమనిపిస్తుంది. సహనం కోల్పోతే లాభంలేదు. ఇంత కష్టపడ్డ తర్వాతనే వస్తువుకు విలువ వస్తుంది. మొట్టమొదట, 'అనవసరంగా ఇంత పరిశ్రమ చేస్తున్నామే' అనిపిస్తుంది. కాని నిజానికి పరిశ్రమ అన్నేది వృధాపోదు. ఏదో ఒక రూపంలో ఫలవంతమే ఔతుంది. రాత్రి

చాల పోయింది. ఇక ఇంతటితో ఆపేస్తాను. ఇవాళకూడా కడుపుల్లో అన్నం పడలేదు. కాగా ఉత్తరం గడబిడగా రాశాను. చదువుకోటం కష్టం అనిపిస్తే... ఎక్కడైనా రాత విస్పష్టంగా లేకపోతే... మీ అన్నయ్యను కదూ...మన్నించు. నీకు నా ఆశీస్సులు. రాత్రి పన్నెండున్నర అయింది.

సర్వంగా తయారైన తర్వాత ఏదైనా మాసిక పత్రికలో ప్రచురణకు నేనే పంపిస్తే ఏ సంపాదకుడూ కాదనడు. యోగ్యంకాని రచనలు నేను పంపనని వారికి తెలుసు. ఇంటి పనులుంటాయి. కాబట్టి రాయటానికి నీకు సమయం ఎక్కువ దొరకదు. కాని మామూలుగా అవకాశం లేనప్పుడే సావకాశం అంటూ లభిస్తూ ఉంటుంది. అవకాశం ఉన్నప్పుడే ఏ పనికీ సావకాశం వుండదు.

—శరత్.

## ౪౦

బాజే-శివపురం,
24-8-16.

శుభమస్తు! నువురాసిన రెండువుత్తరాలూ... ఒకటి పెద్దది, ఒకటి చిన్నది...నిన్న వొకటి, ఇవాళ ఒకటి అందాయి. మొదట నా గొడవ కాస్త చెబుతాను. నేనెప్పుడూ అన్ని దరవాజాలూ, కిటికీలూ తెరచివుంచే ఇంట్లో నిద్రపోతూ ఉంటాను. తెల్లవారుఝామున నిద్రమెలకువ వచ్చి చూద్దును కదా పక్క, దిండు అన్నీ వర్షానికి పూర్తిగా తడిసిపోయాయి. నా వొళ్ళంతా చలిలో వొణికి పోతోంది. లోగడదినం సాయంత్రంకూడా ఇంటికి తడిసేవచ్చాను. ఈ రెండు కారణాల

వల్ల జ్వరం వచ్చేసింది. వెంటనే తగ్గలేదు జ్వరం రోజురోజుకూ ఎక్కువైంది. ఇప్పుడు తగ్గింది. మరొక సంగతి ఇంకా తమాషాగా ఉంటుంది చాలరోజులనించీ కుడి పెదాలుకు కొంచెం దిగువన దురదగా ఉంటోంది. నాలుగు రోజులక్రితం తెల్లవారి లేచేసరికి ఆభాగంలో ఎర్రగా 'ఎగ్జిమా'లాగ పొడ సూపింది. కొంచెం పోట్లుగా వుంది. నంజురోగం కూడా ఇలాగే ఆరంభమౌతుందని విన్నాను. కాని అదేమిటో ఇంతవరకూ విచారించి తెలుసుకోలేదు నంజురోగమే పట్టుకొంటుందనుకున్నాను, టించర్ అయోడిన్ తగిలించాను మాటిమాటికీ తగలించటంవల్ల దాని రూపం భయంకరంగా తయారైంది. ఈ నంజువ్యాధి కింద పరిణమిస్తేనే బాగుంటుందనిపించింది. డాక్టరువచ్చి దాన్ని బాగా కెప్పుపట్టేలాగు చూస్తాడు. నేను బాధ పడుతూంటే... "మీకు ఏ విషయంలోనూ కాస్తకూడా ఓర్పులేదు, పాడు రోగం. బోరిక్ ఆసిడ్. ఫోసిడ్ వేసి ఏమైనా చేసుకోండి. నేను వెళుతున్నాను" అన్నాడు. మరి కాసేపటికి కోపం చల్లారగా మందుపుచ్చుకోమనీ, మాలిష్ చేయిస్తూ ఉండమనీ సలహాయిచ్చి, రెండు కాళ్ళూ దిండుమీద పెట్టి కదలకుండా పడుకోమన్నాడు. ఏం చెయ్యమన్నావమ్మా మరి! పడుకొనే ఉన్నాను. ఇకపోతే మూడోవిషయం: నాకు కడుపులో ఆమ్లం పేరుకుంటూ ఉంటుంది. అదొక జబ్బు నేను కాబట్టి చాల తక్కువ భోజనం చేస్తూ ఉంటాను. కాని మొన్న యింట్లో ఏదో [illegible] [illegible] చేసి బలవంతాన తినిపించారు. సరిగా జీర్ణం కాలేదు. ఇప్పటికూడా పులితేపులు వస్తున్నాయి. ఈదేశంలోకెల్లా ప్రసిద్ధిచెందిన సోమరిపోతును నేను.

కొంతసేపైనా నమలవలసి వస్తుందని సాధారణంగా నేనేదీ నోట్లో వేసుకోను. ఇటువంటి నామీద ఇంత అత్యాచారం చేస్తుంటే ఎలా సహించేది చెప్పు. కాని ఇంట్లో వాళ్ళకేం తెలుస్తుంది. నేను సరిగ్గా తినకపోవటం వల్లనే చిక్కిపోతున్నానని, బాగా తినటం మొదలుపెట్టానంటే వాళ్ళలాగే బలిసిపోయి ఏనుగులా తయారౌతాననీ వాళ్ళు అభిప్రాయ పడుతున్నారు.

స్వర్గీయ గిరీశ్ బాబు 'అబూ హసన్'లో ఒకమాట రాశాడు— "స్త్రీలకు ఎక్కడా లేని వాపి. చచ్చిన తర్వాత కూడా తింటారు వాళ్లు' అని స్త్రీజాతి లక్షణాల తనకి బాగా తెలుసు కాబోలు !

ఇరవై సంవత్సరాలనించీ మేము ఈ తిండి విషయంలో నే లాటీలు విసుక్కుంటూ వచ్చాం. 'ఆయన అసలు భోజనమే చెయ్యటం లేదు— రోజురోజుకు చిక్కిపోతున్నారు. ఈ యిల్లూ, వాకిలి వంట ... ఇవన్నీ ఎందుకు నాకు! అన్నీ వొదిలేసి ఎక్కడికన్నా పోయి బైరాగుల్లో చేరిపోతాను..." ఇలా ఎన్ని మాటలనుకున్నావు? అందుకు నేను అంటాను కదా! "అరె, బైరాగుల్లో చేరాలనుకుంటే వెంటనే చేరుపోయి; నన్నెందుకిలా బెదిరించటం?" ... నిజానికి నా బాధ ఎవరూ గ్రహించలేరు. స్వర్గమంటూ ఒకటి ఉంటే... అక్కడ ఒకరు మరొకర్ని ఎక్కువగా భోజనం చెయ్యమని బలవంతం చేయటమే ఆచారమైతే అటువంటి స్వర్గం నాకక్కర్లేదు— నరకానికే పోతాను

మరొకసంగతి: ఇరవై రోజుల క్రితం వీధిలో కుక్కలు పోట్లాడుకుంటూంటే వెళ్ళగొడదామని పోయాను. ఇంతలో

ఒక గజ్జికుక్క వచ్చి నా అరచేతిలో దంతక్షతం చేసింది. ఆ దౌర్భాగ్యపు కుక్క ఎంత కృతఘ్నంగా ప్రవర్తించిందో చూశావు. దానిని మరో కుక్క బారినించి రక్షించేందుకు నేను పోతే అది చేసిన ఉపకారం ఇది. గాయం మానిందికాని నిన్నటి నించీ మళ్ళీ పోటుగా ఉంది.

ఇదన్నమాట ఇక్కడ నా ఆరోగ్య పరిస్థితులు. కాని ఒక్క సుఖకరమైన విషయం ఏమిటంటే... నేను వృద్ధుడినై నాను. ఇక ఏదో వంకతో అకర్మణ్యుడినై కాలక్షేపం చేస్తూ ఉండొచ్చు. అనేకరకాల దుఃఖాలతో, కష్టాలతో, ఆపదలతో 40 యేళ్లు బ్రతికాను. మా వంశంలో ఎవరూ నలభై ఏళ్ళకు మించి బ్రతుకలేదట. ఈ విషయంలో మాత్రం నేను మా తండ్రిని, తాతను ఓడించాను. ఇంకా కావల్సిందేమిటి ?

పోనీలే, ఈ ముసలివాని చావు బ్రతుకులను గురించి మీరేమీ ఉద్విగ్నచిత్తులు కానక్కర్లేదు. కాని చెల్లీ నీవూ సుస్తీగా ఉందని రాశావు. శరీరాన్ని కాపాడుకో – ఎక్కువ పరిశ్రమ చెయ్యకు – వొళ్ళు నయమై ఇంటికి వచ్చాక చూడొచ్చు. నీ రచనలన్నీ శ్రద్ధగా చదివాను. వాటిలో ఉండ వలసిన వన్నీ వున్నాయి. శిక్షణ ఒక్కటే తక్కువగా కని పిస్తోంది. సాహిత్యాన్ని సృష్టించగల నేర్పు ప్రజ్ఞ వుండా లమ్మా! కేవలం అనుభవాల్ని క్రోడీకరిస్తే చాలదు. కాని నాదీ అదే వృత్తి కాబట్టి త్వరలోనే నీకు అవసరమైన విషయా లన్నీ నేర్పుతాను.

ఎంత రాయాలో... ఏ అంశాల్ని విడిచిపెట్టెయ్యాలో–

"వశ్వే జాతా సబ్ సత్యనయ్
కవి తవ మన-భూమి రామేర్ జన్మస్థాన్
అయోధ్యార్ చేయే ఢేర్ సత్యజానే."

ఇంత సత్యమైన మాట మరొకటి లేదు. చెల్లీ ! అను భవంలోకి వచ్చిన సంఘటనలన్నీ చిత్రించకూడదు కొన్ని వున్నవి వున్నట్టుగా రాయాలి; కొన్ని సూచించి విడిచిపెట్టాలి. కొన్నింటిని పాఠకుల ముఖతః చెప్పించాలి. కేవలం వుత్తరాల ద్వారా... నీ రచనలలో మంచిచెడ్డలు చూపుతూ మాత్రమే నేను చేయవలసిన సాయమంతా చేయలేకపోవచ్చు. కాని తప్పకండా ప్రయత్నిస్తాను. ఈ శీతాకాలం గడిస్తే మీా దేశం లోనే పది పదిహేను రోజులు మీాకు దగ్గరగానే ఒక ఇల్లు తీసుకుని వుంటూ, కొంత పని సాయపడతాను. ఒకవేళ అప్పుడు కూడా... నావొంట జీర్ణించిన సోమరితనమే ఆవరించేటట్టయితే నేనేం చెయ్యలేను.

మహిళలు ! వాళ్ళకు శుభమస్తు ! వాళ్ళలో చాల మందితో నీకు పరిచయం చెయ్యటం లేదు. బాగా చదువు కున్న మహిళలు చాలమందే వున్నారు. వాళ్ళలో నలుగు రైదుగురికి తప్ప మిగతా వాళ్ళందరికీ నేనంటే భయమే. వాళ్ల అంతర్యం నాకు బాగా తెలుసునని వాళ్ళకు అనుమానమే. అందుకనే వాళ్ళకు నా యెదుట బోనులో వున్నట్టుగా వుంటుంది. వాళ్ళ వ్యవహారమంతా కృత్రిమంగానే వుంటుంది. సంకుచిత మైన మనుస్సులు వాళ్ళవి. అంత సంకుచితమైన మనస్సులు గల యువతులు వంగదేశంలోకెల్లా వాళ్ళే. నేను అస్పృశ్యత పాటించను. ఎవరు అన్నం వడ్డించినా తింటాను.

కాని...మహిళల చేతిమీదిగా ఇచ్చిన వస్తువేదీ తినను. బ్రాహ్మణ దంపతులకు పుట్టి, బ్రాహ్మణ యువకుని వివాహం చేసుకున్న యువతులు వడ్డిస్తేనే తింటాను. మన సమాజంలోని వాళ్ళే కావచ్చు. అయితే మాత్రం ఏం? సంకరజాతి వాళ్ళ చేతిమీదుగా ఏ వస్తువూ తినను. శరత్ బాబు పెద్ద పెద్ద ఆశయాలు వర్ణిస్తూ వుంటాడుగాని నిజానికి అతనికి చాల మూఢ విశ్వాసాలు వున్నాయి, అని చాలమంది అంటూ వుంటారు. నాకు మూఢవిశ్వాసాలేమీ లేవు. నాకు వాళ్ళంటే కోపం కాబట్టే వాళ్ళించ్చిందేమీ నేను ముట్టుకోను...మహిళలకు పుట్టిన ఆడపిల్లలు చాలవరకు వికారరూపం గలవాళ్ళే. సబ్బులు, పౌడర్లు, విలువగల దుస్తులు ఎంతగా వుపయోగిస్తే మాత్రం ఏం లాభం? కేవలం అయిదారుగురు కంటే దర్శనీయమైనం రూపంగల పిల్లలు నాకు కనిపించలేదు. బి. ఏ ప్యాసైనంతమాత్రాన వాళ్ళు మన ఆడపిల్లల కన్నా బుద్ధిమంతులని చెప్పటానికి వీల్లేదు.

స్త్రీలను నిందిస్తున్నానని నీకు నా మీద కోపం వస్తుందేమో! కాని నాకు హృదయాంతరాళంలో మీరంటే ఎంత ఆదరమో, గౌరవమో! నీకు తెలుసునా? కేవలం వాళ్ళ ఆడంబరం, ఎంతో చదువుకున్న వాళ్ళలాగ చలామణి అయ్యేందుకు వాళ్ళు పడే వుబలాటం, కుసంస్కారాలనించి బయట పడ్డామంటూ వాళ్ళుచూపే అహంభావం, వాళ్ళ మిడి మిడి జ్ఞానం చూస్తోంటే నాకు అసహ్యమనిపిస్తుంది, అంతే.

వాళ్ళ సమక్షంలో నువు పరిహాస పాత్ర మౌతావా? వాళ్ళలో ఒక అరడజన్ మందిని బండిలో ఎక్కించుకుని

కాన్పూర్ జైలుకి తీసుకుపోయి విడిచిపెట్టి వచ్చానంటే నాకు నచ్చినపని చేసినదానివౌతావు.

'అన్నయ్య మర్యాద?' నీకేం తెలుస్తుంది. నీ కెందూ అన్నయ్యలు లేరుకదా!

నీ భర్తగారి ఔదార్యాన్ని తెలుసుకుని నేను చాల సంతోషించాను. వారికి నా హృదయపూర్వకమైన ఆశీర్వాదాలు. కాని వారికి నేనొక్క సంగతి చెప్పాలి: నేను చిన్నప్పుడొకసారి ఆరు ఏడువందలు మంది కులత్యాగం చేసిన వంగదేశ స్త్రీల ఇతిహాసం సంగ్రహించాను. అందుకు చాల ధనం ఖర్చు అయింది కూడాను. కాని చివరకు నేనొక గుణపాఠం నేర్చుకోవలసి వచ్చింది. నాకు ఒక పెద్ద చెడ్డపేరు వచ్చేసింది. ఒక్క విషయం మాత్రం అనుభవంగా తేలిపోయింది. ఇలా కులత్యాగం చేసిన స్త్రీలలో నూటికి 70 మంది భర్తతో కాపురం చేస్తున్న వాళ్ళే. వితంతువులు చాల తక్కువమంది వున్నారు. మొగుడు బ్రతికివుంటేనేం? రాత్రింబవళ్ళు పహారా కాస్తూ వుంటేనేం? వితంతువైతే మాత్రం ఏం? అనేక కష్టాల మూలంగానే స్త్రీ తన ధర్మాన్ని కోల్పోవటానికైతే సిద్ధపడుతుంది. పరపురుషుని రూపాన్ని మోహించి కాదు. ఒక బీభత్స ప్రవృత్తికి లొంగిపోయి కాదు. అసలైన ధర్మాన్ని కోల్పోయి బయటికి పోయి మరేదో గొప్ప వస్తువును పొందుదామని కాదు. కేవలం తానున్న పరిస్థితులలో నించి విముక్తి పొందుదామన్న కోరికతోనే మరో దుఃఖాన్ని తలకెత్తుకుంటున్నది. ఈ విషయాలన్నీ నీ కర్థం కావేమో! నేను చెప్పటం కూడా ఉచితం కాదు. ఇంతకూ నువ్వు అవటం స్త్రీవి మాత్రమే

కాదు. నాకు చెల్లెలివి కూడాను. ప్రపంచంలో స్త్రీ) తుచ్ఛ వస్తువేమీ కాదు.

నువు పంపిన కథలో నిజం ఎంతో, కల్పన ఎంతో నాకు తెలియదు. కల్పనే అయితే నీ ప్రజ్ఞ మెచ్చుకోవలసిందే. రచనలో మితిమీరిన సాహసం కనిపిస్తోంది. అతడెవరు ? పవిత్రుని గురించి కొంచెం చెప్పాలి. అతన్ని నేను చాల కాలంనించీ యెరుగను. కాని పరిశుద్ధమైన ప్రవర్తన కలవాడనీ, మంచి కుర్రవాడనీ మాత్రం ఎరుగుదును. బహుశః నిన్ను అక్కా అని పిలుస్తుంటాడేమో. నీ కన్నా మూడు నాలుగు నెలలు చిన్న అయి వుండచ్చు. అతని వల్ల ఏ స్త్రీకీ, ఎటువంటి కష్టమూ కలగదు. అదీగాక నువు కూడా స్వచ్ఛమైన బంగారానివే కదా ! అతడు నీ చేతిలో సురక్షితుడని నా విశ్వాసం. అత డీ మధ్య ఒక ప్రచారం చేస్తున్నాడని విన్నాను. కొద్దిరోజుల్లోనే వంగ సాహిత్యంలో ఒక నూతన రచయిత్రి పొడ సూపుతుందనీ, ఆమె ఇప్పుడున్న రచయితల కేమాత్రమూ తీసిపోదనిస్నీ. నిన్న నొక వ్యక్తి వచ్చాడు నా వద్దకు 'మిలన్' అచ్చువేస్తానంటూ నేను ఇవ్వలేదు. పత్రికకు పనికిరాదని చెప్పి పంపేశాను. మనకిప్పుడు తొందరేం లేదు చాలమంది బాగుందని పొగుడుతారు, నాకు తెలుసు. కాని బాగుండలేదని విమర్శించే వాళ్ళు చాలమందే వుంటారు, అదికూడా నాకు తెలుసు నేను ఒక సంవత్సరం ఓపికపట్టి చూచి చివరకు ఒకమాస పత్రికకు ప్రచురణ యోగ్యమని పించినప్పుడు పంపిస్తాను.

నిన్ను శిష్యురాలుగా స్వీకరించటానికి అంగీకరించాను. కాని చెల్లీ ! చివరకు నన్ను అణగద్రొక్కే విద్యమాత్రం ప్రక

టించను సుమీ! నిరూపమాదేవి అలాగే చేసింది. ఇప్పుడామె నన్ను మించి పోయింది. నువ్వు అలాగే మించిపోవచ్చు. ప్రపంచంలో అనేక విచిత్రాలు సంభవిస్తూ వుంటాయి.

కాని నీకు జబ్బు నయం అయిందనీ, పూర్తిగా ఆరోగ్యం చేకూరిందనీ, ఎప్పుడు తెలుపుతావో అప్పుడు ఆలోచిస్తాను. జబ్బువాళ్ళను నేను శిష్యులుగా అంగీకరించను. నువ్వు ఆరోగ్యంగా వున్నట్టు డాక్టరు సర్టిఫికెట్టు పంపించాలి; చెబుతున్నాను నే నెంతో శ్రమపడి నీకు నేర్పుదామనుకుంటున్నాను, ఆ శ్రమ వృథా అయిపోవటానికి నేను ఒప్పుకోను.

"మీకు పరిచితమైన శ్రీరామపురం" అని ఒకసారి రాశావు. జయరాంపురం మాత్రం అపరిచితమా! అక్కడి మలేరియా వ్యాధినీ, చేపల్నీ మరింకెవరన్నా మరచిపోతారు గాని నేను మరచిపోతానా? ఆ భయంవల్లనే నిరుడు వైశాఖ మాసంలో ఆ వూరుకు ఒకరు విందుకు పిలిచినా నేను పోలేదు. జయరాంపురంలోనే మరొక అమ్మాయి వుంది. ఆమె నన్ను అన్నా అని పిలుస్తుంది, నే నామెను చెల్లీ అంటాను.

దేహరీ వెళుతున్నావా? ఒకప్పుడు... నువ్వు ఇంకా అప్పటికి పుట్టివుండవు... నేనక్కడ కాలువ ఒడ్డున గిన్నెపళ్ళు ఏరుకునే వాణ్ణి వలవేసి చాపలు పట్టేవాణ్ణి. చాలారోజుల క్రిందటి సంగతి. అప్పటికింకా రైల్లు పడలేదు. చిన్న చిన్న స్టీమర్లమీద వెళ్ళేవాళ్ళు. మీ బంగళాకూడ నాకక్కడికి కనిపిస్తున్నట్టే వుంది. మీ యింటి వాకిట్లో కూర్చుంటే కొండిచేరవైపున సూర్యుడు ఉదయిస్తాడు కదూ! ఆ రోజుల్లో 'సతీ–చౌరా' అనే పేరుగల రేవు ఒకటి వుండేది. అది మీ యింటికి సుమారు రెండుమైళ్ళ

దూరంలో ఉన్నా కొంతసేపు అక్కడికి వెళ్ళి కూచుండే వాణ్ణి. ఇప్పటికీ ఆ రేవు ఉందో లేదో మరి!

'ఘుమ్రక్'గా వెళ్ళనన్నా, రానన్నా కష్టమనిపించదు. సరేగాని నీకు బర్మాను గురించి ఇచ్చిన విషయాలు ఎలా తెలిసాయి? ఇక్కడి మేజిస్ట్రేటు మూగవాడని నీ కెవరు చెప్పారు? మాండలే నుండి రావటానికి గాలిని స్త్రీలకు వున్నాయని నీ కెవరు చెప్పారూ? ఒకప్పుడు నువ్వు నిజంగా బర్మాలో ఉండి వుంటావు... ఎక్కడ ఉండేదానివి? ఈ దేశంలో ఎప్పుడో ఒకప్పుడు నేను చూడని ప్రదేశమంటూ లేదు. అయినా వంటి మందబుద్ధి జమీందార్లు ప్రపంచంలో చాల అల్పసంఖ్యాకులుగా ఉంటారు.

'రాజ్యలక్ష్మి' ఎక్కడ దొరుకుతుంది? అది మొదటినించి చివర వరకూ హృదయాన్ని స్పృశించే కథ. శ్రీకాంత్ ఒక నవల; అంతకంటే మరేమీ కాదు. ఆ వదంతులన్నీ నిరాధారాలు, వాటిని గురించి ఆలోచించ నక్కర్లేదు. కథ నిజంగా జరిగిందేనా? ఎవరి కథ అది? దీర్ఘాయురస్తు ఎప్పుడూ అదే నీకు నాకు ఆశీర్వాదం. శరీరారోగ్య విషయమై ఏ మాత్రమూ అశ్రద్ధ చేయవద్దు. నిన్నెప్పుడూ నేను చూచి యుండలేదు. అయినా నీ వంటే నాకింత వాత్సల్యం ఎలా కలిగిందో నాకే తెలియదు. అదంతా బహుశః నీ అదృష్టం. నేనింత సోమరిని కాకపోతే నిన్ను చూడ్డానికి ఎప్పుడో కాన్పూరు వచ్చియుండేవాణ్ణి. కాని అది సాధ్యపడేది కాదు; నాకు తెలుసు.

నీ యిద్దరు పిల్లలకూ నా ఆశీర్వాదాలు. వాళ్ళకు తల్లి దండ్రుల గుణాలే సంక్రమిస్తే ప్రపంచానికి కృతార్థత. నువ్వు వాళ్ళకు మంచి తర్ఫీదు ఇవ్వాలి. అందుకు నువ్వు దీర్ఘజీవివై యుండాలి. చచ్చిపోతే ఎలాగ? అప్పుడు నాకు కూడా కష్టంగా ఉంటుంది.

నువ్వు ఇంత క్రమబద్ధంగా ఉత్తరం రాస్తే నేను ఇలాగ ఒక వరుస, క్రమం లేకుండా జవాబు రాసినందుకు సిగ్గు పడుతున్నాను.

నువ్వు పంపిన కథలోని ప్రథమ అధ్యాయం గురించి ఈ సారి ఉత్తరంలో రాస్తాను.

నీ అన్నయ్య,
—శరత్.

## ౪౧

బాజే - శివపురం,
భాద్రపదం, 1826.

శుభమస్తు! నీ ఉత్తరం చేరింది; సంగతులు తెలిశాయి. నిరూపమాదేవి మీద నేను చాల ఆశలు పెట్టుకున్నాను. కాని ఆమె ఒక్క 'దీదీ' రాసింది; మరేమీ రాయలేదు. ఎందువల్లనో నీకు తెలుసా? వారం వ్రతం, జపం — తపం ఇత్యాది కర్మకాండతో ఆమె హృదయంలోని మాధుర్యం యావత్తూ ఇగిరిపోయింది. మన హిందూగృహాల్లో స్త్రీలంతా కొంచెమో, గొప్పో యీ కర్మకాండలో మునిగే వుంటారు. పోనీ, ఆ మాటకేమి? ఇప్పుడు నీమీద పెద్దఆశలు పెట్టుకుని ఉన్నాను. వ్యక్తి జీవితంలో సంధికాలం అనదగిన వయసులో వున్నావు.

అందుకనే నీకు శిక్షణ గరపటానికి సిద్ధంగానే వున్నాను. అందుకనే నీ రచన లేవీ ఇప్పుడు ప్రచురించటానికి నేను అంగీకరించటం లేదు. నీ రచనలూ, నీ పేరూ అచ్చులో చూడాలని చాలనుంచి ఆతృత పడుతున్నట్టు నాకు తెలుసు. అయినా నువ్వు ఇంకా ఒక్క సంవత్సరం ఓపిక పట్టగలవనీ నే ననుకుంటును.

నీకు నేను శిక్షణ ఇవ్వగల అవకాశాలు పూర్ణంగా లేవు. అట్టి సదవకాశాలు లభిస్తాయన్న ఆశలూ లేవు. అయినా నే నొకసారి ఆ చాయలకు వస్తాను. వచ్చినప్పుడు నిన్ను తప్పకుండా కలుసుకుంటాను. 'ఇన్నాళ్ళనించీ వారి పుస్తకాలే చదువుతాను. ఇంత చదువుతున్నా నేర్చుకో లేకపోయానే. వారు వచ్చి కొద్ది రోజుల్లో నాకు నేర్పేదేమిటి?' అని నువ్వు అనుకుంటావేమో! ఆ మాటా నిజమే. నిజానికది నేర్పేదీ, నేర్చుకునేదీ కాదు. కాని... "తులసి చనిపోయే సమయంలో" అంటూ రాశావు. చనిపోతున్న తులసిని గురించి... మళ్ళీ కథలో ఎక్కడా గాని, తులసిని గురించి మొదటి రెండుపేజీల ఇతిహాసం రాయటం వల్ల పాఠకునికి విసుగు కలుగుతుంది. నేనే దగ్గరుంటే ఈ సంగతి నీకు... అదంతా రాయకముందే చెప్పి వుండేవాణ్ణి. నువ్వు కథ ఎక్కడ ఆరంభించాలో చెప్పే ముందుగానే... కథ ఎలా ఆరంభించాలీ అన్నదే చాల కష్టమైన విషయం అని సూచించేవాణ్ణి. గ్రంథ సాఫల్యం యావత్తు అది ఆరంభించిన తీరుమీదే ఆధారపడి ఉంటుంది.

"ఒకనాడు తులసీదేవి గంగా స్నానంలో బూడిన అయిపోతుంది. ఆమె కూతురు, పదమూడేళ్ళ పిల్ల మంజరి చేసినదే స్తబ్ద చిత్తయై నిల్చుని వుంది. ముందుగా వున్న కాష్టజ్వాలలు

ఆమె ముఖఫలకంలో చిత్రవిచిత్రంగా ప్రతిఫలిస్తూ ఉన్నాయి. చాలా సేపటివరకూ ఆమె ముఖంవైపు చూచినవాళ్ళే లేరు. చివాలున హఠాత్తుగా తారాకుమారి దృష్టి ఆమెవైపు ప్రసారితమైంది. ఆమె చకితఅయింది. చితిమీద ఇంతకుముందే భస్మీపటలమై పోయిన ఆ వ్యక్తి తన బాల్యరూపాన్ని దాల్చి ప్రత్యక్షమైనట్లు తోచింది. చక్కని రూపం ఆమెదే, ఆ శాంత మాధుర్యరేఖలు ఆమెవే ముఖం గాఢ విషాదమేఘావృతమై ఉంది. తల్లి చనిపోయిన ఆ పసిదాని ముఖం చూచే సరికి ఇమె చింతిత హృదయంలో అనేక సుఖదుఃఖ మిశ్రితాలైన కథలు చలనచిత్రాల్లాగా దొర్లిపోయాయి. ఒకనాడు తులసి భర్తను కోల్పోయి, దుఃఖంతో, నిరాశతో తన యింటికి వచ్చింది. ఆమె తన యింటికి రావటమదే మొదటిసారి. అప్పటి నించీ తులసి తన రూపలావణ్యం లోకులకు కనిపించకుండా ఇంటి చాకిరిలో నిమగ్నమై వుంటూ..." ఇలా ఆరంభిస్తే ఎలా వుంటుంది? పూర్వగాథను ఇలా ఎంత సంక్షేపంగా ముగిస్తే అంత బాగుంటుంది. ఎందుకనంటే... ఈ విషయం ఇక్కడేగాని కథలో మరింకెక్కడా రాదు. కాబట్టి ఆ గత సమాచారాన్ని విస్తరించి చెప్పాల్సిన అవసరంలేదు. కథరాస్తూ వున్నప్పుడు 'ప్లాట్' ను గురించి ఎక్కువగా ఆలోచించి నవసరం లేదు. కథలో వచ్చేపాత్రల చరిత్రను ఒకసారి నీలో నీవు మననం చేసుకోవాలి, నీ తండ్రిని, నీ భర్తను నువు బాగా ఎరుగుదువు, అలాగే ని కథలోని పాత్రలనందర్నీ నువు బాగా ఎరిగివుండాలి. ఆ పాత్రలు తమ తమ గుణాల్నీ, దోషాల్నీ, పురస్కరించుకుని ఏ రీతిలో పూర్ణవ్యక్తిత్వాన్ని పొందగలరో

అది నిర్ణయించాలి, ఉదాహరణకు నీ కథలో మీ తండ్రిగారు నీ భర్త పాత్రలనుకుందాం. మీ తండ్రిగారు తన కార్యకలాపాల్లో, నీ భర్త తన ఉద్యోగంలోగాని, ఔదార్యంలో గాని, త్యాగబుద్ధిలోగాని పరిపూర్ణత గాంచినప్పుడే నీ కథారచన ఆరంభించాలి. మొదటినించీ పాటు ఒకటీ తీసుకుని తలబద్దలు కొట్టుకోకూడదు. అలా రాసినకథ చదివి లాభం లేదు.

ఇంకా ఇటువంటివే చిన్నవి, పెద్దవి ముఖతః చెప్పవలసిన అంశాలు చాల వున్నాయి. అవన్నీ ఉత్తరాలద్వారా నీకు తెలపటం కష్టం. ఏనాటికైనా నీకు ఈ రహస్యాలన్నీ చెబుతాను. కాని ఎప్పుడు చెప్పగలనో, ఆ సుదినం ఎప్పుడు వస్తుందో బ్రహ్మకు తెలియాలి. నీకు నా అసంఖ్యాక అశీర్వాదాలు.

నీ అన్నయ్య,
—శరత్‌చంద్ర చట్టోపాధ్యాయ.

౪౨

బాజే - శివపురం,
24-11-16.

శుభమస్తు ! నిన్నరాత్రి దీదీగారింటినించి తిరిగి వచ్చేసరికి పదిన్నర అయింది. నీ ఉత్తరం, సరోజరాసిన ఉత్తరం- రెండూ పడివున్నాయి, సరోజ ఇంగ్లీషులో రాసింది. ఆమెకు వచ్చినంత ఇంగ్లీషు నాకు రాదు. అందుచేత ఎంత చదివినా ఉత్తరం బాగా అర్థంకాలేదు. ఎప్పుడైనా ఆంగ్లభాషా పండితుడైన మిత్రుడు దొరికినప్పుడు అతనిచేత చదివించుకుని జాబు రాస్తాను.

నీకీ ఆతగారి అంత్యక్రియలు గొప్పగానే జరిగాయి. నాకు వేకేషన్ ఒకటి వచ్చింది. వారి ఎస్టేటులో ఇన్‌ఫ్లూయంజా జ్వరం వ్యాపించింది. బీద, బిక్క ఆ జ్వరానికి చాలమంది చచ్చి పోయారు. మందులపెట్టె తీసుకుని వెళ్ళాను. ఇద్దర్ని మాత్రమే చూశాను. ఇంకా కాస్త ఓపికపడితే ఇంకో ఇద్దరు, ముగ్గురు దొరికేవాళ్ళు. కాని అలసిపోయాను. నా దగ్గర మందులు అయి పోయాయి. రోగులు భగవంతుని చరణాల దగ్గర ఆశ్రయం పొందుతూ వున్నారు. మళ్ళీ మందులు తీసుకు వద్దామని తిరిగి యింటికొచ్చాను. కాని రేపు ఉదయానికల్లా నాకే జ్వరం పట్టు కొచ్చేట్టుంది. ఇవాళ ఎలాగో బైటికి రాలేదు, లోపలే అణగి వుంది. రేపుకూడా ఇలాగే అణగివుంటే మాత్రం ఎల్లుండి వెడ తాను.

నీ అన్నయ్య,
—శరత్.

## 43

బాజే - శివపురం,
30-3-1921.

శుభమస్తు! వారిశాల కాన్‌ఫరెన్సుకు వెళ్ళాలని నాకు చాల కోరిగ్గానే వుంది. కాని నేను కొత్తగా ఏర్పరచిన యీ పాఠశాల పనుల్లో ఎక్కువగా నిమగ్నుడనై యున్నాను. వెళ్ళ టానికి వీలు చిక్కదనుకుంటాను. ఇదివరకు నాకు పరిచితములై వుండిన కార్యకలాపాలనుంచి పూర్తిగా విరమించుకోవాలని కూడా నాకొక ఉద్దేశం వుంది. అదీగాక ఇప్పుడు నేను అనుసరి స్తూన్న ఈపనిపాటల్లో అనేకలోపాలు, కష్టనష్టాలు వున్నాయి. వీటన్నిటినీ అనుభవించేందు కిప్పుడు నాకు పిలుపు వచ్చింది. ఈ

సుఖ్వెర్వ జీవితం అనే వలకు చాల వుచ్చులు వున్నాయి. తీరిగ్గా కూచుని ఈ వుచ్చులన్నీ విప్పే వయసు కాదు. నాకిప్పుడు తొందరపనులు చాల వున్నాయి.

సరోజ రాసిన ఉత్తరాన్ని బట్టి మీ నాన్నగారికి బాగ ఆరోగ్యం చిక్కినట్టే భావిస్తున్నాను. నాకబురు మీకు ఎప్పటి కప్పుడు తెలుస్తూనే వుంటుంది. అందుకు నాకేమీ సందేహం లేదు. సదా నీకు నా ఆశీర్వాదాలు. నేను మళ్ళీ వ్యాకుల చిత్తుడనై పోకుండా మీరు భగవంతుని ప్రార్థించండి.

నీ అన్నయ్య, శరత్.

## ౪౪

బాజే — శివపురం,

27 జూన్ 1931.

శుభమస్తు! లీలా! ఇవాళ నీ ఉత్తరం చేరింది. తీరిక లేక పోయినందువల్ల వెంటనే జాబు రాయలేక పోయాను. చెల్లీ! నిజంగా నాకిప్పుడసలు తీరిక ఉండటం లేదు. కాంగ్రెస్ కార్య క్రమం సార్థకం అయినతర్వాత, నాకు మళ్ళీ తీరిక అంటూ చిక్కుతుందేమో! నాకిప్పుడ సమూనమూ... రెండు సంవత్స రాల క్రితం గాంధిజీ నడపిన సత్యాగ్రహపు రోజులే జ్ఞాపకం వస్తూవుంటాయి. నేను అప్పుడొక వాలంటీరును. నా ప్రక్కన ఒకడు, ముందున్న అయిదారుగురు గుండ్లుతగిలి పడిపోయారు. నేనప్పుడు పారిపోలేదు. గుండు నాకు తగలలేదు. ఆ నాడు ఆ మెషిన్ గన్ గుండు నా కెందుకు తగలకుండా పోవాలి? అనేకసార్లు తలవంచుకుని ఆశ్చర్యపోతూ వుంటాను. ఈనాడు దాని ఆవశ్యకత ఉన్నట్టు తోస్తోంది.

నీ అన్నయ్య, శరత్.

ఓం

జాకే – శివపురి

1 జనవరి 1953

శుభమస్తు! రమణుల నుంచి తిరిగి వచ్చేశాను. కాంగ్రెస్ సమావేశాలు పూర్తి కాకముందే వచ్చేశాను. కార్యక్రమం పూర్తిగా చూసిపోయాం. అందుకు వెళ్ళేముందే ఒక ఉత్తరం రాద్దామనుకున్నాను. కాని రాయలేను. వెళ్ళాక అక్కడినుంచి రాద్దామనుకున్నాను; కాని అలాగూ చెయ్యలేను. ఇప్పుడింటికి తిరిగి వచ్చాక జవాబు రాస్తున్నాను. ఇప్పుడు రాద్దాం, అప్పుడు రాద్దాం అని అనుకుంటూ ఉండటం చివరికి రాయకుండా వుండటం—ఇటువంటి విషయాలన్నీ కూడా విలువ వుంది తుచ్ఛమైన విషయాలు కావని. కాని ఈ సత్యం అందరూ గ్రహిస్తారా? అని నాకు: "అబ్బాయి! నీ విలువైన అంశాలన్నీ నీ దగ్గరే అట్టిపెట్టుకో. మా అమూల్యమైన ఉత్తరానికి మాత్రం జవాబు ఇవ్వు—మాకంతే కావలసింది" అని.

ఒకప్పుడు నేను చాల దయాదాక్షిణ్యాలు కలవాడినని అందరూ అంటూ వుండేవాళ్ళు. కాని ఇప్పుడు, అన్నలు, తమ్ముళ్ళు, అక్కలు చెల్లెళ్ళు, బంధువులు నాలో దయాదాక్షిణ్యాలు తులమెత్తుకూడా లేవంటున్నారు. 'అందులో కూడా ఒక విలువ వుంది' అంటాను నేను. కాని వాళ్ళు... "ఆ విలువతో మాకు సంబంధం లేదు. ఇదివరకు నీ వద్ద వుండిన ఆ విలువైన వస్తువే మాకు కావాలి" అంటారు. మా ఇంటి ఆవిడకూడా వాళ్ళతో కలసి అదే పాట పాడుతోంది. పైగా ఆమెదే అందరిలోకీ ఉచ్చస్థాయిలోని స్వరం.

నీ అన్నయ్య, శరత్.

౪౮

బాజే – శివపురం,
3 మే 19 3,

శుభమస్తు! చాలరోజులైంది నా కొంక గాఘ్యంగన సంభవించింది. బడి సాగినన్నాళ్ళూ ఫరవాలేదు; కొల్లాపడిందంటే కొంప మునిగిందన్నమాటే. ఇల్లు ఇంకా పూర్తికాలేదు; బావి పని ఆరంభించలేదు. ఈ యేడు అన్నిపనులు పూర్తి చెయ్యాల్సిందే అనుకున్నాను. కాని కూడబెట్టి వుంచిన డబ్బంతా అయిపోయింది. పనులన్నీ ఆగిపోయాయి. అదిగాక చాల మందిదగ్గర తెచ్చిన పైకంకూడా పులుసులో పడిపోయింది. నేను మోసం చేసేవాణ్ణి కాదన్న నమ్మకంచేతనే వాళ్ళు ఇచ్చారు. ఇప్పుడు వాళ్ళకివ్వాల్సినదంతా పైసలిగిల్చకుండా తీర్చెయ్యాలి. అనేకమంది బంధువుల్ని పోషించాల్సిన భారం కూడా నా మీదే ఉంది. వాళ్ళకిప్పుడు నేనేం చెప్పాలో నా కర్థం కావటం లేదు. నేను ఉపవాసాలు వున్నందువల్ల వాళ్ళు కూడా ఉపవాసాలు వుండాలనుకో. భగవంతుడేదో ఇస్తే సరేసరి. కాని ఆయన ఇవ్వడు. మానవుడు నిండు ఆకలితోనో [illegible]తోనో చచ్చిపోవలసిందే. రెండుమూడు రోజుల్లో ఎక్కడికన్నా లేచిపోయి రాత్రింబగళ్ళు పరిశ్రమ చేసి అయిదారువేలు సంపాదించుకు రావాలని ఆలోచిస్తున్నాను. ఏమైనా ప్రయత్నం ఫలిస్తుందో లేదో చెప్పలేను. ఇంత కుటుంబం పెట్టుకుని చాలవిచారంగా ఉంది.

నీ అన్నయ్య, శరత్.

## ౪౭

బాజే - శివపురం,
17 మే 1923.

శుభమస్తు! కొన్నాళ్ళనించీ ఊళ్ళో లేను. ఇవాళే రెండు మూడు గంటల క్రితమే వచ్చాను. రావటంతో నీ పోస్టుకార్డు చూచాను.

మా ... కాజీనజరుల్ ఇస్లామ్ హుగ్లీ జైల్లో నిరాహార దీక్షపూని చావుకు సిద్ధమైవున్నాడు. ఒంటిగంట బండికి బయలు దేరి వెళుతున్నాను. అతన్ని చూడ్డానికి అనుమతి ఇస్తారో లేదో ప్రయత్నించి చూస్తాను. ఇట్టే అవకాశం దొరికితే నిరాహార దీక్ష మానుకోమని ప్రతిమాలుతాను. ప్రతిమాలినా అతను వినకపోతే ఆశలు వదులుకోవలసిందే. అతను చక్కని కవి. రవిబాబును మినహాయిస్తే అతనిలాంటి గొప్పకవి మరెవరూ లేరు.

నీ అన్నయ్య, శరత్.

## ౪౮

సామతాబేడ్, పానిత్రాస్ పోస్టు,
హౌవడా జిల్లా, 18 కార్తీక్ 1333

శుభమస్తు! లీలా! నీ ఉత్తరం అందిందమ్మా! ఇలాగే తరచు నీ క్షేమసమాచారాలు తెలుపుతూ ఉండు.

నాకు ప్రభాస్ సన్యాసి అని ఒక సోదరుడు వున్నాడు. నువ్వు వినే వుంటావు. అతడు కొన్నాళ్ళ క్రింద బర్మానించి వచ్చాడు. మొన్న మంగళవారం రాత్రి జ్వరం పడ్డాడు. ఇలాగే మాటిమాటికీ జ్వరం వచ్చి శరీరం శిథిలం అయిపోయిందనీ, ఇక ఆ శరీరాన్ని పరిత్యజించాల్సిందేనని మాటిమాటికీ చెబుతూ

వచ్చాక. చిన్న తనపళ్లెగది ... ఒంటిగంటప్పుడు నన్ను వెతుక్కుంటూ వచ్చి నా గుండెమీద తలపెట్టి ప్రాణం విడిచేశాడు.. ...

నీ అన్నయ్య, శరత్.

౪౯

బాజే - శివపురం,
28-3-1935.

శ్రీహరిదాసు శాస్త్రికి!

మీ ఉత్తరం చదువుకున్నాను. ఈ సారి కాశీలో వున్న అంతమందిలోనూ మీరు ఒక్కరే నాకు ఆత్మీయులులా కనిపిస్తున్నారు. కాని మిమ్మల్ని గురించి నాకేమీ తెలియదు. మీ ఉత్తరం చాల పెద్దది. చదవటానికి చాలసేపు పట్టింది. ఒక విధంగా ఆలోచిస్తే మీరంతా పెద్ద ఉత్తరం రాయటానికి గాని, నేను దాన్ని చదివి అందులోని విషయాల్ని ఆలోచించటంలో గాని వృథా కాలక్షేపం అయినట్టు భావించకూడదు... ఇరవై రెండునించి ముప్ఫయి అయిదేళ్ళ మధ్య స్త్రీకి సంకట ప్రదమైన అవస్థ అని చెప్పాలి. 22, 23 యేళ్ళు వచ్చాకనే స్త్రీలకు నిజమైన ప్రేమ అంకురిస్తుంది. కాని ఆ యంకురించిన ప్రేమలోని క్షుధ యావత్తూ ఆధ్యాత్మిక ప్రేమగా అంతరితం కాదు. ఇదొక పక్షంవారి వాదం. ఏతద్వ్యతిరేక వాదంకూడా వుంది. కాని సాధారణంగా అలాజరగదు. కాని ఏ నలుగురైదుగురు వ్యక్తుల జీవితాల్లోనే అలా జరిగితే మాత్రం వారిలాంటి భాగ్యశాలులూ లేరు. వారిలాంటి దురదృష్టవంతులూ లేరు - అని చెప్పాల్సి వస్తుంది. వారి దురదృష్టంలోనే కావ్యజగత్తులోని మాధుర్యం అంతా యిమిడి వుంది...

సమాజంలో సౌరసత్వాన్ని తెలివాళ్ళను కేవలం ప్రేమతో సంతోష పెట్టలేం. మర్యాదన హీనమైన ప్రేమ బరువు శిథిలమై పోక తప్పదు. అదొక దుర్విషయం కూడా ఔతుంది. అంతే గాక...మన సంగతి కాదు, భావి సంతానం మాట అన్నిట కన్నా ప్రముఖమైనది. వాళ్ళ నెత్తిమీద మరొకరి భారం తీసు కొచ్చి పెట్టే సామర్థ్యం ఎంతగొప్ప ప్రేమలోనూ వుండదు... ఇంకోమాట నిజంగా ప్రేమించే శక్తి, సాహసం స్త్రీలకే పురు షుల కన్నా అధికం. వాళ్ళు దేన్నీ లెక్క చెయ్యరు. పురుషులు భయవిహ్వలులైన సన్నివేశాల్లో స్త్రీలైతే స్పష్టంగా ఉచ్ఛ స్వరాన వాళ్లాడి నిభాయించుకు పోతారు...సంఘంలోని దురాచారాల్ని ప్రతిఘటించేవాడు దుఃఖాల్ని అనుభవించ వలసే వుంటుంది.

...నిజమైన ప్రేమకోసం దుఃఖం అనుభవించాల్సిందే అంటారు. ఎవరు ఆపని చెయ్యకపోతే సంఘంలోని అసంబద్ధపు అన్యాయాలన్నింటికీ ప్రతీకారం ఉండదు. సమాజ వైరుధ్యం, ధర్మవైరుధ్యం — ఈ రెండు వేరు వేరు వస్తువులు. ఈ సంగతి చాలామంది తరచు విస్మరిస్తూ వుంటారు.

—శరత్.

౫౦

శ్రీ అక్షయచంద్ర సర్కారుకు !

మిత్రమా ! మన నవలను నాటకాలుగా మార్చి ప్రదర్శించాలంటే పాటించవలసిన నియమాలు: నాటకాలు అచ్చు వెయ్యకూడదు. ఇతర నాటక సమాజాల వారెవరినీ వాటిని యథేచ్ఛగా ప్రదర్శించుకుని అర్థోపార్జన చేసుకోనియ

రాను, ఏకో షోకుగా అభినయిస్తాం, అందుకోసం టికెట్లు అంటే నేనేమీ నిషేధించను. నా 'దత్త' అనే నవలను ఎవరో నాటకంగా రాశారు. ఆ ప్రతి నేను చూచాను. నేనే దాన్ని 'విజయ' అనే పేరుతో నాటకంగా మార్చి 'స్టార్ థియేటర్' వారికి ఇద్దామని ఓ ప్రెస్కాపీ రాశాను. దాన్ని తిరగరాయటమే మిగిలి వుంది కాని నా నవలలో వున్న దోషం ఏమంటే వాటిని నాటకాలుగా మార్చాలంటే అనేకచోట్ల కొత్తమార్పులు చేయవలసి వస్తుంది. నేను గాక ఇంకెవరన్నా అయితే అటువంటి కొత్తమార్పులు చెయ్యలేక; పుస్తకంలోని మాటల్నే కొంచెం తారుమారు చేసి నాటకం తయారు చేస్తారు; అంతే అందు కనే అలాగ ఇతర్లు తయారు చేసిన నాటకాలేవీ నాకు నచ్చ లేదు.

—శరత్.

౫౧

ఆషాఢం 1335

శ్రీ దిలీపకుమారరాయ్‌కి!

మంటూ,... వ్యాసాలు చదివాను. చిన్నపిల్ల రాసినవి. మంచి చెడ్డలు నిర్ణయించాల్సిన అవసరం లేదు. చిన్న వయ సులో కథలు రాయటం మంచిది; కవిత్వం రాయటం ఇంకా మంచిది; కాని వ్యాసాలు రాయటం మాత్రం అన్యాయమే. త్వరత్వరగా రాసెయ్యటం కూడదని చెప్పు. పండితుడు త్వరగా రాయొచ్చు; రచయిత తాపీగానే రాయాలి. రచనలు చూస్తుంటే అమ్మాయి బుద్ధిమంతురాలులాగే తోస్తున్నది. కాని వయసుతోపాటు మనం ఆర్జించుకునే వస్తువు ఒకటి

వుంది. దాన్ని అనుభవం అంటాము కేవలం పుస్తకాలు చదివినంత మాత్రాన్నే ఇది చేకూరదు. దాని మూల్యాన్ని తెలియక. ఈ అనుభవం, దూరదృష్టి అనేవి శక్తిని ప్రసాదిస్తాయి; అంతే కాదు శక్తిని హరిస్తాయి కూడా. ఆ సంగతి గుర్తించాలి. కాబట్టి ఈ శక్తి ఉడిగిపోకముందే కొన్ని పనులను (కథలు రాయటం మొదలైన వాటిని) చిన్నవయసులోనే పూర్తి చేసెయ్యాలి. చిన్నతనంలో రాసినట్టుగా వయసు వచ్చాక రాయలేం. ఇది నా అనుభవంలో వున్న విషయం. వయసుతో పాటు గాంభీర్యం ఏర్పడుతుంది. ఈ గాంభీర్యం అనుగుణంగానూ సంకోచాన్ని కలిగిస్తూ అడ్డుతగులుతూ వుంటుంది. మానవునిలో రచయితతో పాటు విమర్శకుడు కూడా వుంటాడు. వయసు పెరిగేకొద్దీ ఈ విమర్శకుడు శక్తివంతుడౌతూ వుంటాడు. వయసు మీరిన తరువాత ఏమైనా రాయటానికి కూర్చుంటే ఈ విమర్శకుడు అనుగుణంగానూ చెయ్యిపట్టుకుని ఆపుతూ వుంటాడు. వయసుమీరిన వాని రచన జ్ఞానదృష్ట్యా, విద్యాపాటవదృష్ట్యా గొప్పదే కావచ్చు. కాని రసదృష్ట్యా మాత్రం సరిపోదు. కాబట్టి యౌవనం దాటిన తరువాత మానవుడు రససృష్టి చేయటానికి పూనుకోవటం మంచిదికాదు. ఒకానొక వయః పరిమితి దాటిన తర్వాత మానవుడు కావ్యంగాని, నవలగాని రాయకూడదు. అవకాశం వచ్చినప్పుడు వినియోగించుకొనటమే మన కర్తవ్యం. ముసలితనం దుఃఖాల్ని సమకూర్చే సమయంలో; అటువంటప్పుడు పాఠకుల్ని ఆనందపరిచే ప్రయత్నం చెయ్యటం వృథా శ్రమే ఔతుంది...

—శరత్.

## ౫౨

22 భాద్రపదం 1336

మంటూ ... "మామూలు జనంపట్ల మనకు శ్రద్ధ తక్కువ. సమారాధన సందర్భాల్లో వాళ్ళకు బైటప్రాంగణంలో వేలపిండి మాత్రమే పంచిపెట్టించి, లడ్డూలు మొదలైన విలువైన పిండివంటలన్నీ గొప్పవాళ్ళనబడే వాళ్ళ కోసం అట్టిపెడతాం..." అంటూ పూజనీయుడైన రవిబాబు రాసిన వాక్యం ఉదహరించావు నీ లేఖలో. ఆ వాక్యం వినటానికి బాగానే వుంది. అది రాసినవారి ఔదార్యం ప్రస్ఫుటంగా కనిపిస్తూ వుంది. కాని వాస్తవిక దృష్ట్యా అది చాల పొరబాటైన సుశిక్షణ, ప్రఖ్యాతి, సంస్కారం గల వాళ్ళకు లడ్డూలే కావాలి. సుశిక్షిత సుకుమార హృదయునికి వేలపిండి ముద్ద పెట్టి తినిపించావనంటే అది అతనికి కడుపులో ఎంత గడబిడ చేస్తుందో నీకు తెలుసా? ఇక సాధారణ జనం మాట. ఈ రోజుల్లో వాళ్ళకు ప్రతిపూట లడ్డూలు ఎక్కడినుంచి తెచ్చి పెడతావో చెప్పు. వాళ్ళు ఈ రోజుల్లో వేలపిండితినే బ్రతుకుతున్నారు; పెద్దవాళ్ళు ఔతున్నారు. కాదంటావా? ఒక ఉదాహరణ చెబుతాను. కొంతమంది సాధారణ జనులు నీవంటి నలుగురైదుగురి ఆశ్రయం సంపాదించి, రైల్లో మూడో క్లాసు పెట్టె విడిచిపెట్టేసి హఠాత్తుగా రెండో క్లాసు పెట్టెలో ఎక్కారనుకో. రెండుమూడు గంటలు అక్కడే కూచోనిచ్చిన తర్వాత తెలుస్తుంది తమాషా. ఆ పెట్టెలో వుండవలసిన రీతిగా వుండటానికి తగినఓపిక, ప్రవృత్తి వాళ్ళకు వుంటాయా? లోపల పడకకుర్చీల్లో కూచుని లడ్డూలు ఆరగించటానికీ యోగ్యత వుండాలి. ఆ యోగ్యతను అర్జించుకోవాలి. ఈమాటే అనేక దేశాలలోని ఆలోచనాపరులు చెప్పియున్నారు. ఆ

మాట నువ్వూ అంగీకరిస్తావు. లేకపోతే లోపలి దరవాజా తెరచి వుండటం చూచి ఆ బైటి ప్రాంగణములోని జనం గందరగోళంగా వచ్చి మీదపడితే మనం బ్రతుకుతామా? కాబట్టి ఆ మాట వుదాత్తమైనదే. కాని మళ్ళీ ఎప్పుడూ చెప్పకూడదు.

—శరత్.

౫౩

బాజే - శివపురం,

4 ఫాల్గుణం 1331.

మంటూ...నీ కొత్తపత్రిక ఓరియంట్ నాకు పంపిస్తూ ఉండు. నీ వ్యాసం ప్రచురిత మౌతుంది, చదువుదాం అని చాలా కుతూహలంగా వున్నాను. సాహిత్య రంగంలో నువ్వు నాకు అప్పు పడియున్నట్టు రాశావు. ఆత్మసంయమనం తప్ప నువ్వు నా దగ్గర నేర్చుకున్నది చాల కొద్ది. అప్పుమాట నాకేమీ జ్ఞాపకంలేదు. కాని నేను నీకొకసారి చెప్పాను. కేవలం రాయటమే కష్టమైనపని కాదు. రాయకుండా ఉండటం కూడా చాల కష్టమే. అనగా లోపలి ఆవేశం, ఉద్ధృతం అనవసరంగా, నిష్ప్రయోజనంగా బైటికి ప్రవహించకూడదు. సర్వాంశాలూ పాఠకునికి విశదంగా ఉండేట్టు చేయాల్సిందే. ఇంకా మనం చెప్పని విషయాల్ని గురించికూడా అతను తన అభిరుచుల్ని భావాల్ని, బుద్ధిశక్తి గ్రహించగలిగేందుకున్నా, మన రచనలో అతనికి అవకాశం ఇవ్వాలి. నీ రచనలో అటువంటి సూచనలు, అవకాశాలు వున్నాయి. శ్రీ.....గారు తన పుస్తకంలో మరణిస్తూన్న ఒకానొక కుర్రవాని తల్లిదండ్రుల్ని అనేక పేజీలలో ఏడిపించాడు. పాఠకుడు విస్తుపోయి చూస్తూ

వుంటాయి కాని... అతనికి కన్నీరు కార్చే అవసరమే లేకుండా పోతోంది. రచనల్లో అటువంటి సంయమనం లేకపోతే సాహిత్యం చెడిపోతుంది. పాశ్చాత్య ప్రియుడు శ్రీ...బాబు చక్కగానే రాస్తాడు—చక్కగా రాయకుండా ఉండటం అతనికి తెలియదు. నిజానికి ఆయన గొప్ప రచయితే కాని అలా సూచ్యార్థంగా రాసే నేర్పు ఆయనకు అలవడలేదు. ఈ సంగతి ఆయన పుస్తకం చదివినతర్వాత నీకు తెలిసే వుంటుంది. ఒక విధమైన అసంయమ విధానమే కనిపిస్తూ వుంటుంది శ్రీ...గారి రచనల్లో. కుర్రవాడు బాగానే రాస్తాడు. విదేశాలుకూడా వెళ్ళి వచ్చాడు. కాని ఈ రహస్యాన్ని అతడు గుర్తించలేదు. అతని రచనలలో పాశ్చాత్య పద్ధతులంటే అరుచికరమైన గద్గదభక్తి ఒకటి ప్రకటితమౌతూ వుంటుంది. దానివల్ల పాఠకుడు ఉత్పీడితుడౌతాడు, ఈ సందర్భంలో మా మామయ్య జ్ఞాపకం వస్తున్నాడు, ఆయనా, నేనూ వైష్ణవుల ఉత్సవం ఒకటి చూడ్డానికి శ్రీధామపట్నం వెళుతున్నాం. ఆ ఉత్సవంలో వైష్ణవాగ్రములిచ్చే ప్రసాదం పుచ్చుకుంటే తనకున్న ఉబ్బువ్యాధి నయమౌతుందని మా మామయ్య విశ్వాసం. స్టీమరు దిగటంతోనే 'హరో' అంటూ లేచాడు. భయపడిపోయిన ముఖంతో ఒక కాలు ఎత్తి.....

"ఏమిటేమిటి?" అని అడిగాను.

"భక్తిభావంలో నిమగ్నుడినై పోయాను."

భక్తి లేనట్టుగా కనిపిస్తే తన ఉబ్బువ్యాధి ఎక్కడ నయం గాకుండా పోతుందోనని ఆయన భయం 'దోలా'కూడా విదేశీయ పద్ధతిలో రాసిందే. కాని అందులో అనవసరమైన భక్తి

విహ్వాలత లేదు. నిరుపయోగమైన క్లిష్ట వివరణలు లేవు ఈ రచయితకూడా విదేశాలు వెళ్ళివచ్చినవాడే కానక్కర్లేదు. చాలా విషయాలు తెలిసినవాడే. కాని ఊరికే పాఠకునికి అంతా చెప్పేద్దామన్న వ్యాకులత ఎక్కడా కనిపించదు. ఎవరైనా సవాలు చేసి ఫలానా రచనలో ఆ వ్యాకులత ఎక్కడ వుందో చూపించండి అని నిలవదీసి అడిగేట్టయితే మనం దానికి "అలా వేలెత్తి చూపించటానికి వీల్లేదు. పాఠకునికి మనస్సుకే అవగతమౌతుంది" అని మాత్రమే జవాబు చెప్పగలం. శ్రీమతి ... దేవి నవలల్లో వేదవేదాంత విషయాలు, ఉపనిషత్తులు, పురాణాలు, కాళిదాసు, భవభూతి—చాల మంది వంతులు వేసుకుని గందరగోళంగా చేస్తూ వుంటారు. పది పంక్తులు చదివేసరికి రచయిత్రి మనోభావం మనకు అర్థం ఔతుంది: "చూశారంతా చూడండి, నే నెంత పండితురాలినో, ఎంత చదువుకున్నానో, ఎంత విజ్ఞానినో..." అని ఈ అహంభావం అంతా అణగిపోవాలి గొప్పభావం, గొప్ప తత్వం, గొప్ప ఐడియా ఇవి అవలంబనంగా ముందుకు పోవాలి జీవితంలో గాని, సాహిత్యంలో గాని. వర్షం కురుస్తుంది, ఆకులు అల్లల్లాడుతాయి; ఎన్ని పూలు, నల్లని సిల్కు, తోడికోడళ్ళ పోట్లాట; అత్తాకోడళ్ళ పరస్పర క్రౌర్యం, కళాకుశలుని యింట్లో అలమారలు, సోఫాలు దీపాలు, ఒకమూల దండెంమీద వేలాడే చీరలు... వీటన్నింటిని గురించి రాసే రోజులు పోయాయి. వాటి ప్రయోజనమూ అయిపోయింది. ఇప్పుడూ వాటిని గురించే రాయటం సాహిత్యాన్ని వంచించటమే. నువ్వు ఇటువంటివేమీ రాయవు, నేను గమనించాను. అందువల్లా, ఇంకా అనేక యితరకారణాలవల్ల

నీ రచనలంటే నాకు చాల అభిమానం. రచయిత హృదయం లోని సానుభూతి అంతా రచనలో ఒక చక్కని పూవులాగ పాఠకునికి ప్రస్ఫుట మైనప్పుడే ఆ రచనలో జీవం వుంటుంది. అని నువ్వు చెప్పినమాట యథార్థం. ఇప్పుడు వంగభాషలో ప్రచురితమౌతూన్న పుస్తకాల్లోని నాయకానాయికుల చరిత్ర అంతా ఆ యా రచయితల స్వకీయ జీవితాలే నని పాఠకులు భావిస్తున్నట్లు నువ్వే నా కొకసారి చెప్పావు. అందుచేతనే నేను నా కు సజ్జన సమాజంలో అపాంక్తేయుడి నైనాను.

—శరత్.

౫౪

౬ కార్తీకం 1339

మంటూ...దేశాన్ని ఉద్ధరించదలచిన సుభాషచంద్రుని సమితివారు నన్ను ఎలాగైనా అవమానించటానికే చూస్తు న్నారు. మా యూనివర్సిటీ గురించి హాసూ 'షేమ్' 'షేమ్' అంటూ కేకలు వేశారు. కిటికీలోంచి బొగ్గుపొడి నా ముఖం మీదికి విసిరి వెళ్ళారు. మరోసారి సమితివారు పన్నెండు గుర్రాలుకట్టిన బండీమీద నన్ను కెక్కించి మైళ్ళు ఊరేగించి 'బొగ్గుపొడికేమీ భయపడద్దు. అదంతా మాయ' అన్నారు. ఏమైనా నా రూపనారాయణ నదిఒడ్డు నేనడిచి వచ్చేశాను. "ముముక్షువైన వ్యక్తికి వ్యక్తిగతమైన ఆశలు వుండవు" *A liberty man has no personal hopes*" అన్నారు మా గురుదేవులు. ఆ మాట లోని సత్యం అవగతం కావటానికి నా కెంతో సేపు పట్టలేదు. బొగ్గుపొడికి జై. పన్నెండు గుర్రాల బండికీ జై. శేషప్రశ్న చదివి నువ్వు ఆనందించినట్లు రాశావు నాకు చాల సంతోషం. "ఏమైనా చేస్తాను, కంపుగొట్టే మాటలే రాస్తాను." ఈ ...క

మైన మనోభావం ఆధునిక సాహిత్యంలో కేంద్రీయమైన ఆధారంగా లేదు. అందుకనే గాను అటువంటి 'మాదిరి' ఒకటి చూపించాను.

—శ ర త్.

* *

సామతాబేడ్, పోస్టు పానిత్రాస్,
22 భాద్రపదం 1333.

మంటూ రామ్! నీ పుస్తకం, చిన్న ఉత్తరం చేరాయి. నిన్న పగలు, రాత్రి చదివి పుస్తకం పూర్తిచేశాను. పుస్తకం చాల బాగుంది. కాని రెండు పొరపాట్లు చేశావు. భారతదేశం లోని గొప్ప గొప్ప సంగీత పాఠకుల పేర్లలో నా పేరు ఎక్కడా లేకపోవటం చూచి చాల విచారించాను. అయినా నువ్వు ఈ పొరపాటు బుద్ధిపూర్వకంగా చెయ్యలేదనుకుంటాను. ఏదో వీలుపడక అటువంటి పొరపాటు చేశావనుకుంటున్నాను. ఇక ముందైనా దాన్ని సరిదిద్దుకోగలవని ఆశిస్తున్నాను. రాయబహాదూర్ మజుందార్ మహాశయుని 'రాంగా జబా మూటో మూటో మూటో'ను కూడా నువ్వు వుల్లేఖించలేదు. ఆ పని కూడా చేస్తే బాగుండేది. ఆయన కిప్పుడెంత విచారంగా వుంటుంది? ఇంతవరకు పుస్తకంలోని పొరపాట్లను గురించి చెప్పాను.

నీ కన్సర్టుకు నేరు హాజరు కాలేక పోయాను. శరీరం అస్వస్థతగా వుండటం మొదటికారణం. మరో కారణం ఏమిటంటే...ప్రతియేడూ మేదినీపురంలో వరద వస్తూ వుంటుంది. వరదల్ని నిలువరించే యేర్పాట్లేమీ ప్రభుత్వం చెయ్యలేదు;

చెయ్యాను. ఈ వరదదేశానికి ఒక టాక్సు (పన్ను) గా తయారైంది. ఈ విధంగా ప్రతియేడూ ఆ వరద బాధితులకు సహాయం చేస్తూ వున్నందువల్ల ప్రయోజనం ఏమిటి? గట్లు సరిగా పోయించి వరద రాకుండా ఆపు చేయించండని ప్రభుత్వానికి విజ్ఞాపన చేస్తే జైల్లో వేస్తారు. ఆ వరద బాధితులను మిగతా ప్రజలంతా సహాయం చెయ్యటం తిండిపెట్టటం, బట్టలివ్వడం వారి మహాకర్తవ్యం అని ప్రభుత్వానికి తెలుసు. వాళ్ళ యిళ్ళలోకి కూడా నీళ్ళు వస్తాయి. పద్మానది ఒడ్డునే వీళ్ళంతా ఎందుకు కాపురం వుంటారో నీకు తెలుసునా? వర్షాకాలంలో తమ యిళ్ళు, వాకిళ్ళు కొట్టుకుపోవాలనే... అటు పశ్చిమ ప్రాంతంలోవున్న గృహస్థుల దగ్గరించి రూపాయలు కాజెయ్యాలనే. అంతకంటే వాళ్ళకు వేరే ఉద్దేశం ఏమీ లేదు. ఈ విషయం నువ్వూ కాదనలేవు. ఈ విషయంలో నీకూ నాకూ మతభేదం వున్నట్టు నాకేమీ అనుమానం లేదు నువ్వు బుద్ధిమంతుడివి; నిజం తెలుసుకో గలవు.

నువ్వు విదేశాలు వెళ్ళుతున్నట్టు పత్రికలో చదివాను. నీ విదేశయాత్ర నిర్విఘ్నంగా కొనసాగు గాక! నీ ఉద్దేశం సఫలమౌగాక! నేను ముసలివాడినైనాను. నువ్వు వచ్చిన తరువాత నేను నిన్ను మళ్ళీ కలుసుకోలేనేమో. ఎల్లప్పుడూ నీ శుభాన్నే ఆకాంక్షిస్తూ వుంటాను. మీరంతా క్షేమమే కదా!

వచ్చే భాద్రపద మాసానికి నాకు ౬౦ ఏళ్ళు దాటుతాయి. కార్తీకంలో ఒకసారి వచ్చి మిమ్మల్ని కలుసుకుంటాను.

—శరత్.

౫౬

సామతాశేడ్, పానిత్రాస్ పోస్టు,
6 ఫాల్గుణం 1 33.

మంటూ...నీ ఉత్తరం, టికెట్టు, రెండూ చేరాయి. కన్సర్టుకు హాజరు కావటానికి నాకు తీరిక లేదు. నీ ఉత్తరం వచ్చాక ఎలా వెళతాను? నువు విదేశయాత్ర వెళుతున్న సందర్భంలో మిత్రులు ఏర్పాటు చేస్తున్న ఉత్సవంలో పాల్గొనటానికి గురువారంనాడు రావాలనే కోరుతున్నాను. కాని ఇక్కడ బెంగాలు-నాగపూర్ రైల్వే హరతాళ్ చేసున్నారు. రైలు బయలుదేరుతుందో లేదో చెప్పలేం. ఒకవేళ రైలు బయలుదేరినా అది హావడా చేరేసరికి ఏడెనిమిది గంటలకు తక్కువకాదు. రైలు బయలుదేరక నే పోతే చేసేదేమిటి? పోనీ, కంటితో చూడాల్సిన అవసరం ఏముంది; చెవులతో వినాల్సిన అవసరం ఏముంది? ఇక్కడినుంచే హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తాను. నీ యాత్ర నిర్విఘ్నము, సార్థకమూ అగుగాక!

నా ఆరోగ్యం ఏమీ బాగుండటం లేదు. శరీరం శిథిలమూ, శీర్ణమూ అయిపోతూ వుంది. 'మనేక్ పాశ్' యొక్క చివరభాగం చాల మధురంగా వుంది. ప్రపంచాన్ని సానుభూతితో చూడ్డం నేర్చుకున్న తరువాత అప్పుడు ప్రపంచవ్యవహారాల్ని గూర్చి రాయటంలో ఎంత వ్యథ, ఆనందం వుందో ఈ పుస్తకం చదివాక అర్థమౌతుంది.

నీ కెప్పుడూ ఏవో పనిపాటలు వుంటూనే వుంటాయి. నీకు తీరిక వుండదసలు, అయినా విదేశాలనించి తిరిగి వచ్చాక మళ్ళీ నువు ఏవేవో రాస్తూ వుండాల్సిందే. రచనా కౌశలాన్ని,

శిల్పచాతుర్యాన్ని ఇంకా నువ్వు ఎక్కువగా సమకూర్చుకోవాలి. కేవలం రాయటమే కాదు. రాయకుండా వుండే నేర్పుకూడా ఆర్జించాలి. దాన్ని ఆర్జించుకున్నప్పుడు ఆవేశితమైన హృదయం బహుముఖాలుగా చెప్పదలచుకున్న దాన్ని శాంతంగా, గంభీరంగా, సూచ్యార్థంగా చెప్పగలవు. ఈ నేర్పు నీలో మధ్య మధ్య కనిపిస్తూనే వుంది; కాని అక్కడక్కడ నిన్ను నీవు మరచిపోతున్నావు. పాఠకులకు ఓపిక తక్కువ. నూరామడల మెట్లెక్కి స్వర్గానికి పోవటానికి కూడా వాళ్ళు ఇష్టపడరు. నరకానికైనా సరే వాళ్ళకు దగ్గరదారి కావాలి. ఈ విషయం జ్ఞాపకముంచుకోటమే సర్వోత్కృష్టమైన రచనా కౌశలం. నీకు నా ఆశీర్వాదాలు.

—శరత్.

## ౫౭

సామతాబేడ్, పానిత్రాస్‌పోస్టు,
28 ఫాల్గుణం 1333

మంటూ! నీ ఉత్తరం చూచుకుని ఎంతగా సంతోషించానో వివరించలేను. నీకు నాపై చాల శ్రద్ధవుంది. నన్ను నువ్వు ఎంతగానో ప్రేమిస్తున్నావు. అంతమాత్రం కూడా నేను తెలుసుకోలేకపోతే ఇక నాకీ ప్రపంచంలో తెలిసిందేమిటి?

నిన్ను విదేశయాత్ర పంపిస్తున్న సందర్భంలో సమావేశమైన మిత్రులంతా ఏమేమి వాక్యాలు పలికారో... అంతా విన్నాను. నువ్వు విదేశయాత్ర వెళుతున్నావు కాని తొందరగా తిరిగి రావాలి సుమీ! నువ్వు దగ్గరలేవు అన్న భావం కలిగినప్పుడెల్లా నాకు చాల బాధగా వుంటుంది.

'మరేన్ పకశ్' యొక్క మూడో భాగం నా కెంత ఆనందాన్ని ఇచ్చిందో పైకి చెప్పలేను. నిజమైన దుఃఖాన్ని మనోవ్యథను, అనుభవించి ప్రపంచ ప్రజలంతా చివరకు ఎలా ఐక్యం కాగలరో ఆ పుస్తకం చివరిభాగంలో చాల సహజంగా నిరూపితమైంది. ఒకన్యకి యథార్థమైన జీవితాన్ని నువ్వు చాల బాగ చిత్రించగలవు. కాని ఆ చిత్రాలలో కళాత్మిక కౌశలాన్ని నువ్వు అలవరుచుకోవాలి. నీవా నాన్నగారి నేను స్వయంగా ఎరగను. కాని నాకు నువ్వు వ్రాసిన వేదనను సానుభూతితో అర్థం చేసుకోగల గొప్ప అనుభవజ్ఞురాలివి నాకి అంతరంగిక మిత్రులలోకను చెప్పగా విన్నాను; ఆ సంగతి నీకు కూడా సంకమించి వుంటుంది. అది నీ హృదయంలో అనుభవ పరిపాకంతో పరిపూర్ణత పొందాలి.

నా ఉత్తరాలు ఎన్ని కావలిస్తే అన్ని ప్రకటించవచ్చు. అందుకు నా అనుమతి ఇస్తున్నాను.

నీ వంటే నాకు మిక్కిలి ప్రేమ. నిన్న మొన్నటినించీ కాదు, చాల రోజులనించీని...నీ యిష్ట మిత్రులతో సహా వచ్చి ఆనాడు మా యింట్లో అల్లరి చేసి, పూరీలు తినిపోయిన నాటి నించీని. నీకు దీర్ఘాయు రారోగ్యములు చేకూరుగాక! నీ జీవితము సార్థకమౌగాక! ఇవే నా హృదయపూర్వకా శీస్సులు.

—శరత్.

౧౭

సామతాబేడ్, పానిత్రాన్ పోస్టు,
భాద్రపదం 1335.

మంటూ! చాల రోజులనించి నీ ఉత్తరానికి జవాబు రాయలేదు. నీకు బాగా కోపంవచ్చి యుండవచ్చు. ఆనాడు

థియేటర్ రోడ్డులోవున్న యింటికి వచ్చాను. కాని నువ్వూ లేవు, మీ మామయ్యా లేడు. దొరగారిని అడగటం బాగుంటుందో బాగుండదో నాకేమీ తోచలేదు. నాతోపాటు ఒక సత్పురుషుడు కూడా వచ్చాడు. ఆయనకు దొరల యిళ్ళకు వెడుతూ వుండటం అలవాటు. ఒక కార్డుమీద పేరురాసి లోపలికి పంపించాలనీ ... నోరు తెరుచుకుని అలా బైట నిల్చుంటే ఆయనకు కోపం వస్తుందనీ ఆ సత్పురుషుడు చెప్పాడు. కాని కార్డేమీ దగ్గర లేకపోవటంచేత ఇంటికి తిరిగి వచ్చేశాను.

రాత్రికూడా మళ్ళీ నీ 'దో ధారా'లో అనేక చోట్ల చదివాను. ఏదో అవహేళన పూర్వకంగా చదివే పుస్తకం కాదది. నిజంగా పుస్తకం చాల బాగుంది. తీవ్రంగా మనసు జొనిపి చదవాల్సిన పుస్తకం. కాని ఈ రోజుల్లో ప్రశంసాపాత్రం కలిగినంత విలువ దానిలో లేదు. ఎందువల్లనంటే... ఈ రోజుల్లో ఎవరి మాటకైతే విలువ వుందో వాళ్ళే దీన్ని అగౌరవ పరుస్తున్నారు. కాని నా మాటమీద విశ్వాసం వున్న వాళ్ళందరితోనూ చెబుతాను: "మంటూ రాసిన ఈ పుస్తకాన్ని శ్రద్ధగా మొదటినించి చివరవరకు చదవండి" అని. నేను కూడా కలంపట్టి రాసే వాడినే. కాని నే నిదివరకెప్పుడూ ఆలోచించి యుండని అనేక కొత్తవిషయాలు నీ పుస్తకంలో వున్నాయి.

"భారతవర్ష" 1335 జ్యేష్టమాస సంచికలో నీ 'చాకర్' కథ చదివాను. చిన్నకథల టెక్నిక్ దృష్ట్యా అది బాగాలేదు. కాని ఒకే విషయంలో మాత్రం నీ ప్రతిభ కనిపిస్తోంది–సంభాషణ క్రమంలో, కథలురాసే పద్ధతిలో నేర్పు, ఈ సుందరమైన

సంభాషణ క్రమం—ఈ రెండూ నీలో సమ్మిళితమై పరిపక్వం చెందినప్పుడు నువ్వు మంచి సాహితీ పరుడివౌతావు ఒక్క విషయం మరచిపోవద్దు. రాస్తూ వుండటం ఎంత కష్టమో రాయకుండా ఆగటం కూడా అంత కష్టం. కాని అది ఒకరు నేర్పేదికాదు. నువ్వే స్వయంగా నేర్చుకోవాలి. నువ్వు దాన్ని బహుస్వల్ప కాలంలోనే నేర్చుకోగలవు. నాకు తెలుసా సంగతి. ఇవాళ నిన్ను ఎగతాళి చేసేవాళ్ళంతా రేపు సత్యాన్ని తెలుసుకో గలుగుతారు. నేను వెళ్ళి పోవాల్సిన రోజు వస్తోంది. కాని నా మాట మాత్రం నీ కెప్పటికైనా జ్ఞాపకం వస్తుంది.

"శరచ్చంద్ర్ ఔర్ గాల్స్‌వర్దీ" అనే వ్యాసం చదివాను. గాల్స్‌వర్దీ పేరైతే విన్నాను. కాని అతని పుస్తకా లేమీ నేను చదవలేదు. కాబట్టి అతనికీ నాకూ పోలిక లేమన్నా వున్నాయో లేవో నాకేమీ తెలియదు. వ్యాసంలో నన్నుగూర్చిన ప్రశంస వుంది. గాల్స్‌వర్దీ రచనలలో నించి కొన్ని వ్యాసాలు ఎత్తి రాశారు. నాకేమీ అర్థంకాలేదు. బహుశః శ్రీ అ......బాబు గాల్స్‌వర్దీ పుస్తకాలు చదివి వుంటాడు. గాల్స్‌వర్దీ గొప్పగొప్ప విషయాలే రాసి వుంటాడు. అవి చదవటం వల్ల మనిషికి జ్ఞానం కలుగుతుంది—అంతే ఆ వ్యాసంవల్ల నా కర్థమైన దల్లా.

అమ్మాయి ఎప్పుడూ ఏదో దుఃఖంగానే ఉంటోందని రాశావు. ఆ మాటకు నేను చాలా బాధ పడుతున్నాను. మన సమాజంలో స్త్రీఅయిపుట్టటమే ఒకశాపం. దానినించి విముక్తి పొందటం అసంభవం.

ఆనాడు బ్రెట్రండ్ రస్సెల్ రాసిన *An out line of Philosophy*" అన్న పుస్తకం చదివాను. పుస్తకం చాలా కఠినంగా ఉంది. గణితశాస్త్ర పరిజ్ఞానం లేకపోతే విషయాన్ని అర్థం చేసుకోవటం చాలా కష్టం నాకూ అర్థం కాలేదు. కాని రచయిత శక్తికీ, తెలియని వాళ్ళకు తెలియజెప్పేందుకు అతడు చూపిన ఓర్పుకు ముగ్ధుడినైనాను. తెలియని వాళ్ళపట్ల అతని కెంతో కరుణ. పాపం! వాళ్ళుకూడా కొన్ని విషయాలు తెలుసుకుంటే బాగుండునే అన్న ఆయన కోరిక ప్రతి పంక్తిలోనూ వ్యక్తమౌతూ ఉంటుంది. నిజంగా పండితుడు, జ్ఞాని అయినవాని రచనలకూ ఏదో గడబిడ చేసే వాళ్ళ రచనలకూ ఎంత తేడా ఉంటుందో బెర్ట్రాండ్ రస్సెల్, హెచ్. జి. వెల్సు రచనలు చదివితే బోధపడుతుంది. పెద్ద పెద్ద మాటలు విసురుతూ ప్రేలాపాలుపోతారు చాలమంది. రసల్ రాసిన "*On education*" అన్న పుస్తకం కొన్నాను. రేపు చదువుదామనుకుంటున్నాను. ఒకవేళ వచ్చే సంవత్సరం నేను విదేశయాత్ర బయలుదేరేట్టయితే కేవలం ఆయన్ను చూట్టానికే వెడతాను.

ఆనాడు చాలమంది యువకులు వచ్చారు. నీ 'మనేర్ పరశ్' ను ఎంతో గొప్పగా ప్రశంసించారు. దాని విషయమై నేను అన్నమాట లన్నీ యథార్థమే నన్నారు. నాకు చాల సంతోషం అయింది.

మామయ్యా ఎలా వున్నావు? ఈ సమయంలో నువ్వు ఎక్కడ వున్నావో సరిగా తెలియదు. అందుచేత ఉత్తరాన్ని మీ మామయ్య చిరునామాకు పంపుతున్నాను. ఉత్తరం నీకు చేరగలదని ఆశిస్తున్నాను. నీకు నా ఆశీస్సులు.

ఆటోగ్రాఫ్ నేనే ఒకనాడు స్వయంగా వచ్చి యిస్తాను. పారెయ్యకేమ.

—శరత్.

## ౫౯

సామతాబేడ్, పానిత్రాస్
2[illegible]-6-1925

మంటూ! నీ పేరుమీద ఏమి వారంటు వచ్చిందనీ నువ్వు బైరాగుల్లో కలిసిపోవటానికి? చాలు చాల్లే. ఈ ఉత్తరం చూచిన తక్షణమే ఇక్కడికి బయలుదేరి రా. నాలుగురోజులుండి మళ్ళీ కావలిస్తే వెళుదువుగాని. నాకు చాల అనుభవం వుంది, నా మాట విను. నేను అంత వయసులో వున్నప్పుడు నాలుగు సార్లు సన్యాసం పుచ్చుకున్నాను. ఆ చాయల ఈగలు, దోమలు చాల తక్కువ అనుకుంటాను. అవి కుట్టితే సహించే తాహతు హిందుదేశస్థులకేగాని మరింకెవరికీ అంత సామర్థ్యం లేదు. నా మాట విని వెంటనే వచ్చెయ్యి. నువ్వు వచ్చిన తరువాత ఈ వర్షాకాలం పూర్తి కాగానే ఉత్తరప్రాంతం, దక్షిణ భారతం చూచి రావటానికి వెడదాం. నువ్వు తోడు లేక పోతే నాకు సరిగా మర్యాదలు జరగవు. అన్నపానాదులు కూడా సరిగా దొరకవు. నువ్వు ఎప్పుడు బయలుదేరి వచ్చేదీ ఈ ఉత్తరం చూడగానే జవాబు రాయి. నేను స్టేషనుకు వచ్చి కలుసుకుంటాను.

బారేన్‌బాబు ఒకానొక చెట్టు ఆకు తీసుకొచ్చి మన ముక్కుమీద రుద్దుతాట్ట. వెంటనే మనకు రకరకాల పూల వాసనలు అనుభవంలోకి వస్తాయిట. అతడీ విద్య అరవింద

ఘోష్ వద్ద నేర్చుకున్నాడని ఉపేన్ బంద్యోపాధ్యాయ్ అంటున్నాడు. నువ్వు వచ్చేటప్పుడు అతని వద్దకుపోయి ఆ విద్య నేర్చుకురావటానికి ప్రయత్నం చెయ్యి. అతడు వెంటనే చెప్పడు. నువ్వు అతన్ని ఒకపట్టాన విడిచిపెట్టకు. అతన్నీ, అతని ఆకునూ వీలైనంత గొప్పగా పొగుడుతూ, పుస్తకం ఒకటి చేతపుచ్చుకుని అతనితోనే తిరుగుతూ వుండు. అయ్యో, ఈ పుస్తకం ఇన్నాళ్ళనించీ చదవనే లేకపోతున్నానే-అంటూ అప్పుడప్పుడు విచారం వెళ్ళగక్కుతూ వుండు. ఈలోగా ఎలాగైతేనేం ఆ విద్య అతని దగ్గనించి సంగ్రహించ గలుగుతావు. ఉత్తర భారతదేశ సంచారం వెళ్ళినప్పుడు అది మనకెంతైనా ఉపకరిస్తుంది

అనిలవరణబాబు మట్టిని పంచదారగా కూడా మారుస్తాడట. ఆ మాయ ఎక్కువసేపు వుండదట. అయినా అయిదారు గంటలవరకూ చూడ్డానికీ, రుచికీ పంచదారగానే వుంటుందిట. నువ్వు ఈ విద్యకూడా నేర్చుకు రావాలి సుమీ! ఒకవేళ పరదేశంలో పైసాలు అయినప్పుడు అక్కడి బాటసారులకు...అర్ధమైందికదూ? నువ్వు దాన్ని కూడా నేర్చుకు రావటం అవసరం. అనిలవరణబాబు చాల మెత్తని మనిషి. మంచివాడు. నీ కది నేర్పటానికి కతడు అభ్యంతరాలేమైనా చెప్పేట్టయితే దయ్యాల, భూతాల కథలు చెప్పు. ఒక దయ్యాన్ని నువ్వు కళ్ళారా చూచినట్టు శపథపూర్వకంగా చెప్పు. ఇంకేం పరవాలేదు. ఆ విద్య నీకు కరతలామలకం అయినట్లే. ఈ రెండు విద్యలూ నేర్చుకుని వచ్చేట్టయితే మన యాత్రలో ఏ మాత్రమూ కష్టపడ నక్కర్లేదు.

చాల రోజులైంది నిన్ను చూచి. చూడాలని చాల కుతూహలంగా వుంది నీ పాట వినాలని కూడా ఆతృత పడు తున్నాను. ఎప్పుడొస్తావు? వెంటనే జవాబురాయి. నీకు నా ఆశీస్సులు.

ఆ విద్యలు తప్పకుండా నేర్చుకుని రావాలి. అనేక సంతర్భాల్లో అవి మనకు వుపయోగిస్తాయి. ఏమైనా నువ్వు తొందరగా బయలుదేరి రావాలి. సన్యాసి అయిపోవటం చాల అసహ్యం మంటూ, నా మాట నమ్ము. నేటి యీ ప్రపంచ స్థితిలో సన్యాసి అవటంలో ఆనందం ఏమీలేదు; ఎప్పుడు వస్తావో సరిగా రాయి.

—శరత్.

- ౬౦

సామతాబేడ్, పానిత్రాస్ పోస్టు,
4 ఫాల్గుణం 1337.

మంటూ! నీ ఉత్తరం చేరింది. మొదట్లోనే రాశావు, 'రోజు రోజుకూ మీరు నా యెడల అప్రసన్నులై పోతున్నారు' అని. అప్రసన్నత అంటే విరక్తి అనే అర్థం అయితే...'నేను అప్ర సన్నుడను కావటం లేదు, అనే అంటాను. నిజానికి నువ్వంటె నాకు చాల ప్రేమ. అందుకనే...నేసిక ఎన్నాళ్ళో జీవించను, ఈ జీవితంలో నిన్ను మళ్ళీ చూడలేనేమో అన్న భావం కలిగి నప్పుడు నా మనస్సులో ఎంత బాధపడుతూ వుంటానో మీకెవ రికీ తెలియదు. కాబట్టి ఈ ప్రసంగం అనవసరం. జీవితంలో అనేక దుఃఖాలు కష్టాలు తలవంచుకుని అనుభవించాను. వాటిలో ఇదొకటి.

నీ రచనలవల్ల నా కొక బలం, ఆశ లభిస్తున్నాయి. కాని ఇప్పుడు నాకు చాల బాధగా వుంది. ఆ శ్రమ స్వీకారం చేసి నువ్వు అసలే రాయలేవు. ప్రేమించకుండా, నిందలు అనుభవించకుండా, దుఃఖభారం మోయకుండా, అసలైన ప్రపంచానుభవం పొందకుండా ఇతర్ల ముఖతఃవిన్న విషయ సామాగ్రిలోనే సాహిత్య సృష్టి ఎన్నాళ్ళు చేస్తావు? ముక్కు-మూసుకుని, ప్రాణాయామం చేసి యోగబలంతో ఏమైనా చెయ్యగలనేమోగాని సాహిత్యసృష్టి మాత్రం చెయ్యలేవు. అనుభవ విస్తృతి లేని జీవితం వంగదేశపు బాల వితంతువులాగ పవిత్రంగానే వుండచ్చు; ఆరంభంలో ఉద్భవించే ఆవేశంలో ఏ కొంచెమో సృష్టించవచ్చు, కాని అది చల్లబడిన మీదట స్వామూ శ్రీహీనము. నీరసము, మరు భూమిలా తయారౌతుంది. రానురాను నీ రచనల్లో విషయా భావం ద్యోతకమౌతుందేమో నని భయపడుతున్నాను. రచయిత అంతర్యం అంతా ఒక సుందర పుష్పగుచ్ఛంలా ప్రతిఫలించినప్పుడే అది జీవ రచన అనిపించుకుంటుంది. నా పుస్తకాల్లోని నాయికా నాయకులను చూచి వాళ్ళమాటలే నా మాటలనీ, వాళ్ళ జీవితమే నా జీవితమనీ ప తకులు భావిస్తున్నారేమో నాకు తెలియదు. అందుకనే నేను సజ్జనుల సమాజంలో అపాంక్తేయుడినైనాను. అనుశ్రుతిగా లోకులు ఏమేమైనా అనుకుంటూ వుంటారు. అది నా మాట. నిన్ను గురించి నేను ఒకసారి ఇలా అనుకున్నాను, మంటూ బారిష్టర్ పాసై రాలేదు. ఇది చాల మేలే. కుప్పలుకుప్పలుగా డబ్బు సంపాదించలేదు, మోటార్లలో ఎక్కి తిరగటు; హైసర్కిల్సు (ఉచ్ఛవర్గీయుల) లో పేరు పొంద

క్షేమ. అయితే మాత్రం తక్కువేమిటి? వృద్ధాప్యంలోనే చాల భాగం సాగిపోతుంది. కేవలం సంగీత సాహిత్యాలను సంబంధించినంతవరకు అతడు ప్రపంచానికి చాల ఇచ్చాడు. నిగానంద ప్రపంచాని కతడు ఆనంద నిధి. మా కంటే చాలు. మంటూ దేశదేశాలు తిరుగుతున్నాడు. అనేక దేశాలతో, ఆ యా సమాజాలతో, ప్రజలతో వంగదేశానికి ఒక వైశిష్ట్యాన్ని సమకూరుస్తున్నాడు. అందరూ అతన్ని గుర్తిస్తున్నారు, ప్రేమిస్తున్నారు. అతనితో ఎక్కడికి వెళ్ళినా కావలసినంత గౌరవం లభిస్తుంది... ఇలాంటి మా ఆశలమీద, ఆనందంమీద నీళ్ళు చిలికాడు. విస్మృతానందమూర్తి, అపార స్వాతంత్ర్య ప్రియుడు. ఒకరి అనుమతి లేకుండా అడుగైనా వెయ్యటానికి వీల్లేని... ఒక దాస్యపు పట్టా పుచ్చుకున్నాడు. అదే ఆయన ముక్తి సాధన మార్గం. దేశం, సాహిత్యం – అన్నీ పోయాయి. అదే ఆయన కిప్పుడు సర్వస్వం అయింది. నేనూ చాలా చదువుకున్నాను, చాల విషయాలు చూశాను, చాల పనులే చేశాను. ఈ విషయం మాత్రం నేను మరచిపోను. అందుకనే ఎవరేమి చెబుతూవున్నా నమ్మటానికి సంకోచిస్తూ వుంటాను. కాని ఈ విషయమై చర్చ అనవసరం. నా చిన్ననాటి విషయం ఒకటి జ్ఞాపకం వస్తోంది. మా మామయ్యతో సహా గురుదాసుగారింటికొకనాడు విందుకు పోయాను. మేము వెళ్ళేసరికి గురుదాసుగారు చాల కోపంలో వున్నాడు. ఆ కోపానికి తలమీద వెంట్రుకలన్నీ నిక్కబొడిచాయి. గంగాస్నానం చేసినంత మాత్రాన పాపాలన్నీ పోతాయన్న మాట తాను విశ్వసించనని ఒక విద్యార్థి అన్నాట్ట. దానితో గురుదాసుగారికి చాల కోపం

వచ్చేసింది. ఆయన బిగ్గరగా కేకలు వేస్తూ, "స్నానం కూడా చెయ్యక్కర్లేదు. కేవలం ఒడ్డుమీద నిల్చుని గంగాదర్శనం చేసుకుని, మనసులో 'గంగ, గంగ' అనుకుంటేనే చాలు; తానేకాదు తన వంశంలో ఏడు తరాలవాళ్లూ శాశ్వతంగా స్వర్గంలో సుఖానుభూతి పొందుతారు. ఇందులో లేశమాత్రమూ సందేహం లేదు. ఈ శాస్త్రబద్ధమైన విషయాన్ని విశ్వసించని వాడు వట్టి పాపాత్ముడు" అంటూ లోనికి వచ్చాడు. నా కప్పుడు చిన్నతనమైనా 'గురుదాసుగారంటే ఇలాంటి వ్యక్తా?' అనిపించింది. వారు పూర్వకాలంలో ఎం. ఏ. ప్యాసైనారు. గణితశాస్త్రంలో ఫస్టున ఉత్తీర్ణులైనారు. పెద్ద వకీలు, గొప్ప జడ్జి, విశ్వవిద్యాలయపు వైస్ ఛాన్సెలర్, చాల ధార్మికుడు, సత్యవాది; ఇతర్లను మోసంచేసే వ్యక్తికాదు. సత్యమని తాను భావించినదాన్నే ఉద్ఘాటిస్తాడు. అందుకనే ఆయన కంత కోపం వచ్చింది. దీన్నే అంధవిశ్వాసం అంటారు. దీన్నే నానా తర్క వితర్కాలద్వారా, ఉక్తిపై యుక్తులద్వారా సత్యంగా స్వీకరించాలి. చదువు సంధ్యలు నేర్చినవారైతే దాన్నే మెరుగులు పూసి చెబుతారు; సాధారణులు మామూలు మాటల్లోనే చెబుతారు. అంతే భేదం. అలాంటివారు గురుదాసుగారంటే

ఈ మాటలన్నీ నీకు చెబుతున్నాననే గాని నాకు భయంగానే వుంది. ఎందువల్లనంటే ఆశ్రమవాసులు చాల కోపదారులని అందరికీ తెలుసు. ఆశ్రమవాసులు మాటిమాటికీ తిట్టొస్తారు, కొట్టొస్తారు. ఏ ఆశ్రమంపట్లా నాకు ఇష్టం ఉండదు. ద్వేషమూ లేదు, కోపమూ లేదు. ఆశ్రమాలన్నీ ఒకటే : శూన్యగర్భాలు. అదిమాత్రం నాకు బాగా తెలుసు.

ఆశ్రమం మాటకేం? మా లక్ష్యం నువు. నువ్వంటే నిజంగా నాకు చాల ప్రీతి. నిన్ను చూడాలనీ, ని పాట వినాలనీ, నీతో చాల విషయాలు మాట్లాడాలనీ కుతూహలం పడుతున్నాను. చాలా వృద్ధుడినై పోయాను. ఇంకా ఎన్నాళ్లో జీవించను. ఒకసారి ఇక్కడికి రాలేవా?....

—శరత్.

౭౧

సామతాబేడ్, పానిత్రాస్ పోస్టు,
30 వైశాఖ 1338.

మంటూ! 'శేషప్రశ్న' చదివి నువ్వు చాల ఆనందించినట్లు రాశావు. నాకు ఆహ్లాదం కలిగింది. ఎందువల్లనంటే—మీరు సాధారణంగా దబ్బున ఆనందించరు. ప్రవర్తక సంఘంవారు (చంద్రనగర్‌లోని ఒక సాంస్కృతిక సంస్థ) ఈయేడు తమ తృతీయ వార్షికోత్సవాలకు నన్ను పిలవలేదు. పుస్తకం చివరి భాగంలో ఆశ్రమాన్ని కీర్తించవలసిందిగా వారు నన్ను కోరారు. కాని చివరకు నేనా పని చెయ్యలేదని తెలుసుకున్నారు. శేషప్రశ్నలో ఆధునిక సాహిత్యం ఎలా ఉండాలో సూచించి విడిచిపెట్టాను. "ఏమైనా చేస్తాను, పట్టుదలతో కంపుకొట్టే విషయాలే రాస్తాను" అన్న మనోభావం ఈనాటి సాహిత్యానికి కేంద్రీయమైన ఆధారంగా లేదు. అందుకుగాను అటువంటి 'మాదిరి' ఒకటి సృష్టించాను. కాని ముసలితనం వచ్చేసింది. శక్తి సామర్థ్యాలు అంతరిస్తున్నాయి. ఇక దాని జవాబుదారీ యావత్తూ మీమీదే వుంది. నీ రచనలన్నింటినీ శ్రద్ధగా చదువుతున్నాను. రవీంద్రుడు నిన్నుగురించి ఉత్తరంలో రాసిన

అన్ని విషయాలూ నిజాలే రచనలో వేగం, ఔన్నత్యం కని పిస్తూనే వుంటాయి. అవి నీ సత్యసాధనా ఫలితాలు; తండ్రి గారినుంచి సంక్రమించిన గుణఫలితాలు తెచ్చిపెట్టుకున్నవి కావు. అతిసహజములు. పాండుచేరీలో కాక కలకత్తాలో కూచున్నా అలాగే రాయగలవు.

మనమంతా బౌద్ధయుగ సంతానం అని అగజిందుడు చెబుతున్నాడని రాశావు. ఆ మాట సత్యమే. ఈ సత్యము నీ రచనలో ఉజ్వలతరంగా ప్రకాశిస్తోంది. కాని ఇప్పుడే నువ్వు చాల జాగ్రతగా వుండాలి. సంభాషణలు ఇంకా చిన్నవిగా వుండాలి, ఇంకా మధురంగా వుండాలి. ప్రయోజనంలేని అక్షరం ఒక్కటికూడా రాయకూడదు. ఇదే కళాకారుని ఆంతరంగిక రహస్యం. చెప్పదలచుకున్నదంతా చెప్పలేకపోయానే అనిపించ వచ్చు మొదట. కాని అక్కడే రచయిత పొరపాటు పడుతో వుంటాడు. పాఠకునికి అర్థం కాలేదని బాగా అర్థమయ్యేట్టు చెప్పాలన్న ప్రయత్నం రచయిత చెయ్యకూడదు. తెలిసిందా? మంటూ రచనలలో తర్కవితర్కాలు ఎక్కువగా వుంటున్నాయి అని అంటున్నారు చాలమంది. పాఠకుడు చదివి కొంచెం ఆలోచించుకుని అర్థం చేసుకోవలసిన అవకాశం ఇవ్వకపోతే అతడు తన బుద్ధి ప్రమాణాన్ని తెలుసుకోలేడు. ఈ సందర్భంలో నాకు చాల కోపం వస్తోంది. నేను సోమరిని, ఉత్తరాలు రాయటమంటే భయం వేస్తుంది. నువ్వు గనక నా దగ్గరేవుంటే నీ పుస్తకంలో సరిదిద్దుకోవలసిన కొన్నిచోట్లు చూపించేవాణ్ణి. చదువుతూంటే అనేక చోట్ల ... ఇక్కడ మాటూ ఈ విధంగా ముగించివుంటే బాగుండేది. అని అనుకుంటూ వుంటాను.

నేను ముసలివాణ్ణైనాను. రచించడం కూడా మానేశాను. ఇక ముందు నవలా సాహిత్యం అధోగతికి దిగజారుతుందేమోనని అప్పుడప్పుడు భయపడుతూ వుంటాను. సంఘంలోని నవ్యసాహిత్యంలో చూపెడితే—దాన్ని అతిసాహసంగా పరిగణించి పోట్లాటకు దిగేవాళ్ళలో నువ్వు లేవు. నీ శిక్షణ, సంస్కారం వేరు.

నువ్వు ఈ మధ్య కొత్తగా రాసిన పద్యాలు చదివాను. చాల బాగున్నాయి ఒక సంగతి చెప్పు; అరవిందుడు వంగ సాహిత్యం చదువుతాడా? ఆయనకు 'శేషప్రశ్న' చదవటానికి ఇస్తే కోపగించుకుంటాడా? ఇటువంటి పుస్తకాలు చదవేందుకాయనకు తీరిక వుండదని నాకు తెలుసు. కొంచెం చదవండని ప్రార్థిస్తే అవమానించినట్లు భావిస్తారా? ప్రవర్తక సంఘానికి కోపం వచ్చింది గాబట్టి భయపడుతున్నాను అటువంటి మహా పండితుని అభిప్రాయం తెలుసుకోగలిగితే నా రచనా విధానం మార్చుకోవలసి వస్తే మార్చుకుంటాను. నవలద్వారా సంఘంలోని వివిధ వర్గాలవారి మానసిక ప్రవృత్తులను తెలుసుకోవాలి అన్న అభిప్రాయాన్ని అరవిందుడు మన్నించడా? ఇటువంటి తేలిక సాహిత్యం పట్ల ఆయనకు ఉపేక్షా భావమా! షోడశీ, రమ, హరిలక్ష్మి ఈ పుస్తకాల్ని నీకు పంపుతాను. నీకు నా ఆశీస్సులు......

—శరత్.

## ౬౨

సామతాబేడ్, పానిత్రాస్ పోస్టు,

౬ భాద్రపదం 1338.

మంటూ! నేను వెంట వెంట జవాబు రాయలేకపోవటానికి కారణం నువ్వు పంపినవన్నీ నేను శ్రద్ధగా చదవలేకపోవటం

వల్ల కాదు. అరవిందుడు అప్పుడప్పుడు ఇస్తున్న సందేశాల్ని, మీ రడిగే ప్రశ్నలకు ఆయన చెబుతున్న సమాధానాల్ని నువ్వు నాకు పంపిస్తున్నావు. శ్రద్ధగా చదువుతున్నాను. వాటినిగురించి ఆలోచిస్తున్నాను. మళ్ళీ మళ్ళీ చదువుతున్నాను. కాని చాల అంశాలు నాకు దురవగాహంగానే ఉన్నాయి. వారి ప్రజ్ఞ (*Consciousness*) ఏయే స్థాయిలో ఉంటే ఆ యా స్థాయి ననుసరించిన సూక్ష్మాతి సూక్ష్మములైన అంశాలను వారు చెబుతున్నారు. అవి నా బుద్ధికి అందటంలేదు. కవిత్వాన్ని గురించి వారు చెప్పిన నిబంధనలు సర్వదా పాటించ దగినవి కావు. నీ వేయే కావ్యాల్ని వారు సర్వోత్కృష్టములని చెబుతున్నారో అవే నీ మిగతా కావ్యాలకన్నా నిమ్నశ్రేణికి చెందినవే నని సోదాహరణంగా నిరూపించవచ్చు. అంతేకాదు ఆ మిగతా కావ్యాలే నీ సర్వోత్కృష్ట రచనలని నా ఉద్దేశం—భావంలో, భాషలో, ఛందస్సులో కొన్ని రోజులనించీ నువ్వు పూర్తిగా సాహిత్యసాధనలో మునిగి వున్నట్టు తోస్తుంది. ఇక నీ సాధన ఫలించి తీరుతుంది.

నా పుట్టినరోజు పండక్కు నువ్వు పంపిన గీతం కవిత్వదృష్ట్యా బాగానే ఉంది. కాని దానికి అతిశయోక్తి దోషం పట్టింది: మొన్న నళినీ సర్కారు (వంగదేశంలో రాజకీయవేత్త) వచ్చినప్పుడు ఆయనతో చెప్పాను: 'మంటూ ఈ గీతాన్ని పాడాలని కోరుతున్నాడు' అని. ఆయన దానికి స్వరంకూర్చించుకు మీ దగ్గరకు పంపుతాడు. నా జన్మదినోత్సవనాడు ఈ గీతాన్ని నీ పేరుమీద ప్రసారం చేయటానికి రేడియో అధికారి అంగీకరించాడు; నళిని పాడతాడు. సరే... నా షోడశి

మొదలైన పుస్తకాన్ని హరిదాస్ చట్టోపాధ్యాయ్ నీకు పంపించలేదా? పంపించమని రాశాను.

ఇంకా కొన్ని విషయాలు రాయాలని ఉందిగాని పోస్టు కట్టివేసే వేళ అయింది.

ఒకమాట: అభిజాత్య వర్గంవారు 'పరిచయ' అనే పేర ఒక త్రైమాసపత్రిక ఆరంభించారు. అందులో నీ మిత్రుడు నరేంద్రనాథ్ (విమర్శకుడు, వంగవాసి కాలేజిలో ఆంగ్ల భాషోపాధ్యాయుడు) 'శేషప్రశ్న' పై విమర్శరాశాడు. దాని సారాంశం ఏమంటే; ఈ పుస్తకం గోరా కొడుకు. (గోరా రవీంద్రుని నవలలో ఒకపాత్ర) 'కమల్' చరిత్ర గోరా చరిత్రకు నకలుట. నూతనత్వం ఏమీ లేదుట. నరేంద్రనాథ్‌కు కన్నులు గౌరవర్ణంగా ఉన్నందువల్ల బుద్ధికూడా మార్జాల బుద్ధిలా తయారైంది. ఇంతకూ చిత్రం ఏమిటంటే... అతను కూడా కమల్ పాత్రను దొంగిలించి ఒక నవల రాస్తున్నాడు. అది అచ్చు ఔతోంది. సొంత పత్రిక కాబట్టి. ఫ్రెంచి, జర్మనీ భాషలు వచ్చునని అతనికి చాల గర్వం.

ఇక క్షేమములేదు నీకు నా ఆశీస్సులు...

—శరత్.

## 63

సామతాబేడ్, పానిత్రాస్ పోస్టు,
విజయదశమి 4 కార్తీకం 1838.

మంటూ! ఈ విజయదశమికి నీకు నా ఆశీర్వాదాలు. చాలరోజులనించీ నీకు ఉత్తరం రాయకుండా ఉన్నందుకు విచారిస్తున్నాను.

నీ 'దోలా' నవల మొదటి పేజీలు కొన్ని పంపిస్తున్నాను. నా యీ కొట్టివేతల వ్యవహారం చూచి నువ్వు విసుగెత్తిపోయి—"చాలు చాల్లే వ్యవహారం! నీ బిచ్చం అక్కర్లేదు, ఏమీ అక్కర్లేదు. నీ కుక్కను ఉసిగొలుపు, నా రాత ప్రతి నాకు వెంటనే పంపించెయ్యి" అని ఈసారి ఉత్తరంలో రాస్తావేమోనని నాకు భయంగా ఉంది.

నీకు మల్లేనే నేనుకూడా...కళ కళకొరకే, ధర్మం ధర్మంకొరకే, సత్యం సత్యంకొరకే...అనే ఇటువంటి సూత్రాన్ని ఒప్పుకోను. కళోపలబ్ధి అందరికీ ఒక రీతిగానే జరగదు. అది ఆంతరంగికమైన వస్తువు. ధర్మం, సత్యం అనేవి కేవలం పదాలు కావు అంతకుమించిన ఒక విశిష్టత వాటికి ఉంది. ఆసంగతి మనం మరచిపోకూడదు. కథారచన ప్రయోజనం చిత్తరంజనమే అని అంగీకరించినా చిత్తము, రంజనము అనే రెండు పదాలున్నాయక్కడ. డాక్టర్ జితేంద్రనాథ్ మజుందారు ఎం, డీక్కీ, మంటూ రామ్‌కూ చిత్తం ఒకేవిధంగా ఉండదు. ఒకనికి ఆనందం కలిగించలేని సన్నివేశం మరొకనికి అమితానందం కలిగించవచ్చు. 'దోభారా' లో పదిహేను ఇరవై పేజీలకంటే అధికం చదవలేకపోయిన ఒక సుశిక్షిత వ్యక్తిని నే నెరుగుదును. పుస్తకం అంతా నే నెలా పూర్తి చెయ్యగలిగానో మరి నాకే తెలియదు. కథారచనకు పాటించాల్సిన నిబంధనలు అందులో ఎంతవరకు అతిక్రమించబడ్డాయో నాకు తెలియదు. తెలుసుకోవాలన్న కోరికా నాకు లేదు. అయినా నాకు ఆనందం, తృప్తి కలిగాయి. ఆ మాట నిజం. ఇక కళ అంటే ఏమిటో నిర్ణయించాలంటే—ఆ సంగతి నాకు తెలీదు. ఆ విషయమై నేను

చెప్పేదేమీ లేదు కాని ఈ యాభై యేళ్ళ వాని మనస్సును సమాధాన పరచటం చాల కష్టం. నువ్వు అనేక విషయాల్ని బాగా ఆలోచించి రాశావు. కాని నవల రాయటానికి వాటి ఆవశ్యకత ఏమీ లేదు అని నేను చెప్పజాలను. కాని నవలా రచన గురించి నాకు తెలిసినంతవరకు...'స్వపన' చరిత్రను పరిశీలించి చూచినమీదట...పుస్తకంలోని అన్ని అంశాలను సమన్వయం కుదిరినట్లు తోచటం లేదు. అదీగాక మొదట్లో చాల భాగం తగ్గించవలసి వుంటుంది. ఆసాంతం రుచి తగ్గకుండా ఉండాలి. మరొక సంగతి: అదేపనిగా రాయటంకంటే రాయకుండా ఉండటమే కష్టం...వంద్యోపాధ్యాయ్ నిజంగా చాల బాగా రాస్తాడు. కాని రాయకుండా వుండే మెళుకువ అతనికీ తెలియదు. ఆ సంగతి నీ కతని రచనలలో బోధపడటం లేదూ! ఆయన పుస్తకాలు చదువుతున్నప్పుడు నేను అనుకుంటూ ఉంటాను: పాపం ఈయనకు 'రాయకుండా ఉండే మెళుకువ' తెలిస్తే బాగుండునే అని. హృదయంలోని ఆవేశం కారణంగా చెప్పదలచుకున్న విషయం ప్రయోజనాన్ని మించి ఒక్క వాక్యం కూడా ఎక్కువ చెప్పకూడదు. ఒక వాక్యం తక్కువ చెప్పటమే మంచిది. చాల భాగం తగ్గించేయవలసి వస్తుందేమో నని నీకు బాధగా ఉండేట్టయితే సాహిత్యవేత్త అయిన ఏ మిత్రుని అభిప్రాయమైనా అడిగి చూడు. ఇంతవరకు నేను కొట్టివేసిన ఆ యా అంశాలను చివరిభాగంలో అక్కడక్కడ జోడించుకోవచ్చు. ఇంతకూ నీ అభిప్రాయం ఏమిటో ముందుగా తెలుసుకుంటే...ఆ తరువాత అవసరమైన చోట్ల కొట్టివేసి త్వరలోనే పంపిస్తాను.

నీ మిత్రుడు నీరేంద్రనాధ్ రాయ్ ఉత్తరాలు చదివాను. నా మీద నీ కెంతో శ్రద్ధ, భక్తి, ప్రేమ వున్నాయి. కాని అందువల్ల అయ్యేదేమీ లేదు. కొండంతగా పెరిగిపోయిన వాళ్ళ గర్వం లేశమైనా తగ్గుతుందన్న విశ్వాసం నాకు లేదు. ఇక పోతే ఆలీ...బాబు సంగతి, అతను ఎంత అధముడో చెప్పటానికి వీల్లేదు. తర్వాతితరాలలో నా పేరు ఆయన పేరుతో ఎక్కడ జోడిస్తారోనని భయపడుతున్నాను. ఆ సంగతి తలపుకు వస్తేసరి వొళ్ళు కంపరమెత్తినట్టుగా వుంటోంది, ఆ వ్యక్తి విషయంలో అంతకన్నా నేను చెప్పదలచుకోలేదు. విదేశీపాలకుల చేతి కీలుబొమ్మలై స్వదేశ సౌభాగ్యాన్ని విస్మరించిన ద్రోహుల జాతికి చెందినవాడే వీడు అని మీరూ ఒకరోజున తెలుసుకోగలరు.

త్వరలోనే త...ను వెళ్ళి కలుసుకుంటాను నువ్వు నాకు ఉత్తరం రాసినట్టు నే నతనితో చెప్పను. నువ్వు సూచించిన విషయం నిజమో అబద్ధమో తర్కించి తెలుసుకుంటాను. త... ఏమంటాడో చూస్తాను. అరవిందుని గురించి నే నా మాట ఎప్పుడూ అనలేదు. దేశమంతా ఆయన పట్ల భక్తి చూపుతోంది. నే నొక్కడినేనా చూపంది? అయినా ఆశ్రమవాసులంటే నా కంత యిష్టంలేదు, అందుకు కారణం త...మాటలు; మిగతా ఆశ్రమవాసులనుగురించినాకుగల అభిప్రాయాలున్నూ. అదీగాక నువ్వు ఆశ్రమంలో చేరటం నాకు చింతగానే వుంది. నువ్వు ఐ. సి. యస్ గాని బి. యల్ గాని ప్యాసుకాలేదని నాకు విచారంగానే వుండేది. కాని సంగీత సాహిత్యాల్ని నీ కర్మక్షేత్రాలుగా చేసుకున్నందుకు ఆ విచారం మరచిపోయాను.

అందరూ పెద్ద పెద్ద సర్కారు ఉద్యోగాల్ని సంపాదించి స్వదేశీయుల్ని జైళ్ళకు పంపిస్తూ ఉంటారు. మంటూ అలా ఎందుకు చేస్తారు. సన్మానాలకేమీ లోపం లేదు. భారతీయ కళా ప్రాశస్త్యాన్ని పాశ్చాత్యుల దృష్టికి తెచ్చి, దాన్ని పాత పద్ధతులలోనుంచి ఉత్కృష్టమైన ఒక కొత్త మార్గంలోకి తీసుకురాగలిగాడంటే దేశాని కంతకన్నా గౌరవం, ప్రతిష్ఠ ఇంకేం కావాలి? విదేశీయులకు 'సింఫొని' అనే వస్తువొకటి ఉందనీ, దాన్ని మన సంగీతంలో కూడా ప్రవేశపెట్టాలని నువే ఒకసారి నాకు చెప్పావు. ఈ పనంతా వొదిలిపెట్టేసి బైరాగుల్లో చేరానన్నప్పుడు నాకొక పెద్దగాయం తగిలినట్టు బాధపడ్డాను, ఈ జీవితంలో మళ్ళీ నేను నిన్ను చూడలేనేమో! అది నా కెంత బాధ కలిగిస్తుందో నీకు తెలుసా? ఆ సంగతి ఇతరులకు తెలిసినా, తెలియక పోయినా నీకు తెలిసే వుంటుంది, అది నాకు చిరంతన దుఃఖహేతువు.

ఒక తమాషా విషయం చెప్పనా? ఒకనాడు ఏదో అర్జంటు పనిమీద బ్యాంకుకు వెళ్ళాను. అక్కడ కేషియర్ వంగదేశస్థుడు, జ్యోతిషం బాగా చదువుకున్నవాడని కూడా విన్నాను. త్వర త్వరగా నా పని ముగించేసి నా జాతకం ఉందా అని అడిగాడు. రాశి చక్రంమాత్రం నా నోటు బుక్కులో ఉందన్నాను. అడిగి తీసుకుని రాసుకున్నాడు. నా హస్తముద్ర కూడా తీసుకున్నాడు. డెస్కులోనించి పంచాంగం తీసి గుణించాడు. చివరకు ఏమిచెప్పాడో తెలుసునా? ఇంకొక్క సంవత్సరంలో నా జీవితపంథా మారిపోతుందన్నాడు. నేను ఆధ్యాత్మిక మార్గానికి దిగుతానట. రాశికుండలిలో ఆసంగతి ఉన్నట్టు

కాశీలో కూడా ఒక పండితుడు చెప్పాడనీ, కాని నాకామాట మీద విశ్వాసంలేదనీ, ఆధ్యాత్మికం అనేది నాలో అసలు ఏమాత్రమూ లేనేలేదని చెప్పాను. సంవత్సరం దాటినతర్వాత మనం మళ్ళీ కలుసుకున్నప్పుడు ఆలోచిద్దాంలెండి." అన్నాడు. సంవత్సరం దాటిన తరువాతకూడా నా నోట అదే మాట వస్తుంది అని చెప్పాను. అతను కేవలం తలఊపి ఊరుకున్నాడు. రాసీకుండలి చూచి లెక్కవేసి ఫలితం చెబుతే అది జరిగి తీర వలసిందేనని ఆయన నమ్మకం.

ఒక సంగతి నీకు ఇదివరకే చెప్పాను. మా వంశానికి సంబంధించిన ఇతిహాసం ఒకటి వుంది. నాసోదరుడు ప్రభాస్‌ను ఎరుగుదువుకదా! అతని తండ్రి, తాత ... ఎనిమిదితరాలనించి సన్యాసాశ్రమం పుచ్చుకుంటూనే వస్తున్నారు. నేను ఒక్కడినే నా స్త్రీకుడుగా తయారైనాను. అనుస్మృతంగా వస్తున్న ఆచారం నాదాకా వచ్చేసరికి తల్లక్రిందైపోయింది. ఇప్పుడీవయసులో ఒకనికింద శిష్యత్వం చేయటానికి నాకు బుద్ధిపోదు. ఆ కేషియక్ మహాశయుడు మాత్రం నేను నిస్సంశయంగా బైరాగినైపోతా నని చెబుతున్నాడు.

మీ అనిలవర్ణబాబు మట్టిని పంచదార చేస్తున్నాడని విన్నాను. ఆశ్రమంలో కావలసిన పంచదార అంతా అతడే సప్లయి చేస్తున్నాడని చెబుతున్నారు. నిజమేనా? నాకు మాత్రం అనుమానంగానే వుంది. అలా పంచదార ఉత్పత్తి చేయగలవాడు ఆశ్రమంలో వచ్చి ఎందుకు వుంటాడు. కలకత్తా వెళ్ళి సునాయాసంగా ఒక పంచదార దుకాణం తెరుస్తాడు.

బారిన్ తరచు కలుస్తూనే ఉన్నాడు. ఇక మళ్ళీ తొందర్లో అక్కడకు వెళ్ళనని చెబుతున్నాడు. మీ 'మదర్' అంటే మాత్రం అతనికి చాల భక్తి. ఆమె ఒక అద్భుతమైన వ్యక్తి అనీ, చాల సూక్ష్మదృష్టిగల ప్రజ్ఞాశీలియనీ చెబుతున్నాడు. ఆమె ఎంత పనినైనా చేయగల శక్తిమతియనీ, తీక్షణబుద్ధిశాలియనీ చెబుతున్నాడు. ఆశ్రమంలోని అందరి విషయాలు ఆమెకు అవగతమేననీ...ఎక్కడ చూచినా ఆమె ఆదేశాలు ఉపదేశాలేననీ చెబుతున్నాడు. అందుచేత కొత్తగా వచ్చిన వాళ్ళు ఆమెను గురించి మొదట రకరకాలుగా అభిప్రాయపడుతూ వుంటారుట. కొందరు తిరిగి వెళ్ళిపోతూ వుంటారుట కూడాను.

'దోలా'లో నేను కొట్టివేసిన ప్రదేశాలు జాగ్రతగా గమనించు. అలా కొట్టి వేసిన అంశాలు చివరిభాగంలో అక్కడక్కడ జోడించవచ్చు. కోపగించుకోకుండా ఆలోచించిచూడు. మరొకసారి నా ఆశీస్సులు.

అనిలవరణబాబు పంచదార తయారు చేస్తున్న విషయం నిజమో అబద్ధమో వెంటనే తెలియచెయ్యి. నిజంగానే తయారు చేస్తున్నట్టయితే జావానించి వచ్చే పంచదారను బాయ్‌కాట్ చేదాం. అది నిజంగా దేశానికి ఎంతో లాభదాయకమైన పని.

—శరత్.

## ౬౪

సామతాబేడ్, పోస్టు పానిత్రాస్,
10 చైత్రం 1339.

మంటూ! నిజంగా ఈసారి అపరాధమే. జాబు రాయటం ఆలస్యం కావటమేకాదు. రెండుసంవత్సరాల క్రింద రైలుపెట్టె

సుమ్మంతగిలి గాయం అయింది. అలాగే ఇంతవరకూ ఈడ్చు కొచ్చాను. కాని రెండు నెలలయింది మంచం ఎక్కాను. ఎక్స్ రే తీయించుకోవటానికి నేను రేపు కలకత్తా వెడుతున్నాను. రవీంద్రజయంతి అయినతర్వాత ఈ రెండు నెలలనించీ రాత్రిళ్లు నిద్ర లేదు. బాధ అంతు లేకుండా వుంది. రాత్రింబగళ్ళు శూలం పెట్టి పొడిచినట్టుగా వుంటోంది. ఇది నయమౌతుందో లేదో! నయమౌతుందన్న ఆశ నాకు మాత్రం లేదు. మళ్ళీ లేవకుండా పడిపోతినా ఒక రకంగా మేలే. మృత్యువు సమీపిస్తున్నట్లే తోస్తున్నది. నీకు ఉత్తరం రాయటం లేదుగాని, నువు పంపు తున్నవన్నీ శ్రద్ధగా చదువుతూనే వున్నాను. మీ నిష్ఠ, గాంభీర్యం, ఆశయం నాకు బాగా నచ్చాయి. ఎందుకు నచ్చాయో కారణం మాత్రం నా కెంత యోచించినా అవ గాహన కావటం లేదు.

నీ 'జలాతంకే ప్రేమబీజ్' అను ప్రహసనం చదివాను. కలకత్తా వెళ్ళి వచ్చాక తిరిగి పంపిస్తాను. చాల బాగుంది. కాని అంత దీర్ఘంగా ఉండకూడదు. తగ్గించాలి. తగ్గిస్తే రస స్ఫూర్తి వస్తుంది. ఈ మాట నీకు సూచించాలనుకున్నాను.

శిశిర భాదుడే అభినయిస్తాడని అతనిమీద భరోసా పెట్టుకుంటే లాభం లేదు. కలకత్తానించి వచ్చాక మళ్ళీ జవాబు రాస్తాను, ఇప్పుడు కలం కదలటం లేదు.

—శరత్.

## ఉ—౫

5 జ్యేష్ఠం 1840

మంటూ! చాలరోజులనించీ నీకు ఉత్తరం రాద్దామని అనుకుంటూనే వున్నాను. కాని రాయలేక పోయాను. ఇవాళ కలం పుచ్చుకు కూచున్నాను. కాస్త రాస్తాను.

(శ్రీ)కాంత అయిదవ భాగం ఆరంభించి పూర్తి చేశాను. అభయ మొదలైనవారి గాథ. నాలుగో భాగం బాగుండ లేదని విరాంంటేమాత్రం రథం అక్కడే ఆపేస్తాను.

ఇక్కడ నా సొంత విషయం కాస్త చెప్పాలి. సాధారణములు, సహజములు అయినసంఘటనలు మాత్రమే తీసుకుని ఈ అయిదోభాగం పూర్తి చెయ్యాలని నా అభిప్రాయం. సూచ్యార్థంగా రాయగల నేర్పుద్వారా ఎక్కడి కక్కడే క్లిష్ట పరచి రాస్తూ ఎంతవరకు రససృష్టి చేయటానికి వీలుంటుందో చూస్తాను. ఉపాదాన- ఉపకరణాలతోగాక, అసాధారణ సంఘటనలతోగాక, అతి సాధారణములైన రోజువారీ గ్రామజీవిత సన్నివేశాలతోనే ఈపుస్తకం నింపివుంటుంది. విస్తృత వర్ణనలు ఉండవు. గాంభీర్యం ఉంటుంది. పుంఖాను పుంఖంగా వర్ణనలు ఉండవు. సాహిత్యసంయమమే గోచరిస్తుంది. కేవలం రసికుల ఆనందంకోసమే రాస్తాను. ఒకవేళ నవల బాగుండక పోవచ్చు. కాని సాహిత్యసంయము లేని విశృంఖల రచనగా మాత్రం ఉడదు. ఈ విషయంలో నీ అభిప్రాయం ఏమిటో తెలుపు.

సర్వతోముఖము, సుదూర ప్రసృతము అయిన నీ విజ్ఞానం ఆశ్రమంలో చేరినతరువాత గంభీర్యం, అగాధము, అంతర్ముఖం అయింది. నిజంగా అయింది. ఈ విషయాన్ని నేను కొన్నాళ్ళ నుంచీ గమనిస్తూనే ఉన్నాను. నీజ్ఞానం, పాండిత్యం వినయభూషి.

నా లేఖలు ఆంతరంగికములైనాయి. స్వయంగా నువ్వు ఆఘాతం తిన్నప్పటికీ నీ పాండిత్యపు లాఠీ విసరి ప్రతీఘాతం చెయ్యలేదు. ఈ సంయమం పరిశీలిస్తున్నకొద్దీ...మంటూ నా వాడేనన్న ఆనందంలో ముగ్ధుడినైపోతున్నాను. సామర్థ్యం ఉన్నప్పటికీ అతడు నిర్లిప్తంగా ఉదాసీనభావమే చూపుతున్నాడు; కోపం తెచ్చుకుని ఇతర్లమీద దాడి చెయ్యడు; ఇతర్లను అవమానించడు. అతనికేమీ భయంలేదు; అతని మిత్రులకు లోటులేదు. అతని సభ్యత అతనికి ఏడుగడ. మాటూ...కొందరు సాహిత్యసేవకులై ఉండి కూడా తోటివాళ్ళను అవమానిస్తూ ఉంటారు. అలాంటి వాళ్ళంటే నాకు చాలా భయం. ఇతర్లను తుచ్ఛులుగా నిరూపిస్తే తప్ప తమ గొప్పతనం బయటికి రాదనుకుంటారు వాళ్ళు.

"పుష్పపాత్ర" మాసికపత్రికలో నీ రచన చూచాను. అనేకవిషయాలు రాస్తూ బూ...గారికి స్త్రీలంటే ఉన్న విద్వేషాన్ని సకారణంగా ఖండించావు. రచనలో నీ హృదయ సంక్షోభం కనిపించింది. నీకు అతనియెడల స్నేహం ఉంది. ఎక్కడ అతనిమీద తీవ్రమైన దెబ్బతీస్తావో అని నేను సంకోచిస్తూనే చదివాను. కాని నువ్వు ఇంకా లోతులు వెదకి తెలుసుకోవలసిన అంశాలు ఉన్నాయి. స్రష్ట అల్పుడైనప్పుడు అతని సాహిత్యసృష్టి గొప్పది కాజాలదు... అని ఎవరో అన్నారు. దీన్ని నేనూ విశ్వసిస్తున్నాను. "ఒక మెస్‌లో సావిత్రిలాంటి పరిచారిక దొరికితే నే నెప్పుడూ మెస్‌లోనే ఉంటాను" అని రాశాడు బూ...కాని మెస్‌లో ఉండటమే చాలదు, తాను సతీశ్ వంటివాడుకూడా కావాలి, లేకపోతే సావిత్రి హృదయాన్ని ఆకర్షించలేడు, ఆమరణాంతం మెస్‌లోనే పడివున్నా సరే. అదీ

గాక సావిత్రి కేవలం పరిచారికల వర్గానికిచెందిన వ్యక్తి కాదని అతనికి తెలియలేదు. ఒకప్పుడు లక్ష్మీదేవికూడా దురదృష్ట వశాత్తు ఒక బ్రాహ్మణునియింట దాసీగా ఉండాల్సి వచ్చిందని పురాణాల్లో రాశారు. అర్జునుడు ఒకప్పుడు ఉత్తరకు సంగీతం నాట్యం నేర్పాల్సివచ్చింది. అటువంటి ఉపాధ్యాయుడు దొరికితే ఆడపిల్లలంతా అతని దగ్గరే సంగీతం, నాట్యం నేర్చుకుంటేం మకు ఉబలాటపడతారు అని మనం అనాల్సిందేనా ? సాంప్రదాయాల్నిబట్టి వేశ్యలలోకూడా ఉచ్చనీచాలు ఉంటాయి. ఒక వేశ్యదగ్గర మరో వేశ్య దాసీగా వుంటుంది. అప్పుడా యిద్దరి వ్యవహారం ఒకటేనా ? దాసీదాన్ని అనుభవించాలంటే కొంచెం ఖర్చుతో వెళ్ళిపోతుంది దాని యజమానురాల్ని తెలుసుకోవాలంటే చాల ఖర్చు చేయాల్సి వుంటుంది; తేలిగ్గా దొరకదు. ముఖానికి పౌడరు పులుముకుని వరండాలో వచ్చి నిల్చోదు. నువు మధురభాషిణి అయిన రాజలక్ష్మి పాత్రను సృష్టించావు. ఆమె దర్శనం అందరికీ దొరుకుతుందా ? ఎన్నెన్నో ఉపకరణాలు కావాలి; ఎంతో ప్రయత్నం చెయ్యాలి. సొంత డబ్బుగాని; మిత్రుడైన ఒక రాజకుమారుని డబ్బుగాని బోలెడంత ఖర్చుచెయ్యాలి అప్పుడుగాని ఆమె మేడమీదికి అడుగుపెట్టే అవకాశం ఉండదు. దారినపోయే పురుషుని చెయ్యిపట్టుకుని పెంకుటింట్లో లాక్కుపోయే చౌకపారు స్త్రీ పరిచయం తేలిగ్గానే లభిస్తుంది — బీదవాని అనుభవం మేడ మీదకాదు, కింది వసారాలోనే కాబట్టి అతడు శ్రీకాంతుని సామాన్యస్త్రీనే అర్థంచేసుకో గలుగుతాడు. ఈ ఉదాహరణ లన్నీ అనవసరంగా చెప్పానేమో ! రాస్తుంటే నాకే సిగ్గుగా

ఉంది. ఇంతకూ స్త్రీ జాతిపట్ల విద్యాభావాన్ని ప్రచారం చెయ్యటమే ఆదర్శవాదం అనుకునేవారు నిజానికి ఆదర్శవాదులూ కాదు, యదార్థవాదులూ కాదు. వారిది కేవలం కల్పన, అర్థంలేని స్పర్థ, అజ్ఞానజనితమైన అహంకార స్త్రీలతో యుద్ధం చేద్దామన్న స్పిరిట్ (స్లోగం)తో సాహిత్య సృష్టి కానేరదు. నీకు నా ఆశీస్సులు సాహనా కలిస్తే నా ఆశీస్సులు అందించు.

—శరత్.

## ౭౭

సామతాబేడ్, పానిత్రాస్ పోస్టు,
10 భాద్రపదం 1340.

మంటూ... నీ ఉత్తరం చేరింది. శ్రీకాంత నాలుగవ భాగం మీద నువుపంపిన విమర్శనా వ్యాసం కూడా చేరింది. వ్యాసం పెద్దదిగా వున్నట్లనిపించింది మొదట అక్కడక్కడ తగ్గించాలేమో ననిపించింది. కాని రెండోసారి చదివినమీదట తగ్గించాల్సిన అవసరం ఏమీ లేదని నిశ్చయించాను. ఈ వ్యాసం నా పుస్తకం మీద రాసింది కాబట్టి నాకింతగా నచ్చిందికామోలని చాలసార్లు అనుకున్నాను. కాని నువ్వు ఇటువంటి విమర్శనా వ్యాసం ఏ యితర్ల పుస్తకంమీద రాసినాసరే నాకు ఆనందమే కలిగిస్తుందనిపించింది. చాలసేపు ఆలోచించిన మీదట. విమర్శించిన రీతిలో మాధుర్యము, సహృదయత కనిపిస్తున్నాయి. విమర్శన చక్కగావుంది, న్యాయంగా కూడా ఉంది సహృదయులైన పాఠకులందరికీ నచ్చుతుంది. అదీగాక కథోపకథనంలాగ మంచి శైలిలో రాశావు. మంటూ... ఒక

చక్కని రచనాపద్ధతిని కనిపెట్టావుసుమీ. ఆ రీతిగా రాయక పోతే ఆ వ్యాసాన్ని...ఎంతబాగున్నప్పటికీ... ప్రజలు ఓపిగ్గా చదవరు – చదువుతూంటే ఒక చక్కని కథలా ఉంది. ఈ వ్యాసాన్ని ఏ మాసపత్రికైనా పంపుతాను ప్రచురణకు, అందులో ఎక్కడా వాక్యాలు తీసివేయవద్దని కూడా సంపాదకునికి రాస్తాను – కాని ముందుగా నీకు ప్రూఫ్ పంపటం సాధ్యపడుతుందో లేదో చెప్పలేను. వీలుపడితేమాత్రం పంపించే యేర్పాటుచేస్తాను.

'శ్రీకాంత' చతుర్థభాగం నీకింత గొప్పగా నచ్చినందుకు నే నెంతగా ఆనందిస్తున్నానో మాటల్లో చెప్పలేకుండా వున్నాను. ఆ భాగం సహృదయులైన పాఠకులకు ఎంతో మనోహరంగా వుండాలన్న ఉద్దేశంతోనే చాల కష్టపడి శ్రద్ధగా రాశాను. అదృష్టవశాత్తు 'శ్రీకాంత' కు నీ వంటి పాఠకుడు ఒకడైనా దొరికినందుకు నేను చాల ఆనందిస్తున్నాను. ఇంకెవరు చదివినా సరే, చదవకపోయినా సరే, నాకు విచారం లేదు. నువు చాల సంవత్సరాలనుంచీ అనేక భాషల్లో అనేక ఉత్తమోత్తమమైన గ్రంథాలు చదువుతూ వున్నావు. అయినా నా వంటి ఒక మూర్ఖుడు రాసిన పుస్తకం కూడా చదవటానికి నీకు తీరిక లభించిందంటే...నా కాశ్చర్యంగా వుంది. నే నొక క్షుద్ర సామాన్య స్థాయికి చెందిన రచయితను. నాకు తెలుసా సంగతి. నేను విద్యావంతుణ్ణి కాను, పండితుణ్ణి కాను. పల్లెటూరి వాణ్ణి. మనసుకు ఏది తోస్తే అదే రాస్తాను. అందుచేతే ఈనాటి పండితులు, ప్రొఫెసర్లు నన్ను విమర్శిస్తూ వుంటే సమర్థించుకోలేక నోరుమూసుకు కూచున్నాను. వాళ్ళముందు

నేను లెక్కకురాని ఒక సాధారణ వ్యక్తిని. ఇటువంటి పరిస్థితిలో నీ వంటి మిత్రుని ప్రశంస లభిస్తూవుంది. నేను చాల గర్వపడుతున్నాను – ఆ పండితులందర్నీ మించిన పండితుడివి నీవసలు. నీ వ్యాసం నాకు కొండంత అండ, నాకు ఒక ఓదార్పు.

చాలరోజులైంది నిన్నుజూచి. ఒకసారి చూడాలని కోరిగ్గావుంది దసరాకు ఒకవేళ నేను పాండుచేరీ వచ్చేట్టయితే నేనక్కడ రెండు మూడు రోజులుండటానికి వీలుంటుందా? ఆశ్రమంలోనే ఉండాలన్న నియమం లేదని నాకు తెలుసు. అక్కడ ఏదైనా హోటల్ ఉందా? ఉంటే నాకు వెంటనే తెలుపు.

—శరత్.

## ౬౨

సామతాబేడ్, పానిత్రాస్ పోస్టు,
19 మాఘం 1340

మంటూ ... చాలరోజులనించీ నీకు ఉత్తరం రాయలేదు. ఇవాళ ఉదయం లేవటంతోనే నీకు ఉత్తరం రాయాలని ప్రబలమైన ఇచ్ఛ పొడసూపిందింది. ఎందువల్లనా అని ఆలోచిస్తున్నాను. బహుశః ఖరీద్ పురపు దినేశబాబు సంగతి అనుకుంటాను. నేను ఫరీద్‌పూర్ వెళ్ళి మూడురోజుల క్రితం తిరిగి వచ్చాను. అక్కడ సాహిత్య సమ్మేళనం జరిగింది – మునిసిపాలిటీవారు అడ్రసు ఇచ్చారు. వేదికమీద ఒకరు సుదీర్ఘము భావగర్భితము అయిన వ్యాసం చదువుతున్నారు. సభలో 'అనామీ'నిగురించి వ్యాఖ్యానాలు బయలుదేరాయి. నూటికి డెబ్బయిమంది దాన్ని అసహ్యించుకుంటున్నారు. ఇంతలో

ఒక సజ్జనుడు "నేను 'అనామిా' పుస్తకాన్ని మొదటినించి చివరదాకా నాలుగుసార్లు చదివాను. ఇంకా నాలుగుసార్లు చదవాలనిపిస్తున్నది" అన్నాడు అప్పుడు—

"అదేమిమాట దినేశబాబు! మీారు శరీన్ పుంపు లాయర్లలో రత్నంలాంటివారు. ప్రచండ తార్కికులు మీారు. మీాకీ దౌర్బల్యం ఏమిటి?

"దినేశబాబూ! మీాకు మతేమన్నా చెడిపోయిందా యేమిటి?"

"దినేశబాబూ! చూస్తున్నానుగా! మీారు ప్రపంచంలో ఎనిమిదో ఆశ్చర్యం (*Eighth Wonder*)లా వున్నారే?"

ఇలా చాల మాటలు వినిపించాయి.

నేను మూగవాడులా కూచున్నాను. ఏమిా మాటాడలేను. ఆ తరువాత దినేశబాబు నేను ఒంటరిగా వున్నప్పుడు కలుసుకుని "శరత్ బాబూ! అన్ని పుస్తకాలూ అందరికోసమూ రాయబడవు — నేను శాంతదాసు బాబాజీగారి శిష్యుణ్ణి వైష్ణవుణ్ని. భగవంతుడంటే నాకు విశ్వాసం వుంది — ఉలీప బాబు కొన్ని అసాధారణ భావాలచేత ప్రేరితుడై కవిత్వం రాశాడు, నాకు సమయం దొరికినప్పుడల్లా చదివి పరవశం పొందుతూ వుంటాను — నాకా కావ్యం ఎంతగా నచ్చిందో ఇతర్లకేం తెలుస్తుంది?" అన్నాడు. ఆయన నిష్కపటంగా సత్యం చెప్పాడు. నువు ఏ తీగను శృతిచేశావో ఆయన హృదయంలోకూడ అదే తీగ మోగింది; ఎవరి హృదయంలో ఆతీగ శృతి కాలేదో వాళ్ళు ఆ పుస్తకాన్ని నాలుగైదుసార్లు చదివిన వాళ్ళనుచూచి ఆశ్చర్యపడి మాత్రమే ఊరుకోరు, దుర్భాష

లకుకూడా దిగుతారు. దూషణ ఎంత ఎక్కువగా వుంటే అంత గొప్ప సమర్థులైనవిమర్శకులమని అనుకుంటూ వుంటారు. ఇదీ వ్యవహారం, చూస్తున్నానుగా.

కొద్దిరోజులనుంచీ నీకొక విజ్ఞప్తి చేద్దామనుకుంటున్నాను. ఆ... బాబు రచనలు గురించి అతనికి నీమీద విశ్వాసం వుంది. నువ్వుచెబితే అతను ఏమాత్రమైనా వింటాడు. సాహిత్య సంయమం అతన్నికూడా నేర్చుకోమని చెప్పు. సాహిత్యసంయమం అనేది ఒకరకంగా సహజంగా వుత్పన్నమయ్యే టువంటిది. అదిలేనివాడు మరొకనికి తెలియజెప్పటం కష్టం, ఇతర్ల రచనలనే పునరుద్ధరించటం విసుగు పుట్టిస్తుంది— అనేవిషయం అతనికి తెలియజెప్పు ఫలానా రచయిత "......" ఈమాటలతో నే నంగీకరిస్తున్నాను, వారి "......" ఈ వాక్యాలు చాల బాగున్నాయి—అంటూ ఇలారాస్తే ఏం ప్రయోజనం? ఇలాంటి రచనద్వారా..." చూడండి, నేనెంత చిన్నవయసులో ఎన్నిపుస్తకాలు చదివానో! నాకెంత తెలుసునో!" అని బడాయి చెప్పుకున్నట్టుగా వుంటుంది. మంటూ నీరచనలలోనించి అతడు ఎత్తితీసి వుదహరించిన వాక్యాల్ని ఒకసారి చదువుకోమని చెప్పు. ఆ... బాబు ఇంకా చిన్నవాడు ఇప్పుడే అతనికి తెలియజెబితే కొంతఫలం వుండకపోదు. ఇలా ఎత్తిరాయటంవల్ల నిన్ను అనుకరించగలనని అనుకుంటూన్నాడు కామాలు. అది సాధ్యమైన పనికాదు. ఇంకా అనేక రకాల అసంయమం కనిపిస్తుంది అతని రచనలో ఒకవేళ బూ... బాబునే అతడు సాహిత్యంలో ఆదర్శకంగా పెట్టుకున్నట్టయితే ఆ అసంయమం అలా వుండిపోవలసిందే — మార్చటం చాల

కష్టం ఈ మాటలన్నీ నీకు చెప్పలేక చెప్పలేకనే చెబుతున్నాను. మంటూ, రచనలో సంయమం అలవరచుకోటం అన్నింటికన్నా చాలా కష్టం తేలిగ్గా రాయటానికి వీలైనదాన్ని రాయకూడదు. రచనలో ఈ సంయమగుణం కనిపించినప్పుడే రసికుడైన పాఠకునికి సంతృప్తి కలుగుతుంది పోనీ ఆమాట నేను రాసిన ఆలేఖ 'స్వదేశీ ఓ ప్రచారక్'లో ప్రచురితమైన తరువాత ఆ కవి నాకొక వృత్తాంతం రాశాడు. ఆ వృత్తాంతం చివర "నామీద నువ్వు అనేకసార్లు తీక్షణమైన భాష వుపయోగించి దాడి చేశావు. కాని నేను కోపం తెచ్చుకుని నిన్ను పరోక్షంగా నిందించి కశి తీర్చుకోటానికి ప్రయత్నించ లేదు. నన్ను నిందిస్తూ రాసిన వ్యాసాలలిస్టులో ఈ రచనకూడా ఒకటి అని రాశాడు.

ఈ లేఖ రాసి నేను చాలా అన్యాయం చేశానని ఒక నాడు ఉమాప్రసాద్ (శ్యామ్‌ప్రసాద్ ముఖర్జీ అన్నగారు) కూడా అన్నాడు. ఆలేఖలోని ప్రతి పంక్తిలోనూ విషం వుందిట. కాని నేనేం చెయ్యను. రాసింది ప్రచురితమై పోయింది. కవితో నాకు విరోధం వచ్చేసింది. కాని ఇదే విషయం పై 'స్వదేశ్'లో నువ్వు రాసిన లేఖ చాలా బాగుంది. నువ్వు విచారం మాత్రం వెళ్ళబుచ్చావు. కోపమేమీ ప్రకటించలేదు. ఆపనే నేనూ చేయలేకపోయాను. అదేమిటో మరి అతని 'పరిచయం' చదివే సరికి వొళ్లు మండిపోయింది. అప్పుడు కలం, కాగితం తీసుకుని రాసేశాను.

'శ్రీకాంత్' నాలుగో భాగంమీద విమర్శ 'విచిత్ర' పత్రికలో చదివాను. అది 'శ్రీకాంత్'మీద గాక మరొక

పుస్తకంకూడా పిమ్మట అయివుంటే ముక్తకంఠంతో నిన్నెంతగానో పొగిడి వుండేవాణ్ణి. రచన నిజంగా చాలా బాగుంది. నిజంగా పుస్తకం చదివి అర్థంచేసుకున్న వ్యక్తి తన ఆనందాన్ని అభివ్యక్తం చేసినట్టుగా వుంది.

నేను ఉత్తరాలు రాస్తున్నా, రాయకపోయినా నువ్వుమాత్రం మామూలుగా రాస్తూ వుండు. నీ దగ్గరనుంచి ఉత్తరాలు వస్తూవుంటే నాకు తృప్తిగా వుంటుంది. మిత్రుడు సురేన్ మైత్ర (శిబపూర్ ఇంజనీరింగ్ కాలేజి ప్రొఫెసరు— అతని యింటికి మనం అప్పుడప్పుడు వెడుతూ వుండేవాళ్ళం) అతనుకూడా అరవిందుని భక్తుడే నువ్వు నాకు పంపిన రచనలన్నీ (నేను నీకు తిరిగి పంపకుండా నాదగ్గర వున్నవాటిని) తనకొక సారి చదవటానికి పంపమని అడుగుతున్నాడు. పంపుతానని చెప్పాను. నువ్వు కోపపడకు సుమా! సురేన్ బ్రహ్మసమాజానికి చెందిన వాడైనా మనిషి మంచివాడు.

—శరత్

## ౬౮

సామతాబేడ్, పానిత్రాస్ పోస్టు,
20 మాఘం 1340.

మంటూ... ఇప్పుడే నీ రిజిస్టర్ ఉత్తరం చేరింది.

1. 'గంగేశ్ పరశ్' పంపించు రెండుమూడు పుటలు చేతనయినంతవరకు రాస్తాను. కాని ముందుగానే చెబుతున్నాను కథ, నవల అయితే తప్ప మరింకేమీ రాయలేను. భాషాపాండిత్యం తక్కువ కావడం చేత వ్యాసం రాశానంటే అప్రశంసనీయంగా తయారౌతుంది. నేను ఉత్తరాల్లో రాస్తున్న భాష

చూస్తున్నావుగా! అనాడు 'స్వదేశ్'లో ఆ కవిని గురించి రాసిన వాక్యాలు ఎంత కఠినంగా ఉన్నాయో! కాని నా ప్రాథమికమైన భాషలో ఆనందం ప్రకటించాలన్న లోభం అణచుకోటం కష్టం. అందుకోసమే రాస్తాను. నన్నెవరూ అడ్డగించలేరు.

2. హీంకేన్ విషయం అనాటి ఉత్తరంలో తెలిపాను. 'అవానినా'ని గురించి సమాలోచన జరిగే సభలో పాల్గొంటాను.

3. 'శ్రీకాంత్' నాలుగో భాగంమీద నువ్వురాసి 'విచిత్ర'లో ప్రచురించిన విమర్శ అందరూ చదివి తీరుతారు. అయినా 'కంకేల్ పాశ్'తో పాటు ప్రచురించటం బాగుంటుం దని నా ఊహ. ఇంకెవరి అభిప్రాయమన్నా అడిగి తెలుసుకో.

"పథకే దాబీదార్"ను గురించి సమీక్ష రాయకుండా ఉండటమే మంచిది. ఇప్పుడు ప్రభుత్వ నిబంధనలు చాల కఠినంగా వుంటున్నాయి. అనేకపుస్తకాల్ని ప్రభుత్వం నిషేధించుతోంది.

నువ్వు ఇప్పుడు రాస్తున్న... రెండు మూడు నెలల్లో ముగియవచ్చు ననుకుంటూన్న నవల ఇదివరకు వాటికన్నా చాల బాగుండవచ్చు. కథాసంవిధానం ఎలావున్నా భాష సహజంగా వుండాలి. విషయగత చర్చలు స్వల్పంగా వుండాలి; ఒకేచోట కుప్పలుగా వుండకూడదు, మొదటి అధ్యాయంలో కొంత, రెండో అధ్యాయంలో కొంత... అలా పల్చపల్చగా వుండాలి—ఉపమాలంకారాలు, వుదాహరణలు రవీంద్రుడులాగ నిరర్థకంగా, అసంబద్ధంగా ఇమిడించరాదు. మనిషిని సొమ్ములతో అలంకరించటం, నగల దుకాణంలో 'షోకేసు' అమర్చటం రెండూ ఒకే పద్ధతిలో వుండవు. ఈసంగతి బాగా జ్ఞాపకం పెట్టు

కోవాలి గనక వాటిలో అలంకారాలు విస్తృతంగా వుంటే పాఠకు డికి చాల పీకగా వుంటుంది, ఇంతటితో ముగిస్తున్నాను. వుప దేశాలు వుచితంగా చాల ఇస్తున్నాను. సాహిత్య సంయమ పాఠాలు చదువుతున్నా నేనెతా అందరికన్నా నేనే అసంయమి నౌతున్నాను. నీకు నా ఆశీస్సులు.

—శరత్.

౬౫

566 మనోహరపుకర్, కాళీఘాట్, కలకత్తా,
8 జ్యేష్టం 1342.

మంటూ... మొదట నా పరిస్థితి చెబుతాను మొన్న యింటిపించి తిరిగిరాగానే తలనొప్పి ఆరంభమైంది. బుద్ధదేవ భట్టాచార్య, డా. కానాయిలా గంగూలీ కూచుని వున్నారు. ఎవరితో ఆసుపత్రికి ఫోనుచేసి మాట్లాడుతున్నారు. బిధాను డ్రైవరును పిలిచి కారు సిద్ధంగా వుంచమని చెప్పారు. అంటే నేను నెత్తురు ఒత్తిడి (Blood pressure) ఎంత వుందో చూపించుకోటానికి వెళ్ళాలన్నమాట. ఒత్తిడి అధికం కాకుండా వుంటే సరేసరి. ఒత్తిడి అధికం అయితేమాత్రం పరమానం దంగా మంచం మీద పడుకుని కాలక్షేపం చేస్తాను. అంతకంటే నాకు ఆనందకరమైన, విశ్రాంతికరమైన పరిస్థితి ఎప్పుడొస్తుంది? భగవంతుడలాగే చెయ్యాలి పాపం...

నువ్వు రాసిన వృత్తాంతం నాకు బుద్ధదేవ్ చేత చదివించుకున్నాను. మిగతా సగాన్ని ఎప్పుడైనా ఫ్రెంచిభాష వచ్చిన మిత్రుడు సంభవిస్తే చదివించుకుంటాను.

మంటూ... ఈ క్షుద్రమైన 'నిష్కృతి'ని పుచ్చుకొని యుద్ధరంగంలో దూకటం......సినారేకు కత్తి పుచ్చుకుని

దున్నపోతుల్ని నరకటానికి ప్రయత్నించటం లాంటిది నిజంగా నీకంతబలం లేదు. కేవలం నీకు నీ గురుదేవుల ఆశీర్వాద బలం వుంది. నామీద నీకు నిష్కపటమైన ప్రేమ భక్తి వున్నాయి. నాద్వారా నీకు లభించిన బలం మాత్రం ఏమీ లేనట్టే వుంది.

నువ్వు 'శ్రీకాంత్'ను అనువదించటానికి (ఇంగ్లీషులోకి) ఎందుకు సంకోచిస్తున్నావు ? అనువాదం నువ్వే చెయ్యాలి. ఆనాడు భవానీని పిల్చి 'శ్రీకాంత్' నాలుగో భాగం ఇచ్చి అందులో ఏదైనా ఒక ప్రకరణం అనువదించమని చెప్పాను. పద్దెనిమిది రోజులైన తర్వాత తాను రాకుండా ఉత్తరం రాశాడు. తనకు శక్తి చాలదన్నట్టుగానే సూచించాడు. పైగా అతని ఉత్తరంలోని ఇంగ్లీషు చూస్తే ఆమాట నిజమే ననిపించింది. చేతకాదని నిజమే రాశాడు. ఒకవేళ అతను రాసినా వార్తా పత్రికల భాష రాస్తాడు సోమనాథ్ మైత్రి రెండో భాగం అనువదించటానికి పూనుకున్న సంగతి నాకు తెలియదు. 'సచిత్ర' పత్రికకు సంబంధించిన వుపేన్ ఆ యేర్పాట్లేమన్నా చేశాడేమో ! కనుక్కుంటాను. నువ్వుతప్ప ఇంకెవరూ ఈపని చెయ్యలేరనే నానమ్మకం 'నిష్కృతి'ని నువ్వు అనువదించావు. అంతకన్నా బాగా ఎవరు అనువదించగలరు ? 'శ్రీకాంత్'ను అనువదించవలసిందిగా నిన్నుకోరటం నాకిష్టం లేదు — ఎందువల్లనంటే అది చాల భారమైనపని. దానిమూలాన నీ సొంత పనులకు ఆఘాతం కలుగుతుంది.

'నిష్కృతి' విషయంలో ఏ యేర్పాటుచేస్తే బాగుంటుందని నీకు తోస్తుందో అలాగే చెయ్యి నేనిక్కడ చిన్న కథల్ని అనువాదం చెయ్యటానికి ప్రయత్నిస్తాను— పండిత

మహాశేయుని అనువాదం నాదగ్గిరే వుంది. దాన్ని చూస్తే నువ్వు చాల నిరాశపడతావనుకుంటాను. ఆయనను నేనింకెప్పుడూ కలుసుకోలేదు. రెండుమూడు రోజుల్లో కలుసుకుంటాను — నీకు నా ఆశీస్సులు. మిగతా సమాచారాలు బుద్ధదేవుని ద్వారా నీకు తెలుస్తాయి.

—శరత్.

## ౮౦

౨౬౬, మనోహరపుకుర్ కలకత్తా,
3 మాఘం 1341

మంటూ! నిన్న రాత్రే స్వగ్రామంనించి తిరిగివచ్చాను. రాగానే నీ ఉత్తరం చూచాను. ఒక్కొక్క అంశమే తీసుకుని వరుసగా జవాబు రాస్తాను.

1. 'నిశికాంత' చిత్రపటం చాల చక్కగా వుంది. చాల రోజులకు నీ ముఖం చూశాను, చాల ఆనందం అయింది. ఇప్పుడు నిన్ను చూడాలని మరింత కుతూహలంగా వుంది. కాని ఆశ వదులుకున్నాను. ఈ జీవితంలో నిన్నిక చూడలేననిపిస్తోంది.

2. టైపురైటర్ సక్రమమైన స్థితిలో నీకు చేరిందని విని చాల సంతోషించాను. అది ఆశ్రమం చేరేలోగానే ఏ భాగం ఎక్కడ పాడౌతుందోనని భయపడ్డాను. ఆనాడు హాకిన్స్ వచ్చి 'మంటూ అన్నయ్య టైపురైటరు పాతదై పోయిందిట. కొత్త మిషను కావాలని రాశాడు' అని చెప్పాడు. 'అయితే వెంటనే కొని పంపిచెయ్యి' అన్నాను. అంతా శ్రమా అతనే పడ్డాడు. నేను కేవలం జడపదార్థాన్నేగా! నా పిల్ల, పక్షీ

అవను. డబ్బుకు 'చెక్కు' మాత్రం రాసి యిచ్చాను నీ కా మిషన్ వచ్చిందని విని చాల సంతోషించాను. అంతకన్నా నాకు ఆనందదాయకమైన విషయం మరేము యుంది. తన సర్వస్వం త్యాగంచేసిన వ్యక్తికి ఏదో ఇవ్వటం ఇవ్వటం కాదు, పొందటమే, నాకు నీ వద్దనించి చాల లభించింది. చాలానే...

3. శ్రీ అరవిందుని స్వహస్త లిఖితమైన ఉత్తరాన్ని భద్రంగా దాచి వుంచుకున్నాను. అది ఒక రత్నం.

4 నిష్కృతి అనువాదం చాల చక్కగా వుండేట్టు నువ్వు చేతనైనంతగా ప్రయత్నించావని నమ్మకమే. నీకు నా మీద చాల ప్రేమ వున్నందు వల్ల కాదు. యథార్థసన్యాస వ్రతం పుచ్చుకున్నవారి స్వభావమే అలా వుంటుంది. వీలుగాకపోతే చెయ్యనే చెయ్యరు. చేస్తేమాత్రం లోటుపాట్లు వుండేలాగ చెయ్యరు.

5. శ్రీ అరవిందుడే స్వయంగా పర్యవేక్షిస్తూ వన్నారు కాబట్టి అనువాదం బాగానే వుండచ్చు. కాని మంటూ! పుస్తకంలో నాకు సంబంధించిన గుణం ఏముంది? అది అరవిందునికెలా నచ్చిందో నాకు బోధపడటం లేదు. నచ్చకపోతే ఆశ్చర్యపడేవాడినికాదు, విచారపడేవాడినికాదు. నువ్వు 'శ్రీకాంత్'ను ప్రచారం చేయగలిగితే...పాశ్చాత్యులు ఒక వంగ నవలా రచయితను శ్రద్ధాభక్తులతో చూడగలరని నే వాశించగలను, నువ్వు ప్రయత్నం చెయ్యగలవు. అరవిందుని ఆశీర్వాద బలం వుంది. ఈ అసంభావ్యమే ఒకనాడు సంభవంకావచ్చు. నాకు అనిపిస్తుంది.

6. అనువదించే విషయంలో పూర్ణ స్వాతంత్ర్యాన్ని నీకు ప్రసాదించాను—నువ్వు కేవలం అనువాద కర్తవేగా

స్వయంగా గొప్ప రచయితవుకూడా కాబట్టి నిన్ను నిందించే వాళ్ళు, కించపరచేవాళ్ళు వున్నారు. వుండనీ వాళ్ళకు చేష్టలు చూస్తూ నేవున్నాం. అయినా నీ ప్రతిభ, సాధన అసాధారణాలు. అన్నింటికీ వెనుక నీ గురుదేవుని ఆశీర్వాదం వుంది. వాళ్ళ కుచేష్టలే సఫలమైన నీశక్తి నిరర్ధకం ఔతుందా? అలా ఎప్పుడూ జరగదు మంటూ!

7. రవీంద్రనాథ్ నన్ను (పాశ్చాత్యులకు) పరిచయం (*Introduce*) చెయ్యాలనుకుంటున్నారు అన్న విషయంపై నాకు ఆశలు లేవు. నేనంటే వారికి ఇష్టంలేదు. అయినా వారికి తీరిక ఎక్కడుంది? సాహిత్య సేవాధర్మాన్ని వారు నాకు బోధించిన గురుతుల్యులు. వారి రుణాన్ని నేను తీర్చుకోలేను. వారంటే నాకు చాల గౌరవం, భక్తి. ఇందుకు ప్రమాణం మాత్రం బాహ్యంగా కనిపించటం లేదు. నాపట్ల వారికి వున్న వైముఖ్యం అపారం. అందువల్ల వారి సహాయం అర్ధించి ప్రయోజనం వుండదు.

8. హరీన్ ఇవాళ... రేపటిలోగా వస్తాడు. నీ కాగితం పంపించమని చెబుతాను.

9. ఇక నీ సంగతి: నీకు నేను చాల కృతజ్ఞుణ్ణి. ఇంత కంటే ఏం చెప్పను మంటూ! ఉత్తరం రాయటమనేది నాకు చాల కష్టమైన పని. వొళ్ళువంచి జాగ్రతగా రాయనే లేను. అందువల్ల రాయదలచుకున్న సంగతులే కొన్ని మరచిపోతూ వుంటాను. రాయటం ఇష్టంలేక కాదు. అది నా ఓర్పులేని తనం. నా మాట విశ్వసించు.

నీకు నా ఆశీస్సులు. హరీన్‌ను అడిగానని చెప్పు.

10. అరవిందుని కొత్త ఉగాదిపాట (ప్రార్థన గేయం) చాల బాగుంది, వారు నిజంగా ఒక గొప్ప కవి.

—శరత్.

## ౭౧

566, మనోహర పుకుర్, కలకత్తా
7 చైత్రం 1341.

మంటూ... చాలరోజులనించీ నీకు ఉత్తరం రాయలేక పోయాను. ఇది అన్యాయమే, నాకు తెలుసు. అంతకుమించి చెప్పాల్సిన కబురేమీ లేకపోవటమే దానికి శిక్ష. ఓర్పులేని నావంటి సోమరి దగ్గరకు అప్పుడప్పుడు భగవంతుడు లోకమిత్రుడిని పంపిస్తూ ఉండకపోతే నేను పాతాళానికి కుంగిపోవలసిందే. అలా భగవంతుడు పంపించిన మిత్రుడే బుద్ధదేవ్ భట్టాచార్య ఆయనేవచ్చి ఆ కబురు ఈ కబురు చెప్పి వెళ్ళుతూ వుంటాడు, నీకుమల్లేనే అతడూ నాకు అంతరంగిక మిత్రుడు. ఎప్పుడూ నా మంచి కోరుతూ వుంటాడు. నా కీర్తి ప్రతిష్ఠలు విస్తరించాలని కోరుతూ వుంటాడు. ఆనాడు నన్నతడు బలవంతాన హాఫ్‌మన్ గారి గదిలోకి తీసుకుపోయి కూచోబెట్టి నేను గీసిన చిత్రాన్ని ఆయనకు చూపించి నన్ను పరిచయం చేశాడు. నేనొక గొప్ప రచయితనని అతని నమ్మకం. అందుచేత గొప్ప రచయితలకు అర్హమైన సన్మానం నాకూ జరగాలని అతని కోరిక. నేను అనేకసార్లు చెప్పుకుంటున్నాను: నేను గొప్ప రచయిత నేమీ కాదనీ, యూరప్ నన్ను సన్మానించదనీ, కాని అతడు అంటాడు కదా: "అయితే దిలీప్ బాబు వ్యర్థంగా ఎందుకు ప్రయాస పడ తాడు? అతడు వ్యర్థమైన పరిశ్రమ చేసేవాడు కాడు, అరవిం

ముడు నిజంగా అతనికి ఆశ కల్పించి యుండాలి. అరవిందునికి తెలుసు."

వశిష్ఠసేను భార్య అమెరికన్ యువతి కొన్నాళ్ళ క్రితం వచ్చి 'నిష్కృతి' అనువాదం ఏదీ? చూస్తా ఇవ్వండని చాల బ్రతిమాలింది. అందులో అరవిందుని కలం చిందులు వున్నాయని ఆమె కెవరో చెప్పారు. అందుకనే పట్టుదలగా అడిగింది. ఒకప్రతి తనకిస్తే ఏప్రిల్‌లో అమెరికాకు తీసుకుపోయి అక్కడ దాన్ని ప్రచురించేందుకు ప్రయత్నం చేస్తానని చెప్పింది. ఇదివర కామె 'ఏషియా' పత్రిక సంపాదకురాలుగా వుండేది. అక్కడి గ్రంథప్రచురణ సంస్థలామెకు బాగా పరిచయం. 'నిష్కృతి' గాక 'శ్రీకాంత' అయినట్టయితే నాకు ఆశగా వుండేది. ఆ దేశంలో 'నిష్కృతి' కెలా ఆదరణ లభిస్తుంది చెప్పు? 'బహార హాల్' ఒక ప్రతినాకు పంపించు. ఎలావుందో చదివి చూస్తాను. బుద్ధదేవుడుకూడా నీకీ పాటికి ఉత్తరం వ్రాసేవుంటాడు. నువ్వు నన్ను పంపమని రాసినవన్నీ అతన్ని పంపమని చెప్పాను. ఈపాటికి పంపించే వుంటాడు. 'నిష్కృతి' ని ఫ్రెంచి భాషలోకి కూడా అనువదించాలన్న సంకల్పం నీకు వుంది! పని కూడా ఆరంభించావు. బాగానేవుంది నాకుమాత్రం ఆశావహంగా లేదు అయినా శ్రీ అరవిందుని ఆశీర్వాదబలంవల్ల అసంభావ్యంకూడా సంభవం కావచ్చు.

నువ్వు సన్యాసివి అయినా నాకింద నీకు చాల ఖర్చవుతోంది. బుద్ధదేవ్ రాగానే కొంత పంపిస్తాను అతను బాగా చదువుకున్నవాడు. సంస్కృత భాష, వనస్పతి శాస్త్రం అతనికి బాగావచ్చు. కాలేజీలో అతడు బోధించేవి అవే.

'శ్రీకాంత్' కూడా అనువదించటానికి పూనుకో. బ్రతికి వుండగా 'శ్రీకాంత్' అను వాదాన్ని చూడాలని నా కెంతైనా కోరిగ్గా ఉంది.

సాహానా, నువ్వు కలిసి తయారుచేసిన సంగీతశాస్త్ర సంబంధ గ్రంథం చేరింది. జాగ్రత్తగా అలమారలో దాచి పెట్టాను సాహానాకు నా ఆశీస్సులు.

నేను వెంట వెంట జవాబు రాయటం లేదని నువ్వు నా మీద ప్రతీకారానికి దిగబోకు సుమీ! వారం పదిరోజుల్లో మేమంతా మా స్వగ్రామం వెడుతున్నాం. వెళ్ళేముందు ఉత్తరం రాస్తాను. ఈలోగా 'విస్మృతి' అనువాదప్రతి ఒకటి కలకత్తా అడస్‌కే పంపించు. మీరంతా క్షేమమే కదా! నీకు నా ఆశీస్సులు.

—శరత్.

## ౭౨

566, మనోహార్ పుకుల్, కలకత్తా,
3 మాఘం 1942.

మంటూ! నీ పోస్టుకార్డు, 'బహువల్లభ' ఫారాలకట్ట చేరాయి. గత ఏడెనిమిది మాసాలనుంచీ నేను అస్వస్థతగా వుంటూన్న సంగతి నీకు తెలియదేమో! మంచంలోనే పడి వున్నానని చెబితే అతిశయోక్తి కాదు. పోయిన జ్యేష్ఠ మాసంలో మా స్వగ్రామంనించి వస్తోన్నప్పుడు దారిలో వడ దెబ్బతగిలింది. అప్పటినించీ కళ్ళు మంటలు, తలపోటు—చాల బాధపడ్డాను. ఇప్పటికీ పూర్తిగానయం కాలేదు. నయం ఔతుందో కాదో నాకు తెలియదు. పైగా మూలవ్యాధి ఒకటి; మాటి మాటికీ జ్వరం తిరగబెడుతూ ఉంది. ఇప్పుడు

జ్ఞానంలో ఉండే నీకు ఉత్తరం రాస్తున్నాను. కాపురం స్వగ్రామంలోనే. అప్పుడప్పుడు కాస్త వొంట్లో బాగున్నప్పుడు కలం పట్టాలనుకుంటున్నాను. గ్రంథపఠనం, రచన - అన్నీ బంద్. వార్తా పత్రికకూడా చదవటంలేదు. ఈ జీవితంలో మళ్ళీ గ్రంథపఠనకు గాని, రచనకుగాని అవకాశం లేకుండా ఇలా సుస్తీగా కాలం గడపాల్సి వచ్చినా నాకు విచారంలేదు. శక్తి సామర్థ్యాలు ఉన్నంతవరకు చేయగలిగినదంతా చేశాను. అంతకుమించి ఇంకా చెయ్యలేకపోతే విచారం ఎందుకూ! అంత్యాలలో నేను బైరాగిని. ఇక ముందుకూడా బైరాగిలాగే బ్రతుకుతాను.

ఒకనాడు బుద్ధదేవ్ మంటూ రాసిన 'దోలా' చాల బాగుందంటూ చర్చిస్తున్నారు. విని నేనేమీ ఆశ్చర్యపడలేదు. మంటూకు నవలా రచనలో కౌశలం నానాటికీ అభివృద్ధి చెందుతూన్నదని నాకు తెలుసు. అకృత్రిమమైన సాధన ఫలించకుండా వృథాపోతుందా? అదీగాక నీది కళాహృదయం. నీ హృదయం ఎంతవిశాలమో అంత నిర్మలము, పరిచింతా కలితము. నీ పాటల్లో గుణవంతులైన వారిపట్ల నీ ప్రేమలో.. నీ పనుల్లో... నీ రసిక హృదయం చిన్నతనంలోనే నాకు గోచరించింది. అందువల్లనే నీవంటే నాకు నిష్కపటమైన ప్రేమ. ఆ ప్రేమ ఎట్టి బాహ్యసంఘటనల వల్లగాని, ఘాత ప్రతిఘాతాలవల్లగాని సడలిపోయేదికాదు. నేడు నీ రచనా కౌశలం ఫలించింది. ఇదినాకు ఆనందప్రదమైన అంశం. నీకు సుఖము చేకూరుగాక! నీజీవితము సార్థకమగుగాక!

బుద్ధదేవవసు రచించిన 'బాసర్ ఘర్' విషయంలో రవీంద్రనాథ్ ఏమి రాశాడో నేను చూడలేదు. నాకన్నా

రవీంద్రుడే నవలలు చక్కగా వ్రాస్తాడని బుద్ధదేవ్ చెప్పి యున్నట్టయితే... ఆమాట నిజమే కాదటూ. అది సత్యం, పరమసత్యం అని నామనస్సుకూ తెలుసు.

అదీగాక ... నాకంటే ఎవరు గొప్ప, ఎవరు తక్కువ అనే విషయాన్ని పురస్కరించుకుని విచారించటంగాని సంతోషించటంగాని నాకక్కర్లేదు. ఎవరైనా నాపుస్తకం ఒకటి తీసుకుని 'ఇది నవల అనటానికి వీల్లేదు' అని అన్నట్టయితే అందువల్ల నాకు తాత్కాలిక వేదనతప్ప మరేమీ కలగదు. ఈమాట విశ్వసనీయంగా తోచకపోవచ్చు. అధిక నీచత్వాన్నే ప్రకటిస్తున్నానని మీరనుకోవచ్చు - కాని నేను నా బ్రతుకంతా ఆ సాధనలోనే గడిపాను. అందువల్లనే ఎవడెలా ఘోరంగా విమర్శించినా నేను మాటాడలేను; జవాబు చెప్పలేను. భారావనంలో ఒకటి రెండుసార్లు మాత్రం రవీంద్రునికి విరుద్ధంగా రాశాను. కాని అది నా ప్రకృతికాదు, వికృతే. అనేక కారణాలవల్ల పొరపాటే చేశాను.

ఆరోగ్యం చెడిపోతూ వుంది - ఎక్కువ రోజులు జీవించలేనేమోనని పిస్తోంది. జీవితశేషం ఇలాగే శాంతంగా గడిపేస్తాను. భారావనంలో చేసిన కొన్ని పొరపాట్లకు పశ్చాత్తాపమే కలుగుతోంది. ఒక్కమాట జ్ఞాపకం ఉంచుకోమంటూ : నువ్వు ఎవరికీ ఎప్పుడూ మనస్సుకు బాధ కలిగించవద్దు. నీ పరిశ్రమే నీకు ఫలసిద్ధిని ఇస్తుంది.

నీ యిళ్ళు అమ్మేస్తున్నావా ? ఏం అవసరం వచ్చింది ? ఈ దేశంలో నీకున్న సంబంధాలన్నీ త్రెంచివేసుకుంటున్నావు. అది తలచుకుంటే నాకు బాధగా ఉంటోంది.

ఎప్పుడూ ఉత్తరాలు అస్తవ్యస్తంగానే రాస్తూ ఉంటాను. అసందర్భపు విషయాలు ఏమైనా రాసివుంటే లక్ష్యం చెయ్యకు. కొంచెం అరోగ్యం చిక్కితే నీ రెండు పుస్తకాలూ శ్రద్ధగా చదువుతాను.

—శరత్.

## 83

జ్యేష్ఠం 1310.

మంటూ! 'శ్రీకాంత్' నాలుగో భాగం విషయమై నేను కొంచెం చెప్పాలి: సాధారణములు, సహజములు అయిన సంఘటనలు మాత్రమే తీసుకుని ఈ నాలుగోభాగం పూర్తి చెయ్యాలని నా తలంపు. సూచ్యార్థ రచన ద్వారా...ఎక్కడి కక్కడ క్లుప్తపరచి రాస్తూ ఎంతవరకు రససృష్టి చెయ్యటానికి వీలుంటుందో చూస్తాను. ఉపాదానవుపకరణాలతో గాక... అసాధారణ సన్నివేశాలతో గాక... అతిసాధారణములైన దైనందిన గ్రామజీవన సంఘటనలతోనే ఈ పుస్తకం నిండి వుంటుంది. విస్తృతవర్ణనలు వుండవు, గాంభీర్యం వుంటుంది; దీర్ఘవివరణాలు వుండవు; సూచ్యార్థ ప్రధానంగా వుంటుంది. రసికుల ఆనందం కోసం రాస్తాను. ఒక వేళ నవల బాగుండక పోవచ్చు. కాని సాహిత్యసంయము లేని విశృంఖల రచనగా మాత్రం ఉండదు.

'పుష్పపత్ర' వైశాఖ జ్యేష్ఠమాసాల సంచికలో 'బుద్ధదేవ్ ఔర్ యథార్థవీర్' అనే శీర్షికతో నువు రాసిన వ్యాసం చదివాను. అందులో సావిత్రిని గురించి కూడా ప్రస్తావించావు, విషయం తేటతెల్లంగా రాశావు. సావిత్రి దాసీకులానికి చెందిన

మనిషి కాదన్న సంగతి అందరూ మరచిపోతూ వుంటారు ఎందుకో. లక్ష్మీదేవికూడా ఒకప్పుడు దురదృష్టవశాత్తు ఒక బ్రాహ్మణుని ఇంట దాసీత్వం చెయ్యాల్సివచ్చిందని పురాణాల్లో రాశారు. సంప్రదయాల్ని బట్టి వేశ్యలలో కూడా ఉచ్ఛనీచ వర్గాలు వున్నాయి. ఒక వేశ్యదగ్గర మరో వేశ్య దాసీగావుంటే ఆ యిద్దరి సంప్రదయాలూ ఒకే రీతిగా ఉండవు. దాసీని పొందటం తేలికే కాని, దాని యజమానురాల్ని పొందాలంటే చాలా అంతరాయాలు ఉంటాయి.

స్త్రీజాతిని దూషిస్తూ ప్రచారం చేసేవాళ్ళు తాము యదార్థ వాదులమని భావిస్తూ ఉంటారు. వాళ్ళు యదార్థ వాదులూ కారు, ఆదర్శవాదులూ కారు. కేవలం దాంభికులు అహంకారులూను. మహిళలను ఏవగించుకుంటూ కటువైన మాటలు వ్రాయడం బహాయి కావచ్చు. కాని ఆ దృక్పథంతో అసలైన సాహిత్య సృష్టి జరగదు.

—శరత్.

## ౭౪

10 జ్యేష్టం 1336

శ్రీ భూపేంద్ర కిశోర్ రక్షితరాయ్‌కి!

భూపేన్! నువు ఒక మాసపత్రికా సంపాదకుడివి. (*Catch-words*) మీాద వ్యామోహం నిగ్రహించుకోలేక పోతు న్నావు, విప్లవం, 'విద్రోహం'—ఈ రెండుపదాల అర్థం ఒకటి కాదు. విప్లవం వేరు, విద్రోహం వేరు. ఈ సంగతి నువు గమ నించాలి. విప్లవంతో పరాధీనదేశం స్వాతంత్రం అయిందా? చరిత్రలో ఎక్కడైనా దానికి ఆధారం ఉందా? ఒక స్వాతంత్ర

దేశంలోనే విప్లవంద్వారా ప్రభుత్వంగాని, సామాజిక నీతిగాని మార్పుచెందుతుంది. అంతేగాని 'విప్లవంద్వారా ఒక పరాధీన దేశం స్వాతంత్ర్యం పొందగలు' దన్నమాట సాధ్యం కావటంలేదు. విప్లవమంటే వర్గకలహం, గృహకలహం అన్నమాట – ఆత్మకలహం, గృహవిచ్ఛేదం అన్నమాట. ఈ ఆత్మకలహం గృహవిచ్ఛేదంవల్ల ఏమేమి సాధించటానికి వీలున్నా, శత్రువుల్ని మాత్రం జయించలేం. విప్లవం సమైక్యతకు శత్రువు.

—శరత్.

౭౫

సామతాబేడ్, పానిత్రాస్ పోస్టు,
10 చైత్రం 1334

భూపేన్! ఈ ఉగాది సందర్భంలో మీ వేణుకు నా హృదయపూర్వకమైన ఆశీర్వాదాలు. సాహిత్యం లేని జాతికి అధోగతే. ఈ సత్యాన్ని మనం అనేక ఆవేశాల్లో పడి మరచిపోయాం. ఆ తత్ఫలితంగా మన జాతీయ జీవితం నానాటికి హీనాతిహీనం అయిపోతున్నది. సమాజంలో కుళ్ళు పేరుకుంటోంది, దుఃఖపరిస్థితులు పెంపొందుతున్నాయి. మనం కళ్ళారా చూస్తూనే ఉన్నాం. నీ వంటి కొందరు యువకులు ఈ చిన్న పత్రిక ఆధారంగా ఒకచోట చేరి సక్రియమైన కృషి చేస్తున్నందుకు నాకు చాల సంతోషం. మన జాతి అనుభవిస్తూన్న కష్టాలన్నింటికీ పరాధీనతే కారణమని మీ పత్రిక చక్కగా నిరూపిస్తున్నది. అదే పద్ధతిలో, అదే నీతితో మీ పత్రిక కొనసాగుగాక!

—శరత్.

# ౨౬

సామతాబేడ్, పానిత్రాన్ పోస్టు,
4 జ్యేష్ఠం 1958.

భూపేన్! కొన్నాళ్ళ క్రితమే నీ ఉత్తరం చేరింది. కాని ఈమధ్య నేను 'కుమిల్లా' వెళ్ళవలసి వచ్చింది. అందుచేత జవాబు ఆలస్యంగా రాస్తున్నాను. వేరే ఏమీ అనుకోవద్దు. మీరు మళ్ళీ ఎప్పుడొస్తారు? మిమ్మల్ని మళ్ళీ ఎప్పుడు కలుసుకుంటాను, అని ఇలా ఆలోచిస్తూ ఉన్నాను, గ్రామంలో ఈ ఇంట్లో ఒంటరిగా కూచుని. సాహిత్యం ద్వారా నీకు నాకు పరిచయం కలిగింది. నువు దేశాన్ని ఎక్కువగా ప్రేమిస్తున్నావు. ఏమి అపరాధం చేశావని నిన్ను జైల్లో వేశారు, శీఘ్రంగా విముక్తిపొంది తిరిగి సాహిత్య క్షేత్రంలో ప్రవేశించగలవని ఆశిస్తూ అందుకోసం భగవంతుని ప్రార్థిస్తున్నాను.

'శేషప్రశ్న' నవల నీకు నచ్చిందని విని చాలా సంతోషించాను. అందులో అనేక సామాజిక సమస్యల్ని చర్చించటం జరిగింది. కాని వాటి పరిష్కార మార్గాలు నిర్ణయించే భారం మీ మీద ఉంది. భవిష్యత్ వ్యవస్థానిర్మాణ బాధ్యత మీకు ఆనంద ప్రదమే, కాని ఈ పుస్తకం అనేకమందికి నిరాశ కలిగిస్తుందేమోనని నా ఉద్దేశం. అటువంటి వాళ్ళకు అందులో ఆనందం కలగదు. ముఖ్యంగా కథావస్తువు చాల చిన్నది. అది చదువుతూంటే హాయిగా కాలక్షేపం పోతున్నట్లు ఉండదు. అరమోడ్పు కన్నులతో ఆనంద పారవశ్యం అనుభవిస్తున్నట్లుగా ఉండదు. అయినా అర్థం చేసుకోగలవాళ్ళు ఏ కొద్దిమందైనా ఉండకపోతారా అనే ఉద్దేశంతో ఆ పుస్తకం రాశాను. అటువంటివాళ్లు కొద్దిమంది ఉన్నా నాపని సార్థకమైనట్టే. అన్నిరకాల

రచనలూ అందరికీ నచ్చవు. అభిరుచులు భేదిస్తాయన్న మాట నే నంగీకరిస్తాను.

అది ఆధునిక సాహిత్యం క్రిందికి వస్తుంది. ఆ మార్గంలో కూడా ఒక 'మాదిరి' చూపెడదాం అనుకున్నాను. ముసలి వాడినైనాను. రాయగలశక్తి తగ్గిపోతుంది. అయినా కూడా రేపటి ప్రముఖ పౌరులు కాదగిన మీ వంటి వారికి...పచ్చి బూతులా తయారు చెయ్యకుండానే అత్యాధునిక సాహిత్యం సృష్టించవచ్చునన్న సూచన ఇద్దామనుకున్నాను. కేవలం కోమలప్రేమ రసానుభూతి కలిగించడమే గాక... బుద్ధికి బల కారకమైన భోజనం సమకూర్చటం అత్యాధునిక సాహిత్యం యొక్క ముఖ్య ప్రయోజనం. ఇకముందు మీరైనా ఏదైనా రాయదలచుకుంటే చాల చదవాల్సి ఉంటుంది. కేవలం పాఠకులకు మనోరంజనం చేసినంత మాత్రాన రచనాప్రయోజనం నెరవేరినట్లు కాదు.

జైల్లో ఉన్నావు. కావలసినంత తీరిక ఉంటుంది. వృథా కాలక్షేపం చెయ్యొద్దని నా కోరిక. ఇప్పుడు నీకు లభించిన ఏకాంతవాసం నీ భవిష్యజ్జీవన కళ్యాణ ద్వారాన్ని తెరువ జాలినదిగా వినియోగ పడాలి. మానవ ప్రకృతిని తెలుసుకో. ఆ విజ్ఞానమే సాహిత్య సృష్టికి అసలైన సామగ్రి. ఈ సత్యాన్ని ఎప్పుడూ విస్మరించకు.

నా శరీరారోగ్యం వృద్ధాప్యానికి తగినట్టుగానే ఉంది. ఉత్సాహంగా వుండు. కనుక ఆపదలు అంటకుండు గాక !

—శరత్.

# ౨౨

శ్రీ కృష్ణనారాయణ భౌమిక్ కు:

పత్రికా నిర్వహణకు కావలసిన విధు లేమిటని ప్రశ్నించావు. నేనెప్పుడూ పత్రిక నడపలేదు. కాబట్టి నాకు ప్రత్యక్షానుభవం ఏమీ లేదు. కాని ప్రతినెలా చాల పత్రికలు చదువుతూ వుంటాను. అందువల్ల నాకు తోచిందేమంటే—ఒక మాసపత్రిక బహుజనామోదం పొందాలంటే చక్కని రచనలు వుండాలి. మరొకర్ని వారికి కోపం తెప్పించాలని రాసే విమర్శనలు మొదట ఎంత చురుగ్గా వున్నట్టు కనిపించినా, తాత్కాలికంగా పాఠకుల చిత్తాన్ని విహ్వాలపరచినా వాటికి స్థాయి వుండదని... కొంచెం ఆలోచించి చూస్తే తెలిసిపోతుంది. కొందరు తమ అనుభవంలోకి వచ్చిన కొన్ని సంఘటనలను కథలుగా రాస్తారు. అందులో నాటకీయత ఒక కొత్తదనం వచ్చినా; సత్యానుభవాలుగా, ప్రత్యక్షంగా కనిపించినా; భాష భావాలు, ఎంత ఆడంబరంగా వుండి పాఠకుల దృష్టిని ఆకర్షించేవే అయినా... వాటిలో అంతస్సారం శూన్యమనీ, చాల కాలం నిల్చియుండ జాలవని తెలుసుకో.

(*Intellectual story*) బుద్ధివాదాన్ని అనుసరించిన కథ అంటూ ఒకమాట ఈమధ్య తరచు వినిపిస్తూ వుంది. దీని స్వరూపం నేనింతవరకూ చూడలేదు. చూచినా గుర్తించలేక పోయానేమో! ఒకనాడు కాకతాళీయంగా ఒకకథ చదివాను, రచయిత పాండిత్యం బహువైపోయి రచన మధ్యలో కుంటుపడ పోయింది. అటువంటి రచనలకు పత్రికలో స్థానం ఇవ్వకూడదు.

కథంలో రచయిత బుద్ధి కి కనిపించటం దోషమది కాదు, హృదయవృత్తి బహుళంగా వుండాలి.

—శరత్.

౭౮

శ్రీ అతులానందరాయ్‌కి!

1340 పరిచయ పత్రికలో శ్రీ దిలీపకుమార రాయ్‌కి రాయబడిన రవీంద్రుని 'పత్రసాహిత్యానికి మాత్రా' విషయమై నా అభిప్రాయాన్ని అడిగావు. ఆ ఉత్తరం వ్యక్తిగతమైనది. అయినా పత్రికలో ప్రచురితం అయినందువల్ల అందరూ చదవటానికి ఉద్దేశింప బడినదేనన్న మాట. కాబట్టి నువు నా అభిప్రాయాన్ని అడగటం సహజమే. కాని నాలుగేసి పేజీల పొడుగాటి ఆ ఉత్తరాల్లోని చివరి పంక్తుల్లో 'వెంటనే కొంత పైకం పంపించు' అని రాసినట్టుగా యూరప్ అంతా త్వరలోనే తన యంత్రాలు, తుపాకులు, ఫిరంగులు, డబ్బు, దస్కం, మానం, మర్యాద—అన్నింటితోనూ ఒక్కసారి మునిగిపోతుంది అనేదే రచయిత భావం అయినట్లయితే... అటువంటి పరిస్థితి ఈ జీవితంలో చూడగలుగుతానా? చాల వయసు గడిచిపోయింది మరి...అని పరితాపం చెందుతూ వున్నాను.

ఇంకా అనేకమంది విషయమైకూడా ఆయన ఆశేపదులు కున్నాడు. వారిలో నేనుకూడా ఒకడినని మీకు అనుమానంగా వుంది కదూ? మీ అనుమానం నిరాధారం కాదు. వాళ్ళు 'మదించిన ఏనుగులు' 'చిలకపలుకులు పలుకుతూ వుంటారు' కుస్తీలు పడుతూ వుంటారు' 'కసరత్ చేస్తూ వుంటారు' 'ప్రాబ్లెమ్ సాల్వు చేస్తూంటారు' అని కవి ఆరోపించిన నిందలు.

ఈ మాటలన్నీ ఎవరు ఎవరిని అన్నప్పటికీ అందంగా లేవు; చెవికి ఇంపుగానూ లేవు. వ్యంగ్య విస్ఫూర్తితో కోపం కలిగిస్తాయి. అటువంటి మాటలవల్ల కళ ప్రయోజనం నెరవేరదు. పైగా విన్నవారి మనస్సుకు కూడా కష్టం కలిగిస్తాయి. అందును గురించి మన మనోవ్యథ ప్రకటించటం అనవసరం; ప్రతీకారానికి పూనుకోటం వ్యర్థం. వాళ్ళు ఏ చిలకపలుకులు మళ్ళీ పలుకుతున్నారో, ఏ కుస్తీపట్లు చూపిస్తున్నారో, ఏ కసరత్ పట్టీలు ప్రదర్శిస్తున్నారో చెప్పమని ఆ వృద్ధకవిని నిలవేసి అడగటం సమంజసంగా వుండదు. నా చిన్ననాటి సంగతి ఒకటి జ్ఞాపకం వస్తోంది. మేమంతా ఆటలాడుకుంటూ వుంటే ఒకఅబ్బాయి 'అముక్ బాబు మైల తొక్కాడు' అని అరచాడు. ఇక చేసేదేముంది? వాడు ఎక్కడ కాలు వేశాడో, ఎవరు చూచారో, అది నిజంగా తొక్కరాని పెంకో లేక కొబ్బరి చిప్పో — ఈ విచారణ అంతా చేసినందువల్ల ప్రయోజనం ఏముంది? వాళ్ళ అమ్మమ్మ మాత్రం వాణ్ణి సచేలస్నానం చేయించి నెత్తిమీద గంగాజలం చల్లిగాని ఇంట్లోకి రానీదు. ఎందువల్ల? వాడు తొక్కాడు కాబట్టి, మన దశకూడా ఇప్పుడు అలాగేవుంది.

'సాహిత్యకీమాత్రా' ఇంకా ఇలాంటివే కవిగారి వ్యాసాలు చాల మటుకు అర్థంచేసుకో జాలిన బుద్ధి నాకు లేదని అంగీకరిస్తాను. వారు గుర్రాల్ని పసువుల్ని, జంతుజాలాన్ని దుకాణాల్ని ఉపమేయాలుగా, వుదాహరణాలుగా తీసుకొంటూ వుంటారు. మానవసంఘ సమస్యల విచారణలో, స్త్రీపురుషుల పరస్పర సంబంధ వివరణలో ఇవన్నీ ఎందుకొస్తాయో అని నాకు బోధపడటం లేదు. అవన్నీ వచ్చి ఏ సమస్యను పరిష్క

రిస్తారేమో మరి! వినటానికి బాగానే వుండచ్చు. కాని వాటి వల్ల సాధించే ప్రయోజనం ఏమీ వుండదు.

ఒక ఉదాహరణ సూచిస్తాను. కొన్నాళ్ళ క్రింద వారు హరిజనులకు జరుగుతోన్న అన్యాయాల్ని చూచి క్రుద్ధులై పోయి ప్రవర్తన సంఘానికి చెందిన మోతిబాబుకు ఒక ఉత్తరం రాశారు.

అందులో నాకు... "ఒక బ్రాహ్మణ స్త్రీ పిల్లిని పెంచుతోంది అనుకుందాము ఆ పిల్లి ఎంగిలి మూతితో వచ్చి ఆమె ఒడిలో కూచుంటున్నది. అందుమాత్రంచేతనే ఆమె పవిత్రత భంగం అయిపోయిందా? ఆమె ఏమీ ఏవగించు కోదు" అని రాశారు. నిజమే భంగం కాలేదు. కాని ఈ ఉదాహరణవల్ల హరిజనులకు ఏమి సాధించిపెట్టినట్టు? ఏ సమస్య పరిష్కారం అయింది? ఈ పిల్లి ఉదాహరణ పురస్కరించుకుని ఆ బ్రాహ్మణ స్త్రీ దగ్గరకుపోయి "పిల్లిఅంటే ఒక నికృష్ట జంతువు నీ ఒడిలో కూచుంటే నువ్వేమీ ఏవగించుకోలేదు. అతి ఉత్కృష్టజీవిని నేను. వచ్చి నీ ఒళ్ళో కూచుంటాను — ఏవగించుకోకు" అని పలకవచ్చా? పిల్లి ఎందుకువచ్చి ఒడిలో కూచుంటుందో, మిడత ఎందుకు అన్నం పళ్లెంమీద వచ్చి వాలుతుందో... ఈ తర్కం ఉపయోగించి మానవునికీ మానవునికీ మధ్యవుండే న్యాయాన్యాయాలను పరిష్కరించలేము. ఈ ఉపమానాలు కళ్లు మిరుమిట్లు గొలిపేట్లు ఉండవచ్చు. వింటానికి ఇంపుగానే వుండవచ్చు. కాని పరిశీలించి చూస్తే మొదట ఎంతో విలువైనవిగా కనిపించినవి, సారహీనమైనవే నని తెలుసుకోగలుగుతాం.

ఈనాడు అనేక కార్ఖానాలు ప్రారంభించుకొని చాలా మంది యంత్రపరిశ్రమలను నిర్మిస్తున్నారు. ఇంకా కొత్తగా నిర్మిస్తారు. అందులో తప్పేమీ లేదు. కాని అదే ఈనాడు సమస్య అయిపోయింది. తమకు తెలిసో, తెలియకుండానో మొత్తం మీద కొందరికి పాశ్చాత్య సంపర్కం కలిగింది. అటువంటి వాళ్ళ సుఖదుఃఖాలకు హేతువులు జటిలములైనాయి. వాళ్ళ జీవనపద్ధతి మారిపోయింది. గ్రామంలోని రైతుల జీవితానికీ, వారి జీవితానికీ పోలికే లేదు. ఇది చాల విచారించదగిన అంశం. ఈ అంశానికి సంబంధించిన నానావిధ సంఘటనలను సమకూర్చి గ్రంథం రాస్తే అది సాహిత్యం కాదా? కాదని కవిగారుకూడా చెప్పటం లేదు. కాని వారి అభ్యంతరం ఏమంటే, సాహిత్య నిబంధనలను ఉల్లంఘించరాదట. అయితే ఈ నిబంధనలను నిర్ణయించటం ఎలాగ? పోట్లాడుకుని, కొట్టుకుని కాదు కదా! సాహిత్యం యొక్క చిరంతన మూలనీతిని అనుసరించి అది నిర్ణయం అవుతుందని కవిగారంటారు. కాని మరి ఈ మూలనీతి రచయిత బుద్ధి, అనుభవం, గవేషణశక్తి — వీటన్నటినీ మించి వేరే ఇంకేమైనా ఉందా ఏమిటి? చిరంతనమనేది లేనే లేదు. అదొక వట్టి మృగతృష్ణ.

"నేటి నవలాసాహిత్యపు గతి ఇలాగే వుంది. మానవ తత్వ విచారం అనే స్థూపంకింద అది నలిగిపోతూ వుంది" అన్నారు కవిగారు. ఇందుకు జవాబుగా ఎవరన్నా "ప్రాచ్య నవలా సాహిత్యపు గతి అలాగేమీ లేదు. మానవ తత్వ విచారం అనే స్థూపం అడుగున అదేమీ నలిగిపోవటం లేదు. మానవ తత్వ విచారం అనే సూర్యకాంతిలో అది సమున్నతంగా ప్రకా

తిస్తోంది" అని చెప్పేట్టయితే ఏటువంటి ఉదాహరణ చూపించి ఆయన్ను తృప్తి పరచగలం? ఇంకొక మాటకూడా ఈరోజుల్లో ఎక్కువగా వినిపిస్తూ వుంది, కవిగారే దాన్ని మొదట ప్రచారం చేశారు. "ప్రకృతిస్థుడైన వ్యక్తికి కథ వినాలన్న అపేక్ష వుండి తీరుతుంది" అని ఆ మాట అంగీకరిస్తూనే—"ఔను. మేము ప్రకృతిస్థులమే. కాని సమయం దాటింది' వయసుమీరి పోయింది. రాజకుమారుని కథలు, మండూక రాజు—మండూక రాణి కథలతో తృప్తి కలగ దిప్పుడు" అని పాఠకుడెవరన్నా అనేట్టయితే అది అసమీతి కరమైన మాట అని నేననుకోను. కథలో తత్వ విచారం వుండబట్టే అది పరమార్థం ఔతుంది. ఒక విశుద్ధమైన కథ రాయాలంటే తత్వ విచారం చెయ్యగల శక్తిని రచయిత పరిత్యజించ నక్కర్లేదు—అని పాఠకులే చెప్పగలుగుతారు.

కవిగారు రామయణాన్ని, భారతాన్ని తీసుకుని రాముని చరిత్రనూ, భీష్ముని చరిత్రను సమీక్ష చేసి—ఆ రెండు గ్రంథాల్నీ ఎందుకూ పనికిమాలిన వాటికింద కట్టేశాడు. నేనీ విషయమై ఏమీ బదులు చెప్పదలచుకో లేదు. ఎందువల్లనంటే ఆ గ్రంథాలు రెండూ కేవలం కావ్యాలు మాత్రమే కాదు; ధర్మాల్ని ప్రబోధించే సంహితలు. కొంతవరకు బహుశః చరిత్రలు కూడాను. ఒక నవల లాగా రాసిన చరిత్రలు మాత్రమే నని భావించరాదు. కాబట్టి మామూలుగా కావ్యాలను, నవలలనూ వలెనే ఈ గ్రంథాల్ని కూడా అదే కొలతమానంతో విలువ నిర్ణయించటానికి ప్రయత్నించ కూడదు.

లేఖలో కవిగారు *Intellect* అన్న పదాన్ని పలుసార్లు ప్రయోగించారు. నిష్ఠ అని అర్థం వచ్చేట్టు కొన్ని చోట్ల, బుద్ధి అని అర్థం వచ్చేట్టు మరి కొన్నిచోట్ల వాడారు. 'ప్రాబ్లెమ్' అన్న పదాన్ని గూడా అలాగే బహుళంగా ప్రయోగించారు. నవలలో చాల ప్రాబ్లెమ్ (సమస్య)లు వుంటాయి—వ్యక్తిగత, నీతిగత, సామాజిక, సాంసారిక మొదలైనవి. పైగా కథానాయికా నాయకికి సంబంధించిన ప్రాబ్లెమ్ ఒకటి వుంటుంది. ఇదే అన్నింటి కన్నా కఠినమైన ప్రాబ్లెమ్. కుమార సంభవంలో వున్న ప్రాబ్లెమ్ ఉత్తరకాండలో రామచంద్రుని ప్రాబ్లెమ్, *Doll's house* లో స్త్రీల ప్రాబ్లెమ్, యోగాయోగ లోకుము ప్రాబ్లెమ్—ఇవన్నీ ఒకే రకమైనవి కావు. 'యోగాయోగ పుస్తకం విచిత్రిత' పత్రికలో ప్రచురితమౌతున్నప్పుడు... ఒక్కొక్క అధ్యాయం సాగుతూన్నకొద్దీ మేము చేసే గందరగోళాలు జాస్తిపెరుగుతూ వచ్చాయి. అదుపు, ఆజ్ఞ లేక; ఉద్దండుడై మధుసూదనుడులా అస్తమానం ఇతరులపై ఆక్రమణ చేస్తూ వుంటాడు. ఇటువంటి వ్యక్తిద్వారా రచయిత తెచ్చిన ప్రాబ్లెమ్ చివరకు ఎలాగ పర్యవసిస్తుందో నేను ఊహించలేక పోయాను. కాని ఒక లేడీడాక్టరు వచ్చి చివరకు చాల తేలిగ్గా పరిష్కారం చేసేస్తుంది. మన జలధర దాదాకూడా ప్రాబ్లెమ్‌ను కల్పించకుండా వుండడు. చాల కోప దారి మనిషి. అతడు రాసిన ఒక పుస్తకంలో అటువంటి వాడే ఒక వ్యక్తి ఒక పెద్ద సమస్య తెచ్చిపెడతాడు. కాని తత్పరిష్కారం మరోవిధంగా జరిగింది. బుసలు కొట్టుకుంటూ ఒక సర్పం వచ్చి అతన్ని కాటు వేస్తుంది. "ఇదేమిటి? ఇలా అయిందేం?" అని జలధరబాబును అడిగాను. "ఏం, పాములు కాటు వెయ్యవూ? అని జవాబు చెప్పాడు.

ఆఖరుమాటగా ఒకటి వ్రాస్తా. రవీంద్రులు అన్నారుకదా : "ఇబ్సెన్‌కు నిజంగా ప్రపంచంలో శాశ్వత స్థానం లభించిందా ? కాని ఈనాడు ఆయనకి ప్రభావం వాళ్ళందరికన్న తగ్గిపోలేదూ ? ఇంకా కొన్నాళ్ళు పోతే ఆయన్ని ఎవరూ అనుకునేవాడే ఉండడు" అని. రవీంద్రుని అభిప్రాయం—కాని అది అనుమానమేగాని ప్రమాణం మాత్రం కాదు. భవిష్యత్తులో ఎప్పటికైనా మళ్ళీ ఇబ్సెన్‌కు తన పూర్వ గౌరవస్థానాలు తిరిగి రావచ్చు. సాహిత్యానికి వర్తమానకాలమే ఆఖరు హైకోర్టు కాదు.

—శరత్.

౭౬

25 శ్రావణం 1341.

శ్రీ. అవినాశచంద్ర ఘోషాల్‌కు !

'వాతాయనం' ప్రత్యేక సంచిక శ్రద్ధగా చదివాను. సోమరినై ఉపేక్షా భావంతో అవతల పారెయ్యలేదు.

అందులోని అన్ని విషయాలూ నాకు పరితృప్తి కలిగించాయని చెప్పలేదు. అందులోని ఏ విమర్శక వ్యాసమున్నా విద్వేషంతోనూ, వ్యక్తిగతమైన ఈర్ష్యతోనూ కళంకితమైనట్లు కనిపించలేదు. ఇది ఆనందకరమైన విషయం కాని అలా ఎక్కడైనా కళంకితమైపోయి......అది నేను గమనించకుండా ఉన్నట్లయితే...... నేను చెప్పదలచుకున్న విషయం ఏమంటే—ఇదివరకు జరిగిందేదో అయింది. ఇకముందునుంచైనా ఒక్క సంగతి బాగా జ్ఞాపకం పెట్టుకోవాలి. అసహనం, క్రౌర్యం, నైచ్యం సాహిత్యంలో వుండకూడదు. అపనిందలువేసి ఇతర్లను కించపరచాలని ప్రయత్నించే రచయిత రాతలను

పాఠకులు చాలాకాలం సహించలేరు. క్రమశః వాళ్ళ దృష్టిలో ఆ పత్రమయితే అల్పజ్ఞుడుగా కనిపిస్తూ జరుగుతుంది, అతని గుట్టు ఎప్పటికైనా బయటపడి తీరుతుంది. అటువంటి ఈర్ష్యా పరిపూరితములైన వ్యాసాలవల్ల పత్రిక మర్యాద నశిస్తుంది, పత్రిక ఉద్దేశం శిథిలమైపోతుంది. ఇట్టి విమర్శలన్నీ ఫలితం లేని పరిశ్రమ అన్నమాట లోకానికి మంచిచేయగల సామర్థ్యం పత్రికకు తగ్గిపోతుంది ఇంతకన్నా పత్రికకు అప్రతిష్ఠ మరేముంటుంది? అసత్యం, అన్యాయం, కుత్స చాలా కాలం బ్రతకవు.

—శరత్.

## ౨౦

7 శ్రావణం 1342.

దేశంలో వార్తాపత్రికల వ్యాప్తి ఎక్కువైంది. ఇప్పుడు అవి ప్రజల దృష్టిని అధికంగా ఆకర్షిస్తున్నాయి. వారి దైనందిన జీవితంలో వాటి అవశ్యకత ఏర్పడిందన్నమాట. ఇది సంతోష ప్రదమైన విషయమే. కాని సిద్ధించిన యీ ప్రతిష్ఠతో తృప్తిపడి ఊరుకుంటే లాభంలేదు. పత్రిక ప్రతిష్ఠ దిన దినాభివృద్ధి చెందాలి. అందుకు పనిచెయ్యాలి. నీ కృషి సాధారణ ప్రజల సౌభాగ్యానికీ అభ్యుదయానికీ వినియోగపడాలి. ఏవో తదితరమైన ఉపాయాలవల్ల పత్రిక తన ఉనికిని స్థిరపరచుకున్నంత మాత్రాన సార్థకత లేదు.

నిన్ను నేను చిన్నప్పటినించీ ఎరుగుదును. నీ ఆదర్శాలను నా ముందు అనేకసార్లు చర్చించావు. నా చిన్నతమ్ముడు

లాగ నావద్ద వుపదేశాలు స్వీకరించావు. నీ జీవన యాత్రలో నా మాటలు నువు మరచిపోకుండా ఉంటావని నా ఆశ.

పత్రిక నడపటం అనేది అనేక బాధ్యతలతో కూడుకున్న పని. అంతేకాదు, అనేక విఘ్నాలు వస్తూ వుంటాయి. ప్రాతికూల్యాన్ని అనేకం ఎదుర్కోవలసి వస్తుంది. కాబట్టి ఓపిక ఆత్మనిగ్రహం అవసరం. నిశ్చలమైన విమర్శనాశక్తి వార్త పత్రికకు ప్రాణం. కర్తవ్యవైముఖ్యం పెద్ద దోషం. అన్నింటినీ మించి నీ చరిత్ర విశుద్ధమైనది, నీకు సమాజంలో గౌరవం వుంది. దుర్భాషలు గాని పలుకరాదు, సౌజన్యంలేని రాతలు రాయకూడదు. ఇతర్లను నిందించి కించపరచేందుకు కాదు... ఇతర్లను అభ్యుదయ మార్గాన నడిపించేందుకే నీ శక్తి ఎల్లప్పుడూ కేంద్రీకృతం కావాలి. అదే నా కోరిక — ప్రగతి మార్గాన నీకు అప్రతిహత విజయము లభించుగాక !

—శరత్.

౮౧

17 అశ్విని 1341.

శ్రీమతి లాల్ రాయ్ కి !

సత్యం, శివం, సుందరం...ఇవి కళాసాధనకు మూల సూత్రాలని పెద్దలు చెప్పారు. అంటే సాధన సత్యాన్ని, సౌందర్యాన్ని ఆధారం చేసుకుని వుండాలి; దాని ఫలితం లోక కళ్యాణం — విజ్ఞాన పిపాసకి (తత్వవిజ్ఞానం మాట కాదు. మామూలు సాంసారిక అర్థంలోనే విజ్ఞానం అన్న పదాన్ని వాడుతున్నాను.) అంటే వైజ్ఞానికునికి సత్యం ఒక్కటే మూల మంత్రం. అతని సాధన ఫలితం సుందరం కావచ్చు, కాకపో

వచ్చు. కళ్యాణం కావచ్చు, కాకపోవచ్చు. అయితే మంచిదే. కాకపోయినా మంచిదే. అందుకే దేనిమీదా ఆసక్తి వుండదు.

కానీ సాహిత్య సేవలో నిమగ్నులైన మీరు చాలరోజుల నుంచీ చూస్తున్నారు కదా; అనుగతంగా సత్యం సుందరం అన్న ఈ రెండింటికీ విరోధమే కనిపిస్తూ వుంది. ప్రపంచంలో ఒక సంఘటన సత్యంగా జరిగియుండవచ్చు. కాని అది సాహిత్యంలో సుందరం కాకపోవచ్చు. ప్రపంచంలో సుందరం అయినది సాహిత్యంలో మిథ్య పొందని కూడాను. సత్యమని నే నెరిగివున్న దానికి రూపకల్పన చేసి చూద్దుమకదా అది బీభత్సంగా తయారౌతోంది. అంతేకాదు, అసత్యాన్ని వర్జించినప్పటికీ సుందరమైన రూపం తయారు కావటం లేదు. 'శివం' అనుదాని విషయంలో కూడా వ్యవహారం ఇలాగే వుంది. కాబట్టి సాహిత్య క్షేత్రంలో ఈ ప్రశ్న అప్రసంగికంగా కనిపిస్తోంది.

ఒక ప్రశ్న అడుగుతాను: సత్యము సౌందర్యానికి విరోధిస్తే, కళ్యాణం – అకళ్యాణములు గౌణములైతే సాహిత్య సాధనలో ఈ సమస్యకు సమాధానం ఏమిటి?

—శరత్

౨౩

శ్రీ పశుపతి చట్టోపాధ్యాయ్‌కి !

...నే నెందుకు నాటకాలు రాయటంలేదో తెలుపవలసిందిగా కోరావు. అసలు ఈ ప్రశ్న నీకు రెండు కారణాలవల్ల ఉదయించి వుంటుంది. మొదటిది: నాటక రచయిత ఇంకా ఇతర్లు రాసిన నవలలను నాటకాలుగా మార్చి రాసినవాడు అయిన శ్రీ యోగేశ చౌదరి 'వాతాయన' పత్రికలో నాట

కాల్ని గురించి సమీక్షిస్తూ వెలువరించిన [illegible] ప్రాయాలు నీకు పూర్తిగా నచ్చలేదు కాబోలు. [illegible] : నువు అనేక నాటక ప్రదర్శనాలు చూసివుంటావు. [illegible] భావం, భాష, కథాసంవిధానం—ఇవన్నీ [illegible] [illegible] పరిశీలించిన మీదట నీకు...'శరత్ బాబు నాటకాలు గనక రాస్తే నాటక రంగంలో కొంచెం అభిలషణీయమైన పరివర్తన వస్తుంది—అనే అభిప్రాయం ఏర్పడి వుంటుంది.

నీ ప్రశ్నకు నేను చెప్పే జవాబు ఏమంటే — నేను నాటకాలు రాయను. అందుకు కారణం: నాకు ఓపిక లేదు. ఒకవేళ ఓపిక లేదన్న మాట మరచిపోయి నాటకాలే రాయటానికి ఆరంభిస్తినా కూలి గిట్టదు. అంటే—నేను కేవలం డబ్బు కోసమే రాస్తున్నానని అనుకోవద్దు. ప్రపంచంలో మనిషికి దాని ఆవశ్యకత చాలా వుంది. కాని అదొక్కటే ప్రధానం కాదన్న సంగతి నే నెప్పుడూ మరచిపోను. నవల రాస్తే మాస పత్రికా సంపాదకుడు దాన్ని శ్రద్ధగా వచ్చి పట్టుకుపోతాడు. నవలైతే అచ్చు వేయటానికి ప్రచురణ కర్తలూ చాలామంది వున్నారు. నవలలు చదివేవాళ్ళూ చాలామంది దొరుకుతారు. కథలు, నవలలూ రాసేటప్పుడు పాటించాల్సిన నిబంధనలు నాకు తెలుసు. అవి నాకు తెలియజెప్పండి అని అంటూ పోయి మరొకరి కాళ్ళ గడ్డాలు పుచ్చుకోవలసిన దుర్గతి నాకు లేదు. కాని నాటకం రాయాలంటే...దాని మంచి చెడ్డలు నిర్ణయించేవాడు ప్రధానంగా స్టేజి అధికారి ఔతున్నాడు. ఫలానా ఫలానాచోట్ల *Action* (నటన) ఎక్కువ అక్కర్లేదని మనం చెబితే అతడు "ప్రేక్షకులు ఒప్పుకోరు. ఈ నాటకం

ప్రదర్శించటానికి వీల్లేదు—బాగుండదు" అని అన్నాడంటే — అతని నిర్ణయానికి తిరుగు వుండదు, అతను సర్వజ్ఞుడు. అతనికి ప్రేక్షకుల అభిరుచులన్నీ తెలుసు. అందువల్లనే నేను నాటక రచనకు దిగలేదు.

బహుశః నేనూ నాటకాలు రాయగలనేమో. నాటకంలో ఎక్కువ ప్రయోజనీయమైన వస్తువు కథోప కథనం. అది చక్కగా లేకపోతే ప్రేక్షకులను ఆకర్షించటం కష్టం. అట్టి కథోపకథనం సాగించటంలో నాకు అభ్యాసం వుంది. విషయం ఎలా చెప్పాలి?...ఎంత సరళంగా చెబితే పాఠకుల మనస్సుకు హత్తుకుపోతుంది? — ఈ కౌశల్యం నాకు లేకపోలేదు. అదిగాక చక్కని సన్నివేశాల్ని సృష్టించే నేర్పు కూడా నాకు వున్నదనే నా విశ్వాసం. నాటకంలో చరిత్ర సృష్టికోసం సన్నివేశాలు ఏర్పాటు చెయ్యాల్సి వస్తుంది. చరిత్ర సృష్టి రెండు రకాలు. ఒకటి: సన్నివేశాల పరంపర సహాయంగా పాత్రలను ప్రేక్షకుల ముందు ప్రవేశపెట్టుట. రెండు: ఘటనా పరంపరలో నించి ఆయా పాత్రలలో పరివర్తన చూపుట. ఈ పరివర్తన మంచికీ కావచ్చు, చెడుకీ కావచ్చు. ఇరవై సంవత్సరాల క్రింద ఒక వ్యక్తి విల్సన్ హోటలులో భోజనం చేసేవాడు; అబద్ధాలాడేవాడు, ఇంకా అనేక కార్యాలు చేస్తూ వుండేవాడనుకో. ఇప్పుడతను పరమ ధార్మిక వైష్ణవుడుగా మారిపోయాడు. ఈ పరివర్తన కపటమైంది కాదు, నిజంగానే జరిగిందనుకుందాం. అనేక సంఘటనలకు వశుడై, పది పదిహేను మంది సత్పురుషుల ప్రభావంచేత నిజంగా అతనిలో ఈమార్పు

వచ్చి యుండవచ్చు. కాబట్టి ఇరవై సంవత్సరాల క్రింద అతనున్న దశ—అదీ సత్యమే; ఈనాడు మారిపోయిన తరువాత అతని దశ—ఇదీ సత్యమే. కాని మార్పు ఏదో విధంగా చూపిద్దామంటే లాభంలేదు. నాటకంలో, రచనా విధానంలో పాఠకునికి ప్రేక్షకునికి ఈ మార్పంతా సత్యమే ననిపించేటట్టు వుండాలి. రచనలో ఎంత వెదకినా ఈ పరివర్తనకు కారణం ఏమిటో కనిపించటం లేదే—అని వాళ్ళు అన్నట్టుగా వుండకూడదు. రచన చాల కష్టం. మరో సంగతి: నవలలో వలెగాక నాటకంలో ఒక్కొక్క సన్నివేశాన్ని ఒకానొక నిర్ణీతమైన హద్దును దాటి సాగించకూడదు. నాటకంలో ఒకటి తరువాత ఒకటిగా సన్నివేశాల్ని దృశ్యాలుగానో, అంకాలుగానో విభజించుకోవాలి. కొంచెం ప్రయత్నిస్తే అదికూడా నాకు దుస్సాధ్యం కాదు. కాని నేను నాటకం రాస్తాననుకో. దాన్ని ప్రదర్శించే దెవరు? సుశిక్షితులు, బాగా తెలిసిన వాళ్ళూ అయిన నటీనటులు ఎక్కడ దొరుకుతారు? నాటకంలో నాయికపాత్ర ధరించి నటించగల అభినేత్రి నాకింతవర కెక్కడా కనిపించలేదు. ఇలాగే ఇంకా అనేక కారణాలవల్ల నేను సాహిత్యంలో ఈ దిక్కుకు అడుగు వెయ్యటానికి మనస్కరించటం లేదు. వర్తమాన నాటకరంగం ఇంకా బాగా అభివృద్ధి చెందుతుందనే ఆశిస్తున్నాను. నాటకరంగంలో కూడా వాస్తవికతకు ప్రాధాన్యం వచ్చినప్పుడు నేనూ ఏదైనా రాస్తాను. కాని ఎక్కువగా నా మీద అటువంటి ఆశలు పెట్టుకుని లాభంలేదు.

—శరత్.

12 మాఘం 1342

జహానారా చౌధురీకి :

నీ పత్రిక వార్షిక సంచికకు నన్నేమైనా రాయమని కోరావు. ఇప్పుడు నేనేమీ అధికంగా రాయటం లేదు. సాహిత్య ధర్మం, రూపం, నిర్మాణం-ఇత్యాది అంశాలను గురించి మధ్య మధ్య చాలమంది సమీక్షిస్తూ వచ్చారు. కాని సాహిత్య ప్రయోజనానికి సంబంధించిన అంశాన్ని మాత్రం ఎవరూ స్పృశించలేదు. లోకకళ్యాణానికి వుపకరించే శక్తి సాహిత్యంలో ఎంతవరకు వుందో ఎవరూ సమీక్షించలేదు. కావ్యం రసపుష్టి కలిగి పాఠకుని మనస్సుకు ప్రశమలానందం చేకూర్చినట్టే మానవునిలో అంతర్నిహితమై వుండే కుసంస్కారాల మీద దెబ్బ తీస్తుంది కూడానని ఎంతమంది ఒప్పుకుంటారు? అట్టి సాహిత్యంవల్ల ప్రయోజనం మానవాభ్యుదయం. మానవుని దృష్టి విశాలం ఔతుంది. అట్టి సాహిత్యం ప్రసాదించే నూతన సంపదవల్ల అతని సహనశీలము, క్షమాశీలము అయిన మనస్సు ఐశ్వర్యవంత మౌతుంది.

కాని వంగదేశంలోని ఒక జాతివారిలో ఈ ఫలితాలు కనిపించటం లేదు. వారు సాహిత్యం సృష్టి చేస్తూవున్నా, దానితో పాటు ఒక వేదన, క్షోభ ఎక్కువగా ప్రకటితమౌతూ వుంది. మీ ముసల్మాన్ జాతిని గురించే చెబుతున్నాను. కొందరు కోపంవచ్చి భాషను వికృతం చేయటానికి కూడా వెనుకాడటం లేదు. అందుకు కారణం లేదని నే ననటం లేదు. కాని కోపం చల్లారిన తరువాత ఏ నాటికైనా ఆ కారణం అంత బలీయమైనది కాదని వారే గ్రహించుకో గలుగుతారు. ఏ కారణంవల్ల

నై నాగానీ ఇంతవరకూ వంగదేశంలో సాహిత్యవ్యాసంగం ఎక్కువగా హిందువులదే. చాల కాలం ముసల్మానులు వుదాసీనులుగానే వున్నారు. కాని సాధన ఫలితం ఊరికే పోదు. వాగ్దేవి వాళ్ళనూ కనికరించింది. వాళ్ళలోనూ కొద్దిమంది రచయితలు బయలుదేరారు. వారిని నేను మరచిపోను. కాని ఎక్కువమంది ముందుకు రావటం లేదు. అందువల్ల మీలో కొందరు కోపం వచ్చేసి వంగ సాహిత్యాన్ని యావత్తూ హిందూసాహిత్యం అని ముద్రవేశారు. ఆవిధంగా ఆక్షేపించినందువల్ల చర్చించి రుజువు చేసినట్లు అవదు.

కాని వంగసాహిత్యంలో ఎంతమంది రచయితలు తమ గ్రంథాల్లో ముసల్మానుల జీవితగాథలను చిత్రించారు. వారి సుఖదుఃఖ సమస్యలను చర్చించారు? వారితో సన్నిహిత సంబంధం ఎలా లభిస్తుంది? వారి హృదయాలు ఎలా తెలుసుకో గలగటం? వారి హృదయాలను తెలుసుకోలేక పోయారన్నమాట నేను అంగీకరిస్తున్నాను, అందువల్ల ఏర్పడిన దుష్ఫలితమూ కాస్త కూస్తా కాదు. ఇందుకు ప్రక్రియ ఇప్పుడు ఆలోచించవలసి వుంది.

ఈ విషయమై ఒక ముసల్మాన్ మిత్రుడు కొన్నాళ్ళ క్రితం నాదగ్గరకు వచ్చి చాల హృదయ బాధ వెల్లడించాడు. అతడు సాహిత్య సేవకుడు, పండితుడు అధ్యాపకుడు, పాత సంప్రదాయాల కుళ్ళుతో అతని హృదయం కలుషితంకాలేదు. హిందువులు, ముసల్మానులు ఈ రెండు సంప్రదయాలవారూ ఒకే దేశంలో ఇరుగుపొరుగునే వుంటూ, పుట్టినదాదిగా ఒకే భాష మాటాడుతూ కాలక్షేపం చేస్తున్నప్పటికీ అదేమిటో

మరి భిన్నభిన్నంగా, [illegible] ల్యాగానే సంచరిస్తూ వున్నాయి. [illegible] ఉంది. ఇరువర్గాల వారూ ప్రాంతీయక [illegible] ఏవో యిచ్చి పుచ్చుకో[illegible] [illegible] — [illegible] పరస్పర సాన్నిహిత్యం కల్పి[illegible] [illegible] కారణం తెలుసుకోలని ప్రయత్[illegible] [illegible] ఈ విభేదాల్ని రూపుమాపాలి. ఈ రెండు జాతులమధ్య [illegible] ఏర్పడిన యీ మహాదంతరాన్ని పూడ్చెయ్యాలి లేకపోతే ఎవరికీ క్షేమం లేదు—అన్నాడతడు.

"ఔను - ఆమాట నిజమేకాని ఈ దుస్సాధ్యాన్ని సాధించేందుకు మార్గం ఏమన్నా ఆలోచించావా?" అని అడిగాను.

అతడన్నాడు; "సాహిత్యం ఒక్కటే అందుకుమార్గం. మీరు మమ్మల్ని బైటికి లాగండి స్నేహబుద్ధితో, సానుభూతితో మా సమాచారంకూడా రాయండి. కేవలం హిందువుల కోసమే హిందూ సాహిత్యం సృష్టించకండి. ముసల్మాన్ పాత్రలుకూడా ఉన్నారన్న సంగతి జ్ఞాపకం పెట్టుకోండి. పైకి ఎంతో అంతరం ఉన్నట్టు కనిపిస్తున్నా ఇరుపక్షాల వారికీ కష్టనష్టాలు, సుఖదుఃఖాలు సామాన్యమే కదా ?"

నేనన్నాను: "ఔను ఆమాట నాకు తెలుసు. కాని అనురాగంతోపాటు విరాగం, ప్రశంసతోపాటు తిరస్కారం, మంచిమాటలతోపాటు చెడ్డమాటలుకూడా కథాసాహిత్యానికి అపరిహార్యములే. కాని ఆ సంగతి మీరు విచారించరు; కోపం తెచ్చుకుంటారు; ప్రతీకారానికి బయలుదేరి వస్తారు. ఆ సంగతి

తలచుకుంటేనే వొళ్ళు జలదరిస్తుంది. లేనిపోని గొడవ తెచ్చి పెట్టినట్టవుతుంది."

మరి కొంత సేపటివరకూ మేమెవరమూ మాటాడ లేదు. నేను చివరకన్నాను "మీరు వీరులనీ, మేము పట్టి పిరికి వాళ్ళమనీ మీలో కొంతమంది అంటూ ఉంటారు. హిందువు రచనల్లో తమను నిందించినట్టు ఎక్కడైనా కనిపిస్తే మీరు ఊరుకోరు; కశి తీర్చుకోటానికే ఉద్యుక్తులౌతారు. మీరంతా వీరులమని చెప్పుకుంటే వ్యక్తిగతంగా నాకేమీ ఇబ్బందిలేదు. అదీగాక 'మేము వీరుల'మన్న భావం మీకు మారిపొతే ఎక్కువగా క్షతిగ్రస్తులు అయ్యేది మీరే. ఆ సంగతి నాకు తెలుసు."

నా యువకమిత్రుని ముఖం విమర్ణమైపోయింది. అడిగాడు "అయితే ఈ సహాయ నిరాకరణం శాశ్వతంగా సాగిపోతూ ఉండవలసిందేనా ?"

నేనన్నాను: "ఊహుఁ శాశ్వతంగా ఇలా ఉండదు. ఎందువల్లనంటే సాహిత్యసేవకులు భిన్నమతాల వారైనా లోతుగా ఆలోచిస్తే వారి జాతి, సంప్రదాయం విభిన్నంకాదు. మూలతః వారి అందరి హృదయం ఒకటే. ఈ సత్యాన్ని గుర్తించి నేనున్న ఈ మహాదంతదాన్ని తొలగించాల్సింది మీరే."

"అందుకు ఇవాళనించే ప్రయత్నిస్తాను" అన్నా డతడు.

"ప్రయత్నించు. నీ ప్రయత్నం ఫలిస్తే నీకు భగవంతుని ఆశీర్వాదం ప్రతిరోజూ అనుభావ్య మౌతూ ఉంటుంది" అన్నాను నేను.

—శరత్.

ఖాజే, శివపురం, హౌవడా
20-3-1918

తా జీ వ మూ ద్ కు !

రెండురోజుల క్రితమే నీ ఉత్తరం, 'చిత్రపరివార్' అందాయి. చివరికథ 'హామిద్' తప్ప మిగిలిన మూడుకథలు చదివాను. ఈ నాడు కథలు చదివి ఆనందించటం, వాటిని ప్రశంసించటం దుస్సాధ్యాగా ఉన్నాయి. ఒక పుస్తకాన్ని ఉపహారంగా పొంది రచయితకు నాలుగు మంచిమాటలు చెప్పి ఉత్సాహపరిచే అవకాశం ఇప్పుడు కల్పించినందుకు ధన్యవాదాలు. నాకు నిజంగా చాల సంతోషం అయింది. ఇది నిజంగా నీ ప్రథమ ప్రయత్నమే అయితే ముమ్ముందు ఇంకా ఉత్తమ రచనలు వెలువరించగలవని ఆశిస్తున్నాను.

నీరచనల్లో ఉర్దూపదాల కొన్ని వ్యవహారంలోకి తెచ్చావు. అది చాలా మంచిపని. లేకపోతే ముసల్మానులు ఈ భాషను తమ మాతృభాషగా నిస్సంకోచంగా స్వీకరించలేరు. ఇది హిందువుల భాష అనీ తమ భాషకాదని పదే పదే అనుకుంటూ ఉంటారు. ఇరుగు పొరుగు వారుగా జీవిస్తున్న ఈ రెండు జాతులవారి మధ్య సాహిత్య సమైక్యత చేకూర్చటానికి ఇలా అనేక ఉర్దూపదాలు వ్యవహారంలోకి తీసుకురావటం ప్రయోజనకరమైన సాధన ఔతుంది కాని అందరు సాహిత్య పరులూ ఇందుకు ఒప్పుకోరు; నేను మాత్రం ఒప్పుకుంటాను.

నీకు ఒక్క విషయం జ్ఞాపకం చెయ్యాలని నా ఊహ. సాహిత్య క్షేత్రంలో నేను చాల రోజులనుంచీ కృషిచేస్తు న్నాను. కొంత అనుభవంకూడా గడించినవాడినే. ఏదో ఉప

దేశం చేస్తున్నానని కోపం తెచ్చుకోవద్దు. హిందువుల్లోనూ, మహమ్మదీయుల్లోనూ అన్ని జాతుల్లోనూ మం[illegible]ళ్లు ఉంటారు. చెడ్డవాళ్ళూ ఉంటారు. [illegible] మరిచిపోకూడదు. ఇంకా ముఖ్యంగా జ్ఞాపకముంచుకోవలసిన అంశం ఏమంటే [illegible]చయిత ఏ ఒక్క విశేషజాతి సాంప్రదాయికుడు మాత్రమో అయిఉండడు. అతడు హిందువుడు, మహమ్మదీయుడు, క్రైస్తవుడు, యూదేయుడు—అన్నీని.

—శరత్.

౮౫

సామతాబేడ్, పానిత్రాస్ పోస్టు,
24 ఆషాఢం 1333.

శ్రీ ఉమాప్రసాద్ ముఖోపాధ్యాయ్‌కు!

ఉమాప్రసాద్! నీ ఉత్తరం మొన్న చేరింది. పూర్వంలాగే ఇప్పుడు కూడా... ఇప్పుడు కాదు ఇక ముందుకూడా ఎల్లప్పుడూ నువ్వు ముందడుగు వేస్తూ వుండాలనీ నిజంగా నా కోరిక. నువ్వు ఎక్కువగా అధ్యయనం చెయ్యలేదనుకో. ఆ సంగతి నాకు తెలుసు. అయినా తేలిగ్గా నిన్నుమించి ముందడుగు వేయగలవాళ్ళు అరుదు.

ఆ తరువాత నేను మళ్ళీ కలకత్తా వెళ్ళలేదు. ఇక్కడే ఈ సంకుచిత వలయంలోనే ఎలాగో రోజులు వెళ్ళబుచ్చుతున్నాను. ఒకసారి ఎప్పుడేనా పట్నం ముఖం చూచివచ్చానంటే మళ్ళీ ఇక్కడి పరిస్థితులకు అలవాటు పడేసరికి వారం పదిరోజులు పడుతోంది.

అవేగాక వర్షాకాలం బురదలోపడి వెళ్ళటం కష్టం. పూర్వంలాగ ఓపిక లేదు. పట్నంలా లేదు కొన్నాళ్ళ క్రితం ఒక రాత్రిపూట రెండుమెట్లు వున్నచోట ఒకమెట్టు వున్న దనుకుని దిగబోయాను సరికి ఏడు జన్మాలో అదే జరిగింది. పైకి మనిషిని బాగానే వున్నాను. కాని పిక్కలదగ్గర బాధ, నడుము నొప్పి ఇంకా పూర్తిగా తగ్గనే లేదు.

పరీక్షలు శ్రద్ధగా రాయాలి. కుముదబాబు కలిస్తే... అతని ఉత్తరం అందిందని చెప్పు. వ్యాసం ఏమయిందో నాకు తెలియదు. బహుశః పోయింది కామోసు.

నీ పుస్తకం నా దగ్గరే వుంది. చివరి అధ్యాయాలు చూస్తున్నాను, మొదట పరీక్షలు గానీ.

అందరూ నన్ను ఇంకా రాయమంటారు. ఏమి రాయాలో నాకేం బోధపడటం లేదు. అంతా అర్థహీనంగా, అనవసరంగా కనిపిస్తోంది. ఇతర రచయితలవలె నేనూ నా మనస్సును పూర్వంవలె సాహిత్యసేవ వైపు మరలించుకో గలిగితినా బహుశః ఇంకా అనేక 'బిందుకాలల్లో' 'చరిత్రహీన్' లను రాస్తాను. కాని ఆ దశ మళ్ళీ వస్తుందని నాకు తోచదు. రాస్తేమాత్రం ఏం ప్రయోజనం! లోకులు ఆనందిస్తారా? ఆనందించగల అర్హత వాళ్ళను మొదట సంపాదించుకోని. అప్పుడు బిందుగారబ్బాయి, రామునిబుద్ధిమంతతనం లాంటివి రాసేవాళ్ళు చాల మంది పుట్టుకొస్తారు.

నిర్మల్ ఇంకా భవానీపూర్‌లోనే వున్నాడా? చెయి చూడ్డం నేర్చుకోవాలని నాకు కోరిగ్గా వుంది. నీకు నా ఆశీర్వాదాలు.

—శరత్.

12 శ్రావణ 1333

ఉమాప్రసాద్ ! నిన్న నీ ఉత్తరం చేరింది. అంతకు ముందుకూడా ఒక ఉత్తరం రాశావు, చేరింది. జవాబు రాయలేక పోయాను.

ఇప్పుడే ఒక పల్లెవానికి మందిచ్చి వస్తున్నాను. ఒళ్ళంతా టించర్ అయోడిన్ రాసి; జావ కాచిపోసే యేర్పాటు చేసివచ్చాను. నిన్న రాత్రి వాడిపడవ మునిగిపోయి వాడిమీది నించి కొట్టుకుపోయింది.

ఒక రకంగా నిశ్చింతగానే ఉన్నాను. ఇల్లు రూపనారాయణ (నది)కు ఒప్పగించేసి ఒక నిట్టూర్పు విడిచాను. పొలాల మీద, అడవులమీద నదికి ఎంత కోపమో బాగా అర్థమైంది. మీరు వంతెనమీదుగా నడిచి వచ్చేవాళ్ళు కదూ! ఆ వంతెన ఇప్పుడు లేదు. పొలాలన్నీ నీటిమయం అయిపోయాయి. వంగదేశంలో 'షడృతువులు' అంటే యేమిటో ఒక యేడాదిపాటు ఇక్కడ కాపురం ఉండకపోతే తెలియదు. ఇదీ ఒక రకంగా మేలే.

ఇంకా పది పధ్నాలుగు రోజులదాకా ఈ వరదలు ఇలాగే వుంటాయి. పంటలు పాడైపోతాయి. ఇక్కడనుంచి నేను త్వరగా బైటపడే ఆశ ఏమీ కనిపించటం లేదు.

ఫౌంటెన్ పెన్ అలాగే పడివుంది. టార్చిలైట్ పగిలిపోయింది. నీ వకీలు పరీక్షాఫలితం ఏమైనట్టు? నీకు నా ఆశీస్సులు. నా శరీరస్థితి మరీ అధ్వాన్నంగా లేదు.

—శరత్.

18 కార్తీకం 1313

బిజూ... చాల రోజులనించీ నీ దగ్గరనుంచి ఉత్తరం లేదు. నువ్వు ఎక్కడ వున్నావో కూడా నాకు కబురు తెలియదు. ఇదివరకన్నా నా ఆరోగ్యం బాగానే వుంది. రెండు 'ఇమెటిన్' ఇంజక్షనుల ఫలితం ఊరికే పోలేదు. కొంచెం రక్తం పట్టింది. సానటోజన్ ఔషధం పుచ్చుకుంటున్నాను. మాదీఫలరసాయనం కూడా సేవిస్తున్నాను. మనో చాంచల్యం తగ్గింది కాని బలహీనం మాత్రం ఎక్కువగానే వుంటోంది. వుండనీ లే. 'భారతలక్ష్మి' అనే మాసపత్రికకు సంపాదకుడుగా వుండటానికి అంగీకరించాను. ఇలా ప్రతిదానికీ అంగీకరిస్తూనే వుంటాను మరి. ఇవాళే ఒక ఉత్తరం రాశాను. నేను పెట్టిన షరతును వారు ఒప్పుకున్నారంటే సంపాదకత్వం స్వీకరిస్తాను. ప్రపంచంలో అందరికీ జరిగినట్టే నాకూ జరిగింది. ప్రపంచంలో బుద్ధిమంతులూ వుంటారు, తెలివితక్కువ వాళ్ళు వుంటారు. ఒక పక్షం ఓడిపోవటం తప్పదు. అయిదారువేల రూపాయలదాకా నాకు బాకీలు వున్నాయి. 'భారతలక్ష్మి'కి సంపాదకుడుగా వుద్యోగం స్వీకరించి ఈ బాకీ మొత్తం తీర్చేస్తాను. వాళ్ళు నాకు నాలుగోవంతు భాగం ఇస్తారు. వాళ్ళు ఎంత లౌకిజ్ఞులుగా వ్యవహరిస్తున్నారో నేనూ అలాగే వ్యవహరిస్తాను. అంటే వాళ్ళు నన్ను మోసం చెయ్యడానికి వీల్లేకుండా ప్రవర్తిస్తాను. దసరా పండగలయిపోగానే వ్యవహారం పరిష్కారం చేసుకుంటాను. ఈలోగానే ఉత్తరాలు వస్తున్నాయి చాలమంది దగ్గరనించి... తమ రచనలు తీసుకుని అర్జెంటుగా డబ్బు పంపించండి అంటూ ఇంతకు నాకటువంటి శక్తి వుంటే నా! ఆ శక్తే నాకిప్పుడెంతైనా కావాలి.

నిన్ను చూచి చాల రోజులైంది. మీ యింట్లో వాళ్ళకు జ్వరం నయమైనట్లయితే నువు ఒకసారి ఇక్కడికి రాకూడదూ? నీకు నా ఆశీస్సులు.

—శరత్.

౮౮

24, అశ్వనీదత్త రోడ్, కాళీఘాట్ - కలకత్తా,
12 కార్తీకం 1343.

బిజూ! నిన్న పల్లెటూరునుంచి ఇక్కడికి రాగానే నీ ఉత్తరం చూశాను. వెంటనే తిరిగి రావాల్సి వచ్చింది. పెద్ద కోడలుకు న్యూమోనియా జ్వరం వచ్చిందని అక్కడికి కబురు పంపారు. గాభరా ఏమీ లేదు. త్వరలోనే నయంకావచ్చు. లేకపోతే పేదవాణ్ణి - కలకత్తాలో ఎన్నాళ్ళని ఈ ఖర్చులు భరాయించగలను?

నా 61 వ జన్మదినానికి కవిగారు అకృత్రిమమైన భాషలో మంగళాశీస్సు పంపించారు. 'ఆనంద బజార్' పత్రికలో ప్రచురితమైనంతవరకు నీకు పంపిస్తున్నాను. కవిగారి స్వహస్త లిఖితమైన ఆశీర్వాదమే నాకు పంపించారు. నువ్వు ఇక్కడికి వచ్చినప్పుడు... వారి ఇతర ఉత్తరాలతోపాటు దీన్నికూడా నీ దగ్గర దాచిపెట్టటానికి ఇస్తాను.

నేను పూర్ణారోగ్యంగా లేననుకో. అయినా పూర్వం కంటే ఆరోగ్యంగా వున్నాను. ఇప్పుడు జ్వరం రావటం లేదు. నీకు నా ఆశీస్సులు. మీ అన్నలకు నా వందనాలు!

—శరత్.

(౨౫)

రా

బాజే - శివపురం,
29 పుష్యం 1824.

రవీంద్రనాధ ఠాకూర్‌కు!

శ్రీ చరణములకు! ఇవ్వాళ మేము మీ వద్దకు రా దలచి బయలుదేరాం. కాని మధ్యలో శ్రీ ప్రమథ బాబు ఇంటి నుంచి టెలిఫోన్ చేసి కనుక్కుంటే, మీరు బోలాపూర్ వెళ్ళి నట్టు తెలిసింది. బహుశః మీరు మాఘోత్సవాలకు తిరిగివస్తా రేమో! కాని అప్పుడొచ్చి మిమ్మల్ని కలుసుకోటానికి మాకు తీరదనుకుంటాను.

మా పల్లెటూరులో ఒక చిన్న సాహితీసమితి స్థాపించాం. ఒకటి రెండు నెలలో ఎక్కడో ఎవరి యింట్లోనైనా సమావేశం జరపటానికి ఆలోచిస్తున్నాం. భారీ ఏర్పాట్లేమీ లేవు, అతి సాధారణమైన రీతిలో జరుగుతుంది. నిసుడు ప్రమథబాబును పట్టుకుని సభాపతిని చేశాం.

మేము చాలరోజులనించీ మాలో మేము తర్కించు కుంటూ...మీ పాదధూళితో ఈ మా సమితి పవిత్రం కాగల సావకాశం వుందో లేదో నిర్ణయించుకో లేకుండా వున్నాం.

మీరు తిరిగి యింటికి వచ్చాక అనుమతి యిస్తే మేము వచ్చి తమ దర్శనం చేసుకుంటాం.

మీ సేవకుడు
శరచ్చంద్ర చట్టోపాధ్యాయ.

బాజే - శివపురం, హౌవడా,
9 వైశాఖం 1329.

శ్రీ చరణములకు... మీరు నా పట్ల సంపూర్ణ అసంతృప్తులైనట్లు పిల్లలద్వారా విన్నాను, మిమ్మల్ని గురించి నేనేదైనా లేనిపోని మాట ఆవేశంలో అంటే అని వుండవచ్చు. కాని ఆ మాట నిజమో అబద్ధమో తెలుసుకోవాలని ఆ వ్యక్తి మీ దగ్గరకు వచ్చి అడగటం మంచిపని కాదు. ఆ పంజాబ్ దేశీయుడు రాసిన లేఖను పురస్కరించుకొని మీరు ఇంగ్లండు విషయమై చాల క్షుబ్ధచిత్తులైనారు. అసలు తను లేఖ రాయకుండానే వుంటే ఈ గొడవంతా వచ్చేది కాదు—ఇలా ఆ సమయంలో ఏమేమి మాట్లాడానో నాకు సరిగా జ్ఞాపకం లేదు, నేను కల్పించి అబద్ధాలు చెప్పేవాడిని కాను నా నోట ఎప్పుడూ అబద్ధమనేది రాదని కాదు ఈ సారి మీరు విదేశాల నించి వచ్చాక చాల మారిపోయారనీ, వంగదేశ ప్రజలపట్ల మీ కిదివరకుండిన ప్రేమ, వాత్సల్యం ఇప్పుడు లేవనీ రావటం, అసహయోగోద్యమం పట్ల మీకు లేశమాత్రమూ శ్రద్ధ, విశ్వాసం లేవని...ఇలా కొన్నిమాటలు నే నన్న మాట నిజమే.

ఒకనాడు మిమ్మల్ని కలిసి మాట్లాడి కోపంతోనే తిరిగి వచ్చేశాను. ఆ తరువాతనే కొన్ని లేనిపోని విషయాలు ప్రచారం చేసి వుంటాను. లోకులు అపార్థం చేసుకుంటే చేసుకుంటారులే అన్న నిర్లక్ష్యభావం నాకు కలిగివుంటుంది.

మీ యెడల నేను మహాపరాధమే చేశాను, కాని ఇది మొదటి తప్పే కాబట్టి క్షమించండి. మీ ఒక్కరి దగ్గరకు తప్ప ఇంకెవరి దగ్గరకూ...వాళ్ళెంత గొప్పవాళ్ళయినా సరే...నేను సాధారణంగా వెళ్ళను. కాని నా స్వయంకృతాపరాధం వల్లనే

మళ్ళీ మీ దగ్గరకు రావటానికి ముఖం చెల్లకుండా చేసుకున్నాను. ఇది నాకు చాల విచారంగా వుంది.

మీ అనేకమంది శిష్యులలో నేనొకడిని. వారికి మల్లేనే నేను కూడా మిమ్మల్ని ఎప్పుడూ నిందించలేను. కాని ఈ సారి ఈ దౌర్భాగ్యం ఎందుకు పట్టిందో తెలియదు. ఇవే మీకు నా నమస్కారాలు.

—సేవకుడు, శరత్.

## ౯౧

బాజే - శివపురం, హావడా,
26 వైశాఖం 1336.

శ్రీ చరణములకు... క్షుద్రమైన స్వార్థం పురస్కరించుకుని మీకు దేశానికి అభాగ్యం చేకూరుస్తున్నానని... ఇంత పెద్దనింద నేను నిజంగా మీమీద వేసినట్లయితే... ఉత్తరం రాసి క్షమాపణ యాచించినా అది పరిహాసాస్పదంగానూ, మిమ్మల్ని అవమాన పరిచినట్లుగానే వుంటుంది అందువల్లనే మీ ఉత్తరంలోని ధోరణి తీవ్రకోప చిహ్నాంకితమై వున్నదంటే ఆశ్చర్యం లేదు.

ఈ సమాచారమంతా మీకు చేరవేసిన వాళ్ళు నా అపరాధాన్ని కొండంతగా మీకు చెప్పి వుంటారు.

ఇక నేను చెప్పేదేముంది ? మీకు నా నమస్కారాలు.

—సేవకుడు, శరత్.

## ౨

బాజే - శివపురం, హోవడా,
2 మాఘం 1330.

శ్రీ చరణములకు...మీకు వెయ్యిపను లుంటాయి; క్షణంకూడా తీరిక వుండదని మాకందరికీ తెలుసు. అయినా మీకా ఉత్తరం ఎందుకు రాశానంటే—మీగు గీతం మాటాడి నంత తేలికగా రాయగలరు. ఆ గీతం ఒక్కటి వుంటే నా నాటకంలోని లోపాలన్నీ అడుగున బడిపోతాయి—అలా అనుకుని రాశాను.

సత్యేంద్ర్ బ్రతికివుంటే మీ ఉత్తరం తీసుకుపోయి చూపించి గీతం రాయించుకు వచ్చేవాడిని. ఈ ఉత్తరాన్ని అతడు ఆజ్ఞగా పరిగణిస్తాడు, కాని అతనిప్పుడు పరలోకంలో వున్నాడు. నేనిప్పుడెవరి దగ్గరకుపోయి రాయించుకు రాగలను?

మీరు కలకత్తా వస్తే ఊపిరి తీసుకోటానికి కూడా తీరిక వుండదు. అటువంటప్పుడు నేనీపని పెట్టుకుని వచ్చి మిమ్మల్ని బాధించను. అనేక నమస్కారాలు.

—మీ సేవకుడు, శరత్.

## ౩

సామతాబేడ్, పానిత్రాస్ పోస్టు,
26 మాఘం 1336

శ్రీ చరణములకు...ఈ దసరాపండుగల సందర్భంలో మీకు నా అశేష నమస్కారాలు. అనేకములైన బాధ్యత గల పనుల్లో నిమగ్నుడనై యున్నందున నా నమస్కారాలు పంపించటం ఆలస్యమైంది.

మీ ఆశీర్వచనమే నాకు సర్వోత్కృష్టమైన పురస్కారము. మీరిచ్చింది స్వల్పదానమే అయినా సాహిత్యసేవకునికి మహాసంపద ఔతుంది. మీ దానం నాకు శిరోధార్యం.

నా అదృష్టం మంచిది. పోయిన భాద్రపద మాసంలో మీరు కలకత్తా రాలేదు. వచ్చివుంటే ఆనాడక్కడ జరిగిన అత్యాచారం చూచి మీరు చాల బాధపడి వుండేవారు. మిక్కిలి విచారకరమైన విషయం ఏమంటే నాతో సమవయస్కులైన సాహితీపరులే ఈ ఉపద్రవాన్ని లేవదీశారు. నేను సాక్షి మాత్రుడుగానే వున్నాను. నిరుడుకూడా జయంతి వుత్సవాలప్పుడు వాళ్లు ఇంత గల్లంతు చేశారు; నే నెరుగుదును. ఒకసారి వచ్చి మీకు నా నమస్కారాలు చెప్పుకోవాలని కోరిగ్గా వుంది. కాని మీరేమన్నా అనుకుంటారేమో నని సంకోచిస్తున్నాను.

మీ వొంట్లో ఎలా వుంది ఇప్పుడు? ఆరోగ్యం సరిగా లేకుండా వున్నా కూడా మీరింతగా పరిశ్రమ చేస్తున్నారంటే నిజంగా చాల ఆశ్చర్యంగా వుంది.

—మీ సేవకుడు, శరత్.

౯౪

బాజే - శివపురం, హావడా,
12-10-1920

శ్రీ కేదారనాథ్ వంద్యోపాధ్యాయకు:

కేదారబాబూ! మీ సమాచారం వినిపించారు. ఇక నా సమాచారం వినండి!

కొన్నాళ్ళనించీ వెన్నెముకలో పోటుగా వుంటోంది. ఇది మొదట అంత బాధ అనిపించలేదు. కాని అకస్మాత్తుగా ఒకనాటి రాత్రి పోటు ఎక్కువై నిద్రమెలకువ వచ్చింది. ఊపిరి తీయటం కూడా కష్టమనిపించింది. వేడినీటి కాపు పెట్టాక; తోమించాను. తెల్లవారేసరికి కాస్త తగ్గింది. కాని మళ్ళీ సాయంత్రం అయేసరికి డాక్టర్ని పిలవక తప్పలేదు. అప్పటినించీ బాధపడుతూనే ఉన్నాను. ఆ తరువాత ఒకనాడు మోటారు లోనించి జారిపడ్డాను. నడుములు పట్టుకుపోయాయి. కాని నల్లమందు ఉందిగా అందుకు ప్రతిక్రియ! దాన్ని నమ్ముకుంటే దుర్దినాలు చాలవరకు తప్పిపోగలవు. మూలవ్యాధి వస్తేనే గాని మనం కైలాసానికి వెళ్ళలేము. ఇది శ్రీ దేవాదిదేవుడు మనకిచ్చిన వరం. ఆ వ్యాధి లక్షణాలు కనిపించకుండా ఉన్నంత వరకూ మనకు నిశ్చింత విచారపడాల్సిన అవసరం ఏమీ లేదు.

ఇందు మూలాన్నే సురేశ్‌కు జవాబు రాయలేదు. అతని అసంపూర్తి కథవిషయమై నా అభిప్రాయం చెప్పవలసిన తరుణం ఇంకా రాలేదు. ఇంకా రెండుమూడు రచనలతనివి చూడాలి. మాటనుబట్టి అతను లేనిపోని అర్థాలు తీస్తాడేమో! పత్రం, చిత్రం ఇలువంటి వాటిని బాగున్నాయని చెప్పటనికి వీల్లేదు. కాని మున్ముందు ఇంకా బాగా రాయగలడని ఆశించవచ్చు.

జ్వరం వల్ల ఈసారి 'భారత వర్ష'కు 'లేన్ దేన్' శీర్షిక క్రింద నేనేమీ రాసిపంపలేదు.

మీ చేతిలో చుక్కాని ఉన్నన్నినాళ్ళు 'ప్రవాసజ్యోతి' మునిగిపోతుందేమోనన్న భయం ఉండనక్కర్లేదు. ఈ చెడు

రోజుల్లో మీరు నల్లమందు ఎక్కువగా తగ్గిస్తూ ఉండాలి, కర్తవ్య పాలనను మించిన వస్తువు ప్రపంచంలో మరేదీ లేదు.

—శరత్.

౯౫

బాజే-శివపూరం, హావడా,

18-11-1920

కేదారబాబూ! మీ ఉత్తరం అందే నేను భాగల్పూర్లో ఉండగా నాకు చేరింది. మీ పట్ల నా ప్రవర్తన నిందా పాత్రంగానే ఉంది. తప్పనిసరిగా అలా చేయవలసి వచ్చింది. మరి ఇకముందెన్నడూ అలా చెయ్యను. జ్వరంతో మంచం ఎక్కాను. జ్వరం నయం అయినాక మరో ఇబ్బంది వచ్చిపడింది. ఈ నెలలో మీకు ఏదైనా రచన పంపించేవాడినే. కాని 'భారతవర్ష'కు ఏమీ పంపలేకపోయినందువల్ల మీకేమీ పంపటం మానేశాను. వాళ్ళకు పంపకుండా మీకు పంపితే వాళ్ళకు చాల బాధ కలుగుతుంది, అంతేకాదు. వాళ్ళను అవమానపరచినట్లుగా కూడా ఉంటుంది.

ఈ నెలనుంచి మళ్ళీ నియమితంగా పంపిస్తూవుంటాను. నాతో వ్యవహారం పెట్టుకున్న వాళ్ళకు ఇలాగే జరుగుతూ ఉంటుంది. బుద్ధిపూర్వకంగా నేనేమీ అన్యాయం చెయ్యను. కాని ఇలాగే ఇంకా అయిదుగురిని కూడా ఇబ్బంది పెట్టాను. మీరు క్షమించాలి.

మీకిప్పుడు ఆరోగ్యంగా ఉంటోందా? అప్పుడప్పుడు కబురు తెలుపుతూ వుండండి. ఈ సారి సాధ్యమైనంత తొందర

గానే పంపిస్తాను. మీరు ఆందోళన పడనక్కర్లేదు, . మీకూ, మిత్రులకూ నమస్కారములు.

—శరత్.

౯౬

బాజే, శివపూరు, హౌవడా,
6-4-1924

కేదారబాబూ! నా మాటలకూ చేతలకూ, సామంజస్యం లేకండా ఉంది. మిమ్మల్ని ఒకసారి కలుసుకోవాలని నేను మాటిమాటికీ అనుకుంటున్నాను, అని చెబితే మీరు నమ్మరు. మీకు నేను ఉత్తరాలు కూడా రాయటంలేదు. సాధారణంగా ఎవ్వరికీ రాయనని చెప్పవచ్చు. కాని మీకు నామీద ఎంతో ప్రేమ ఉన్నదన్న సంగతిమాత్రం ఎప్పుడూ మరచిపోను.

వార్తాపత్రికలద్వారా కబురు తెలుసుకుని నాకు దీర్ఘాయుష్యం కలగాలని కోరుతూ మీరు ఉత్తరం రాశారు. అటువంటి మీ ప్రేమ హృదయాన్ని మరచిపోను.

కాని దీర్ఘాయుష్యం ఎందుకు చెప్పండి. 'రేపువచ్చెయ్యి' అని కబురువస్తే "ఇంకొక రోజు ఆగి వస్తాలే" అని మాత్రం నేను అనను. నిజం చెపుతున్నాను.

చాలకాలం బ్రతికాను. ఇక తిన్నగా ఎప్పుడో జారుకోటమే మంచిది. చూచే వాళ్ళకూ, వినే వాళ్ళకూ ఇంపుగా వుంటుంది. 49 ఏళ్లునిండితేనే గాని నాకు మారకం లేదని జాతకంలో వుందిట. "ఎందుకు బాబూ! నాకు దబ్బున విడుదల ప్రసాదించండి. ఇంగ్లీషువాడి జైళ్ళలోనించి కూడా విడుదల

కొత్తగా ఏమైనా రాస్తున్నప్పుడల్లా "ఈ రచనలో భావాల్ని సహృదయంలో గ్రహించే శక్తిగల వ్యక్తి ఆయన తప్ప మరెవరున్నారు" అని అనుకుంటూ ఉంటాను మీ రచనలను గురించి మీరెప్పుడూ ఒక్కమాటకూడా చెప్పలేదు. ఇంతవరకు ప్రచురితాలైన మీ పుస్తకాలన్నీ చదివాను. ఈ ప్రశంసకు బదులు మళ్ళీ ప్రశంస అప్పగించటానికి నాకు సంకోచంగా వుంటుంది. మీరు విశ్వసించరేమో నని అనుమానం వేస్తుంది.

వర్షాకాలం వస్తుంది. దసరా వెళ్ళిపోతుంది. మీరు ఇక్కడికిరారు, నేను అక్కడికిరాను. మీరు నాకన్నా వయసులో పెద్దవారు. మీరు నన్ను ఆశీర్వదించండి. నేను మిక్కిలి అలసిపోయాను. తుచ్ఛ సుఖాలు, తుచ్ఛ దుఃఖాలు కొంతసేపు నవ్వటం, కొంతసేపు ఏడవటం విసుగెత్తిపోయింది. నాకు 48 ఏళ్ళు గడిచాయి. చాలు చాలు. ఇంకా నేనిక్కడ ఉండి పొందవలసిందేముంది? ఇంకా ఎందుకాలస్యం? మీరు నన్ను ఆశీర్వదించండి.

—శరత్.

౯౮

సామతాబేడ్, పానిత్రాస్ పోస్టు,
8 వైశాఖం 1333

కేదార్ బాబూ! మీ పోస్టుకార్డు చేరి చాలా రోజులైంది. ఉత్తరం చిన్నదైనా సాన్నిహిత్య పిచ్చిలాగా ఉంది. మీకు నామీద ఎందు కింత ప్రేమో నాకు తెలియదు. ఒకడు మరొకని ప్రేమించటానికి హేతువుగా కాదగిన గుణాలు నాలో ఏమీ లేవు. పైగా దోషాలే అసంఖ్యాకంగా వున్నాయి.

ఆ నాడు రవిబాబు దిలీపకుమార్ రాయికి రాశారు: "శరత్ బాబు బుద్ధిపూర్వకంగా ఏ ప్రాంతమో వెళ్ళిపోయి నిస్సంగియై నిర్బంధ దీక్షలో ఉన్నాడట గదా! అతని జాడ జవాబు తెలియటంలేదు. మీకు తప్పకుండా తెలిసేవుంటుంది. ఎప్పుడైనా కలిస్తేగాని, ఉత్తరం వ్రాస్తేగాని, అతనికి కుశలమన్నానంటే నేనతని క్షేమాభివృద్ధిని వాంఛిస్తున్నానని చెప్పు" అని.

కేదార్ బాబూ! నిర్బంధదీక్షలోనే ఉన్నాను. నేను పట్నంలో ఉన్నా, గ్రామంలో వున్నా, అసలు ప్రపంచానికి పూర్తిగా దూరమైపోయాను.

రోజురోజుకూ ఆరోగ్యం తల్లకిందైపోతోంది. 61 వ యేడు దాటగానే చచ్చిపోతానని జాతకంలో వున్న మాట నీకూ జ్ఞాపకంవుందికదూ? ఇంకా రెండేళ్ళు మాత్రమే వ్యవధి వున్న చిన్నమాట. భగవంతుడు ఎలా చేసినా చెయ్యనీ నాకు శ్రమ మాత్రం అధికం చెయ్యకుండా ఉంటేచాలు.

శాన్‌ఫ్రాక్ వెడదామనుకున్న నాటికి ఒక రోజు ముందుగా చాలసార్లు డోకులు వెళ్ళాయి. పొట్టలో చాల నొప్పి పుట్టింది. డాక్టరుగారి ఆజ్ఞ ప్రకారం అయిదారు రోజులు మంచంమీదే పడివున్నాను. ఇప్పుడు కొంచెం కులాసాగానే వుంది. మిమ్మల్ని ఒకసారి వచ్చి కలుసుకోవాలని ఎంతైనా కుతూహలం ఉంది. ఎండలు కొంచెం తగ్గితే కాశీవస్తాను. వచ్చేముందు నాకోసం ఒక ఇల్లు అద్దెకు తీసుకుని వుంచ వలసిందిగా మీకు రాస్తాను.

ఇప్పుడు నేను చేస్తున్న పనేమీ లేదు. రూపనారాయణ నది ఒడ్డున ఇల్లొకటి కట్టాను. రాత్రింబగళ్ళు పడక కుర్చీలో పడి వుంటున్నాను.

హరిదాస్ కలిస్తే నా ఆశీస్సులు అతనికి అందించండి. ఇంచు మించు ఆరోగ్యం గానే వుంటున్నాను. మామూలు సుస్తీతప్పితే మరేమీ లేదు. మీకు నా నమస్కారాలు.

—శరత్.

౯౯

సామతాబేడ్, పానిత్రాస్ పోస్టు,
22 కార్తీకం 1333

కేదారబాబూ! మీ ఉత్తరం చేరింది. రాయవలసిన విశేషాలేమీ ఎక్కువ లేవు. ఎప్పుడక్కడికి వచ్చి మీతో పాటు కాలక్షేపం చేద్దామా అని వుంది. నేనింత హృదయ దౌర్బల్యం కలవాడినని ఇంతవరకు ఎరుగను. ఈ వ్యథ (భ్రాతృ వియోగ జనితం) ఎలా భరించ గలను.

—శరత్.

౧౦౦

సామతాబేడ్, పానిత్రాస్ పోస్టు,
23-2-19:3

కేదారబాబూ! ఇంతవరకూ బ్రతికే వున్నాను. మీకు నా నమస్కారాలు. మరి మీరో! ఉన్నారు కదూ? బ్రతికే వుంటే మీ సమాచారం తెలపండి. లేకపోతే ఏం చేస్తాం. ఇప్పటి నా పరిస్థితిలో మీకు జవాబు రాయలేకపోయినా నాకు కోపంరాదు. నిజంగా నాహృదయం; చాల ఉదాసీనమూ

కాశీ జ్ఞాపకం వస్తూంది. నాకీ అంత్య కాలంలో, లభించే పాథేయం అంతే కామూలు! ఇదివరకల్లా నాకు కాశీ వెళ్లాలని పిచ్చిగా వుండేది, ఇప్పుడా కోరిక లేదు. ఎందువల్లనంటే నువ్వు కాశీలో ఉండటం లేదాయె. కేదారబాబూ! మీరు కారు కాశీ వదలిపెట్టినట్లేనా? ఇంతకూ వున్నామనుకుంటో నే ఉంటారా? దాన్ని విడిచిపెట్టాలంటే మీకు చాల బాధ లున్నాయి, నాకు తెలుసు.

ఇక్కడ సామతాబేత్‌లోనే నా నివాసం స్థిరమైపోయి నట్టుంది. కాని నా కిక్కడేమీ బాగుండటం లేదు. ఎక్కడ వుంటే బాగుంటుందో అదీ నాకు తెలియటం లేదు. దసరా వెళ్ళాక ఆ విషయంలో ఒక నిర్ణయానికి వస్తాను.

నా 'షోడశి' ని గురించి మీ కెవరు చెప్పారు? శిశిర బాబు అభినయం మీరు చూచారా? చాలబాగ అభిన యిస్తాడు సుమీ! నా నవల ఆధారంగా తిరుగ రాయబడిన నాటకం అది. అచ్చుకూడా అయింది, మీరు చదివారా? 'నాటకం' ఎలా వున్నా ప్రదర్శనం మాత్రం బాగుంటోంది.

మీ ఆరోగ్యం ఇప్పుడెలా వుంటోంది? కులాసాగా వుంటోందా? మీరు ఇంకా కొన్నాళ్ళు బ్రతికి వుండి ఇంకా కొన్ని కథలు రాయాలని నా కోరిక. మీరు రాస్తూన్న ప్రతి పంక్తి చదవుతున్నాను. మధురంగా వున్నందువల్ల సుమీ! సాహిత్యపరుని రచనలు కావటంవల్ల చదువుతున్నాను.

నేను ఇంకా బ్రతికే వున్నాను; ఈ బ్రతికి వుండటం విసుగు పుట్టించేంతగా మామూలు పాట అయిపోయింది. జవాబు రాయటం మరచిపోవద్దు.

—శరత్.

౧౨౩

సామతాబేడ్, పానిత్రాస్ పోస్టు,
27 జులై 1934

కేదార్ బాబూ! విజయదశమి, సంక్రాంతి సమయం వినమ్ర భక్తిపూర్వక నమస్కారాలు. పెద్దలు మీ ఆశీస్సును పొందిన నేను సాత్త్విక జన్ముడనైనానో నాకింకా తెలీదు. కాని నేను స్నేహ మర్యాదను జడత్వముతోనూ, సోమరితనంతోనూ మాత్రంతోనే పాటించి యుండలేను. మిమ్మల్ని తలచుకోకుండా ఒక్క నెలకూడా గడపను. బాహ్యంగా సోమరిలా ఉంటాను. ఏమరుపాటున్న కొద్దీ మీరు నన్నెక్కడ అపార్థం చేసుకుంటారోనని భయపడుతూ వుంటాను.

—శరత్.

౧౨౪

1 కార్తికం

'కుండలీ కాఫలాఫల్' ఇవాళ ఉదయమే పూర్తి చేశాను. బాగుంది. నావంటి మామూలు మనిషిని ఏమనుకుని ఇంతగౌరవాన్ని ఇస్తున్నారు? సాహిత్యపరులు ఏమనుకుంటున్నారు దాన్ని గురించి.

చాల బాగుంది. దీనులను, దుఃఖితులను పీడితులను ఆత్మీయులుగా భావించి మధురంగా మీవలె రచన సాగించే వాళ్ళు అరుదు. భగవంతుడు మీకు చక్కని భాషా నైపుణి ప్రసాదించాడు. పుస్తకంలో ఒక హితోపదేశం కూడా వుంది. "ఏ రోజునైనా కలం పట్టలేకపోతే ఆరోజంతా వృథాగా గడిచి పోయినట్లుగానే విచారం కలుగుతుంది." అన్నాడొక యువకవి. రాసినా రాయకపోయినా ఈ పరమ సత్యాన్ని ఇక

నుంచి ప్రతిదిమూ పాలిస్తాను. నెలలతరబడీ గడచిపోతున్నాయి. కలం పడదామంటే మనసు పోవడంలేదు. మీ ఆశీర్వాదం వల్ల ఇకబ్రతికి వున్నన్నినాళ్ళూ ఆమాట జ్ఞాపకం పెట్టు కుంటాను.

పుస్తకంలోవున్న ఒకే ఒక పొరపాటు సూచిస్తున్నాను, మీరు కోప్పడకండి. భగవంతుడు నీకు చక్కని రచనా కౌశలాన్ని ఇచ్చాడు, కాని ఐశ్వర్యవంతుడు మితవ్యయమే చేస్తూ వుండాలి. ఆ సంగతి మరచిపోకూడదు. రచనా పాటవం చాలదు. రచన సంయమంగాడా వుండాలి.

మీరు మళ్ళీ కాశీ ఎప్పుడు వెళ్ళేదీ నాకు ముందుగా కాస్త రాయండి. ఇకనుంచి మీ వుత్తరాలకు మర్నాడే జవాబు రాస్తూవుంటాను. నమస్తే.

విజయను ఆశీర్వదిస్తూ మీరు రాసిన వుత్తరం ఇప్పుడే చేరింది. నమస్కారములు.

—శరత్.

౧౦౫

సామతాబేడ్, పానిత్రాస్ పోస్టు,
25 కార్తీకం 13 6

కేదారబాబూ! మీరు దయతో రాసిన వుత్తరం చేరింది. కాస్త మనస్సుకు శాంతి చిక్కితే జవాబు రాద్దామని కాలక్షేపం చేశాను. కాని అటువంటి సదవకాశం లభించేట్టు లేదు. అయినా ఏదో రెండు ముక్కలు రాద్దామని కూచు న్నాను. ఇప్పటికే చాల ఆలస్యం అయిపోయింది. అపరాధం ఇంకా ఎంతకాలం మొయ్యను? అందుకనే రాస్తున్నాను.

గ్రామంలో నివాసం ఏర్పరచుకున్నందుకు తగినఫలితాలు బాగానే అనుభవంలోకి [illegible] దావాల్లో, క్రిమినల్ కేసుల్లో చిక్కుకుని [illegible]న్నాను.

ఈ మూడేళ్ళ [illegible] ఇక్కడ [illegible]ంగా, అంటీ అంట కుండా, శాంతంగా కాలక్షేపం చేశాను. కాని గ్రామదేవత సహించలేక పోయింది నా గుండెలమీద ఎక్కి [illegible] చేయటం సాగించింది. జమీందార్లను తప్పించుకున్నా స్థానికంగా వుండే వుద్యోగస్థుల బాధ [illegible]ంగా వుంది. శివాలయానికి చాలరోజుల క్రితం జమీందారు నాలుగైదెకరాల భూమి దానం చేశారు, కాని ఇక్కడి వుద్యోగస్థుడు సహించలేకుండా వున్నాడు. బీద ప్రజలు ఏడిచారు, మొత్తుకున్నారు. నేనూ ఈ వ్యవహారంలో తగులుకున్నాను. 'నే నసలు వ్యవహారంలో చొరబడ్డానంటే విడిచిపెట్టేవాడిని కాదు' అని అతనికి కబురు చేశాను. దావా మొదలైంది, గందరగోళం ఎక్కువైంది. ఇది ఏదో విధంగా పూర్తి అయినతర్వాత ఎక్కడికైనా పారిపోదామని చూస్తున్నాను. ఒక రకంగా పట్నవాసమే చాలా మేలు.

ఆ పుస్తకంలో పైకి హాస్యంగా కనిపిస్తూన్నా అనేక లోతైన మధురమైన అంశాలు వున్నాయి. పుస్తకం నా గదిలో పక్కమీదే వుంది. అప్పుడప్పుడు సావకాశం దొరికి నప్పుడెల్లా పది పదిహేను నిమిషాలు చదువుతున్నాను.

భాదుడీ మహాశయుని కథ నేను చదవలేదు. 'వసుమతి' వచ్చిందే తడవుగా పైకి వెళ్ళిపోతుంది. మళ్ళీ నా చేతికి రాదు. ఇంట్లోనే వుంటుంది. తీసుకుని చదవటం కష్టం కాదు.

చదివిన తరువాత కబురు తెలుపుతాను. కాని కథ మీదే. మీరే రాశారు ఆ సమస్యలన్నీ పరిష్కరించటం నాకేం చేతనౌతుంది? మీమీద పాండిత్యం వుపయోగిస్తే లోకులు సహిస్తారా? ఏమైనా ఆ కథను నాశనం చెయ్యాల్సిందే విరాశీలోగా కాశీ చేరుకుంటే నేను లాహోరునించి తిరిగి వచ్చేటప్పుడు అక్కడ దిగుతాను. నమస్కారాలు.

—శరత్.

౧౦౬

సామతాబేడ్ పాన్ర్తాస్ పోష్టు,
7 పుష్యం 1337

కేదారబాబూ! ఎప్పుడూ కూడా అవకాశం జారి పోయిన తర్వాతనే వస్తు విడిపోతూ ఉంటుంది. అందువల్లనే ఈ జీవితంలో అనేక వస్తువులు అతి సమీపంలోకి వచ్చినా కూడా చేతిలో చిక్కించుకోలేక పోయాను. మాటి మాటికీ ఉత్తరం రాద్దామనుకుంటాను, కాని రోజులు గడిచిపోతూనే ఉంటాయి. చివరకు ఎలాగైనేం రాసిన వుత్తరానికి ఇంతవరకూ జవాబు రాలేదు. నా నొసటిరాత ఇంతేనని ఊరుకుంటాను. ప్రేమించి కబురు తెలుసుకుంటూ ఉండటంలో గెలుపు నీదే. మరో జన్మ అంటూ వుంటే అపీలు చేస్తాను.

నేను ఎలా వున్నానో తెలుసుకోవాలని మీకు కోరిగా వుందా? బాగానే వున్నాను. రాత్రిం బగళ్లు పంచపాళీలో పడక కుర్చీలో పడి వుంటున్నాను. కుడికాలు అవుడు, కుడి చెవి వినిపించదు. మూలవ్యాధివల్ల రక్తస్రావం, క్షణ క్షణానికీ తునికిపాళ్లు తీస్తున్నాను. స్వప్నాలు కంటున్నాను. మళ్ళీ

మేలుకున్నంటున్నాను. ఎదురుగా నది కనిపిస్తూ వుంటుంది. నదిలో వెడుతూ వుండే పడవల్ని లెక్కపెడుతూ వుంటాను. అకస్మాత్తుగా మళ్లీ ఎప్పుడో నిద్ర వచ్చేస్తుంది; సర్వం మరచిపోతాను. కొంతసేపటికి కళ్ళు తెరచి "ఎవర్రా అక్కడ? చిలుము గొట్టం నింపి తీసుకురా" అంటాను. నింపి తీసుకొస్తాడు. పీల్చి చూస్తాను పొగరాదు. కోపంవచ్చి వాడిమీద కేకలేస్తాను. "మీరు నిద్రపోతుంటే లోపల పొగాకంతా కాలిపోయిందయ్యా" అంటాడు వాడు. అది నిజమో, అబద్ధమో పరిశీలించి తెలుసుకునే శక్తి లేదు. "నిద్రపోతున్నానంటా? అబద్ధాల పుట్టా? మళ్లీ నింపి పట్టుకురా. ఢిల్లీనుంచి తెచ్చిన ఈ చిలుము గొట్టం ఈ వేళప్పుడు ఆరిపోవటం ఏమిటి?" అని పెద్దగా కేకలు వేస్తాను. వాడు వెళ్ళిపోయినతర్వాత నాలో నేను అనుకుంటాను. "భగవంతుడనేవాడు నిజంగా వుంటే నా నౌకర్ని మన్నించి తీసుకుపోడేం? ఇంతగా నిన్ను నిందించేవాడు మరెవరూ లేరు. బాబూ చప్పున తీసుకుపోదూ!"

ఏనాటికైనా తీసుకుపోతాడు. నాకు తెలుసు. కాని నాకుమల్లె వాడూ కొన్నాళ్ళు గడపాలి. పిలుపు వచ్చింది. మృత్యువు సమీపిస్తోంది. నిద్రపోతూ నిద్రపోతూ మధ్యమధ్య మేల్కొని పుస్తకం తీస్తాను చదవటానికి. గ్రంథ పఠనం చాల రోజులనుంచీ జీర్ణించిన అలవాటు. ఎంతో నల్లమందు ఒంట్లో జీర్ణించిపోయింది. చాలమంది చేతుల్లో ఓడిపోయాను. కాని ఆబ్కారీ వాళ్ళనుమాత్రం నేనే ఓడించాను.

నా ఉత్తరాల్లో భాష అస్తవ్యస్తంగా ఉంటుంది. ఎంతో కష్టంమీదగాని అర్థంకాదు. అదే మీకు శిక్ష. అందువల్ల

కోపం వచ్చి అప్పుడప్పుడు కబుర్లు చెలుపనుగా ఉంటారేమో సుమా! నమస్తే!

—శరత్.

౧౨౭

సామితాబేడ్, పానిత్రాస్ పోష్టు,
5 ఆషాఢం 1338

కేదారబాబూ! ప్రేమపూర్వకంగా మీరు రాసిన ఉత్తరం సకాలంలోనే అందింది. కాని వ్యగ్రచిత్తుడనై ఉండటం వల్ల జాబు రాయటం ఆలస్యం అయింది. నిన్న హావడా జిల్లా ఎన్నికలు జరిగాయి. తిట్టుకున్నారు, కొట్టుకున్నారు; లాటీలు విసిరారు—కొన్ని హత్యలుతోగాని ఈ ఎన్నికలు పూర్తి కావేమో ననిపించింది. నేను సభాపతిని. అందువల్ల నేనుకూడా నియమానుసారం తయారుకావలసి వచ్చింది. సభలో గల్లంతు జరుగుతుందేమోనని భయపడ్డాను. అందువల్ల ఆవరణచుట్టూ ముండ్లతీగ చుట్టించాను. ఏర్పాట్లన్నీ నిర్విఘ్నంగా సాగాయి. పదేళ్ళనుంచీ నేనే సభాపతిగా ఉంటున్నాను. ఒక విధమైన స్వార్థం ఏర్పడింది. ఇవాళ తేలిగ్గా విడిచిపెట్టటానికి ఇష్టంలేదు. ఎలా విడిచిపెడతాం? మా పక్షంవాళ్ళ వాదం ఏమిటో తెలుసునా? "మేము పొరపాట్లు చేస్తే చేశాం. మీరెవరు అడగటానికి? దేశానికి స్వతంత్రం రావాలంటే మావల్ల వస్తుంది. మీవల్లేం రాదు. మీ రిందులో ఏమీ జోక్యం కలుగజేసుకోవద్దు" వాళ్ళు ఈ మాటలకు ఒప్పుకుంటే కదూ! అందువల్లే మాకు కోపం వస్తుంది. కాని వస్తుతః మా 'సుభాషీదళం' వారి స్వభావం మీకు మల్లెనే సాధువుగానే ఉంటుంది. ఇక

నాకు కొంత తీరిక చిక్కుతుంది. ఒకటి రెండు నెలల్లో పుస్తకం రాసేస్తాను. మీ ఉద్దేశం ఏమిటి?

మీరు కలకత్తా వచ్చినప్పుడు నాకు కబురు చెయ్యలేదేం? దారి ఖరాబుగా ఉన్నా ఏదో వుపాయం దొరక్కపోతుందా? మళ్ళీ కాశీ ఎప్పుడు వెడతారు? మనం ఒకసారి కలుసుకుంటే బాగుంటుంది. వెంటనే మీ క్షేమం తెలపండి.

—శరత్.

౧౦౮

24 అశ్వినీదత్త రోడ్,
కాళీఘాట్ - కలకత్తా.
24 కార్తీకం 1343

కేదారబాబూ! నేను మీకు హృదయపూర్వక నమస్కారాలు పంపుతున్నాను. ప్రపంచంలోకి నేను మీకంటే ఆలస్యంగా వచ్చాను. అందువల్ల ప్రపంచంనించి ఆలస్యంగానే వెళ్ళాలన్న కఠిన నిబంధన భగవంతుడేమీ విధించి యుంచలేదు. ఈ సంగతి నీకు తెలపటం అవసరమని నాకు తోస్తున్నది. ఒక యూరోపియన్ ఆఫీసులో ఒక గుమాస్తా వుండేవాడు. ఒకనాడు దొరగారు కోపగించుకోగా అత డన్నాడట: "*yes Sir, I come late, but I always go early*" (అవునండీ నేను ఆలస్యంగానే వస్తాను. కాని ఎప్పుడూ ముందుగానే వెడుతూ వుంటాను) అని. అలా కూడా జరగవచ్చు, కేదారబాబూ!

—శరత్.

హావ్‌డా రైల్వేస్టేషన్.
1-4-1930

చారుచంద్ర వంద్యోపాధ్యాయ్‌కు :

చారూ!...ఇవాళ ఢాకాకు ప్రయాణమై వచ్చికూడా తిరిగి ఇంటికి వెళ్ళిపోతున్నాను. ఇవాళ కలకత్తాలో రైల్వే కార్మికులు *C. S. P. C. A* కు విరుద్ధంగా సమ్మె చేస్తున్నారు. పరిస్థితులు భయంకరంగా వున్నాయి. పోలీసు సార్జెంట్లు వీపులు విరగకొడుతున్నారు. సిపాయిలుకూడా వచ్చి తుపాకులు పేల్చారు. నలుగురు చనిపోయారట.

కలకత్తాలో వ్యవహారం ఇలా వుంది. హావడాలో కూడా *C. S. P. C. A* వుంది. దానికి నేనే సభాపతిని. ఇక్కడకూడా విభేదాలు ఏర్పడ్డాయి మేజస్ట్రేటు, పోలీసు సూపరింటెండెంటు కలసి ఇవాళ ఎలాగైతేనేం గందరగోళం జరక్కుండా ఆపు చేశారు. కాని రేపు ఏమీ కానున్నదో చెప్పలేం. నేను సభాపతిని కావటం చేత ఇచ్చోటు వీడి ఎక్కడికీ వెళ్ళేందుకు వీల్లేకుండా వచ్చింది, కనుకనే తిరిగి ఇంటికి పోతున్నాను.

నువ్వు విచారపడతావని నాకు తెలుసు. కాని పరిస్థితులు ఇలా దైవికంగా మారిపోయాయి. ఏం చెయ్యను?

ఇక్కడ హడావిడి తగ్గిన తర్వాత ఆఫీసు వ్యవహారాలు చక్కబెట్టుకుని వస్తాను నిన్ను కలుసుకోటానికి. క్షమించు.

—శరత్

## ౧౧౦

బాజే - శివపురం, హౌవడా,
22-4-1925

చాయూ! ఇప్పుడే నీ ఉత్తరం చేరింది. నా మనస్సు ఇప్పుడు ఉత్తర ప్రత్యుత్తరాలు రాసే స్థితిలో లేదు. కాని నీకొక విషయం తెలుపవలసి వుంది. నేను అక్కడి నించి తిరిగి వచ్చేటప్పుడు త్రోవలో మృతప్రాయంగా పడివున్న మేక కనిపించింది. నీకూ జ్ఞాపకం వుండే వుండవచ్చు. ఆ తరువాత మెడ నులిమివేసిన కోడి కనిపించింది. 'ఇవాళ త్రోవలో ఇన్ని శవాలు కనిపిస్తూ వున్నాయేం?' అని అడిగాను. 'ఒక ఉడుము కూడా చచ్చిపడి వుందని నువు చెప్పావు. "ఎక్కడ?" అని నే నడిగాను. నేను దాన్ని చూడలేదు.

ఆ తరువాత మనం స్టేషను చేరుకున్నాం. నన్ను రైలు ఎక్కించి మీరు వెళ్ళిపోయారు. రైలు కదిలిన కాసేపటికి ఆ వైపున రాబందుల గుంపు, ఒక చచ్చిపోయిన కుక్క కనిపించాయి. నా పెంపుడు కుక్క ఆస్పత్రిలో వుంది. నా మనస్సు ఆ సమయంలో ఎంత ఖరాబై పోయిందో చెప్పలేను. ఇంగ్లీషు భాషలో *Superstition* (అంధ విశ్వాసం) అనబడే వస్తువు నాలో లేదు. కాని దారిలో మూడు శవాలు కనిపించేసరికి నాకు క్షణం కూడా శాంతిలేకుండా పోయింది.

ఇంటికి రాగానే భేలూ (కుక్క) కులాసాగా వున్నట్టు ఆసుపత్రి నుంచి కబురు తెలిసింది.

—శరత్.

౧౧౧

27-4-1925

గురువారంనాడు కుక్కను ఇంటికి తీసుకొచ్చాను. మళ్ళీ గురువారంనాడు వుదయం 6 గంటలకు భేలూ చచ్చిపోయింది. 24 గంటలూ నాకు తోడుగా వుంటూన్న కుక్క ఇప్పుడు లేదు. ప్రపంచంలో ఇంత బాధాకరమైన పరిస్థితి కూడా సంభవిస్తూ వుంటుందని నాకు తెలియదు. నా కిప్పుడొక విషయం తెలిసివచ్చింది. ప్రపంచంలో *Objective* అనేది ఏమీ లేదు. అంతా *Subjective*. ఇంతకూ అది ఒక కుక్క; అంతకు మించి ఏమీ కాదుకదా! భరత మహీపతిగాథ ఎన్నటికీ అబద్ధంకాదు.

—శరత్.

౧౧౨

28 మాఘం 1342

చారూ! ఈ మధ్య నేను ఇంటికి వచ్చాను. గ్రామంలో మట్టి యిల్లు, రూపనారాయణ నది—నన్ను ఎక్కడున్నా ఆకర్షిస్తూ వుంటాయి. కాని వాటి మాయలోనించి తప్పించుకుని బైటికి పోవడానికి యింకా ఎన్నోనాళ్ళు వ్యవధి లేదు. పాత స్నేహితులంతా నాకన్న ముందే వెళ్ళిపోయారు. వారంతా ఎప్పుడూ జ్ఞాపకం వస్తూవుంటారు. వుపాధ్యాయుడు విపినగుప్త చనిపోయాడు. అతని శ్రాద్ధానికి రమ్మంటూ యిప్పుడే ఆహ్వానం వచ్చింది. ప్రతిరోజూ సాయంత్రమప్పుడు అతడూ నేనూ కబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేసేవాళ్ళం. నువ్వూ నా పాత స్నేహితులలో వాడివే. నీ కన్నా ముందుగానే నేను దాటిపోగలనని ఆశిస్తున్నాను. అస్తమానం గడచిన రోజులు గురించే స్మరించుకుంటూ వున్నాను. భవిష్యతును

గురించిన ఆలోచనే రావటంలేదు. ఈ సంగతులన్నీ చెప్పటం వల్ల నీ మనస్సుకు బాధ కలిగించటమే తప్ప మరేం లేదు.

నీ రెండు ఉత్తరాలు చేరాయి. నాలోని ప్రశాంతి కల్పించాలని సంకల్పించి నీలో ప్రశ్నించిన నా విషయమై రాశావు. వాటికి నా పట్లగల నీ శ్రద్ధ, ప్రేమ అవే నాకు ఉత్సాహం. ఆ మాట తలుచుకున్నప్పుడల్లా నాకు సంతృప్తి ప్రాప్తిస్తోంది.

నేను ఢాకా వస్తే మీ ఇంట్లోనే వుంటాను. నా భక్తి పూర్వక నమస్కారాలందించి నీ భార్యతో చెప్పు: అమ్మాయి ఆదర పూర్వకమైన ఆహ్వానాన్ని నేను అవహేళన చెయ్యజాలనని.

—శరత్.

౧౧౩

5 ఆశ్విని 1334

'ఆత్మశక్తి' సంపాదకునికి :

మీ 'ఆత్మశక్తి'కి భాద్రపదమాస సంచికలో ఒక బాటసారి 'సాహిత్య విమర్శ' అనే శీర్షిక క్రింద రాసిన వ్యాసం చదివాను. అనేక సందర్భాల్లో పత్రికల్లో వంగ సాహిత్యంలోని నీతిని, అవినీతినీ చర్చిస్తూ చాల కటువైన మాటలతో రాస్తున్నారు. రసచర్చ చేస్తూ చాల కటువైన రసాన్నే ప్రవహింపజేస్తున్నారు. గుడిలో అర్చకుల సంఖ్య ఎక్కువైనకొద్దీ దేవునికి భోగం విస్తారంగా జరగవలసిందిపోయి కుంటుపడుతోంది.

ఆధునిక సాహిత్యపరులమీద చాల కటువైన మాటలతో విసురుతున్నారు. అలా దూషణ పాత్రులౌతున్న వారిలో నే నొకడిని. 'శనివారకీ చిట్టీ' అందుకు నిదర్శనం.

భాటసారి రాసిన 'సాహిత్య విమర్శ'లోని. చాల అంశాలతో నేను ఏకీభవిస్తున్నాను. కాని ఒక్క విషయంలో మాత్రం నాకు మత భేదం ఉంది.

రవీంద్రుని సంగతి రవీంద్రునికే తెలియాలి. కాని నా స్వవిషయం నాకు తెలిసినంతవరకు—శరశ్చంద్రుడు 'కల్లోల్' 'కాలీకలమ్' మొదలైనవేమీ చదవడు. చదవటాని కతనికి తీరిక ఉండదేమో" అని భాటసారి అనుమానిస్తున్నారు... చదివినా నాకు అన్ని విషయాలూ అర్థం కావన్న సంగతి నేను ఒప్పుకుంటాను. అదీగాక చదవకుండానే నేను ఇన్ని సంగతులూ తెలుసుకోగలనని వాదించటం లేదు.

ఇంతవరకు నా సంగతి. ఇకపోతే వివాదం దేన్ని గురించో, పరిష్కార మార్గం ఏమిటో... నా కది అగమ్య గోచరంగా ఉంది.

రవీంద్రనాథ్ సాహిత్య ధర్మాన్ని నిర్ణయించారు. నరేశచంద్ర దానికి హద్దులు నిర్ణయించారు. ఆ తర్కం, పాండిత్యం చూసి ముగ్ధుడనై పోయాను. ఇంకా వేరే చెప్పేదేముంది? కాని చాలానే చెప్పటమైంది. ఎవరి హద్దుల్లో ఎవరు కాలు పెట్టారో, ఈ కర్రసాము ఎందు కారంభం అయిందో ఎవరికి తెలుసు? 'విచిత్ర'లో శ్రీ ద్విజేంద్రనారాయణ బగచీ 'సీ మానేశర్ విచార్' మీద తన ఉద్దేశం తెలియబరిచాడు. ఇరవై పేజీల గట్టి వ్యాసం అది. అందులో చాల విషయాలు, చాల భావాలు ఉన్నాయి. గంభీరంగా వుంది. పాండిత్యమూ వుంది, వేద వేదాంతాలు, న్యాయశాస్త్రం, గీత, కాళిదాసు శ్లోకాలు, వ్యాకరణ ప్రకరణలు—అన్నీ వున్నాయి అందులో.

వాహెవా! మానవుడు ఇన్ని ఎప్పుడు చదువుతాడో! ఎలా జ్ఞాపకం పెట్టుకుంటాడో!

అతని యెదుట 'వంశేఖండ నిర్మిత క్రీడా గాంభీర్యధారి' నరేశచంద్రుడు పూర్తిగా వెల వెల బోయాడు. జీతం బత్తెం లేని మా నాటక సమాజం మెంబర్లలో నరసింహబాబు అని ఒక నటుడు వున్నాడు. చాల గొప్ప నటుడు. రాముడు, రావణుడు, హరిశ్చంద్రుడు—అన్ని వేషాలూ తానే వేయగలడు. అకస్మాత్తుగా ఇంకో వ్యక్తి ఊడిపడ్డాడు ఎక్కడినుంచో. అతని పేరు రామ నరసింహబాబు ఇంకా చాల గొప్ప నటుడు. కంఠ మాధుర్యంలోనే గాక హస్తపద విన్యాసాలందు కూడా ప్రతిభ శాలి. ఈ కొత్తగా వచ్చిన రామ నరసింహబాబు ముందు మా నరసింహబాబు శుక్లపక్ష తదియనాటి చంద్రుడి వలె కాంతిహీనుడై పోయాడు. అతని ముఖం నేను చూడలేదు. కాని ఊహకు ఎలా కనిపిస్తున్నదంటే... చేతులు మోడ్చి "ప్రభూ! ఈ బ్రతుకు బ్రతికేకంటె అడవిలోకి వెళ్ళిపోవటం మంచిదిలా తోస్తోంది" అని బ్రహ్మదేవునికి విజ్ఞప్తి చేసుకుంటున్నట్టు కనిపిస్తుంది.

ద్విజేంద్రబాబు శైలి జటిలంగా వుంటుంది. కత్తిలాగ పదునైన దృష్టిగలవాడు. మంచి తార్కికుడు. ఒక పెద్ద వలలో అలిచిప్పలు, చేపలు వేరుచేయగల పరికరాలు కలవాడు.

ఏమి అతని నిర్ణయాలు! ఏమి అతని రసచర్చ! చదివినకొద్దీ తృప్తి కలగదు. కవీంద్రుని, నరేశచంద్రుని ఇరువైపుల వుంచుకొని గొప్ప తెలివితేటలతో ద్విజేంద్రబాబు సింహావలోకనం చేశాడు.

కాని ఇంతకూ ఏం ప్రయోజనం !

అదే చాల విచారకరమైన విషయం. నరేశచంద్ర్‌గాని ద్విజేంద్రనాథ్‌గాని సాహిత్యపరులే. వారి భావాలు అవగతమవుతూనే ఉన్నాయి. కాని వీరి అదర సత్కారాల్ని ఆధారం చేసుకుని బైటివాళ్ళు వచ్చి పుస్తకంలో దూరి తాండవం ఆరంభిస్తే సద్దణగించేదెవరు ?

ఒక ఉదాహరణ చెబుతాను. 'ప్రవాసి'లోనే శ్రీ వ్రజదుర్లభ హాజరా అనే ఒక వ్యక్తి రస విచారం చేస్తూ ఒక వ్యాసం రాశాడు. యువక రచయితలమీద అతని దాడి. రస సృష్టిని గురించి తన అభిప్రాయాన్ని వివరిస్తూ ఇలా రాశాడు. "ఈ రోజుల్లో శిశువులు, విద్యార్థులు, అవివేకులు రాజనీతిని గురించి చెప్తూ వున్నారు. అలాగే అనుభవంలేని సాహిత్యపరులు కూడా డబ్బు సంపాదించాలన్న వుద్దేశంతో గ్రంథ రచనకు దిగుతున్నారు. దీని ఫలితం...గరిటె పట్టేవాడు కలం బడితే ఏమవుతుందో అదే అయింది "

ఈ వ్యక్తి వుద్యోగం చేసి చాలా డబ్బు కూడబెట్టాడు. బ్రతుకంతా నౌకరీలో గడిపినందుకు పెద్ద పెన్షన్ కూడా పొందుతున్నాడు. అందుచేత సాహిత్య సేవకుల నిరంతర దారిద్ర్యం చూచి ఎగతాళి చెయ్యటానికి అతనికి సంకోచం లేదు. దారిద్ర్యం అనేది అపరాధం కాదనీ, అన్ని దేశాల్లోనూ, అన్ని యుగాల్లోనూ వారు స్వయంగా ఉపవాసాలు వుంటూ ఇతరులను పోషించారనీ ఆ పెద్దమనిషికి తెలియదు. అటువంటివారి మూలంగానే ఈ నాటికీ సాహిత్యం అంటే గౌరవం వుంది.

సాహిత్యంలోని మంచి చెడ్డలను గురించి సమీక్షించ టమూ, సాహిత్యపరుల సౌఖ్యానికీ సౌఖ్యాభావానికీ లేని దారిద్ర్యాన్ని సమీక్షించటమూ ఒకటే కాదు. ఈ సంగతి పండితుడూ, సహృదయుడూ అయిన 'ప్రవాసి' సంపాదక మహాశయునికి తెలియక పోలేదు. ఈ వ్యాసం ఆయనకు కష్టం కలిగించక పోలేదు. అప్పు డాయన రచయితను పిలిచి చెవిలో 'భాయీ! మానవుని దారిద్ర్యాన్ని అవహేళన చెయ్యటం సభ్యత కాదు. లంచాలు సంపాయించి ధనవంతుడైనంత మాత్రాన రసచర్చ చేయగల అధికారం లభించదు. లంచాలు సంపాదించటానికీ, రసచర్చకూ చాలతేడావుంది. నీకు అర్థం కాదులే" అని చెబుతాడని నా విశ్వాసం.

—శరత్.

౧౧౪

సామతాబేడ్, పాణిత్రాస్ పోస్టు,
1-6-1927

శ్రీ మణీంద్రనాథ్ రాయ్!

మణీంద్ర్! నీ ఉత్తరం సకాలంలోనే అందింది. కాని శరీర అస్వస్థత చేత రేపు రేపంటూ కాలయాపన చేశాను.

నువ్వు మాదగ్గరకు వస్తానని విని చాల సంతోషించాను. కాని నీకు చాల యిబ్బంది కలుగుతుంది. ఎండలిక్కడ చాల తీవ్రంగా వున్నాయి. రెండుగంటలప్పుడు మైదానంమీద నడిచి రావటం చాల భయంకరమైన విషయం. వర్షాలు కురిసిన తరు వాత ఎప్పుడైనా వస్తే బాగుంటుంది. అదీగాక నేను 6 వ తేది

దాక శివపురంలోనే వుంటాను. కొంచెం పనీ వుంది. శిశిర బాదుకీ థియేటర్‌లో 'షోడశి' రిహార్సల్సు చూడాలి.

'భారతి' పుస్తకం ప్రచురితం కావటంతోనే శివరామ చక్రవర్తి నాటకంగా మార్చాడు దాన్ని. నేను దాన్ని ప్రదర్శన యోగ్యంగా సరిచేశాను. బహుశః మరీ అన్యంగా వుండదు. వీలైతే నువ్వుకూడా ఒకసారి వచ్చి చూడు.

ఈలోగా ఒకరోజున సెలవుపెట్టి మీ దగ్గరకు వస్తాను. వచ్చి మీ నాన్నగార్ని కలిసి, బ్రాహ్మణభోజనం చేసి వద్దామని చాల కోరిగ్గా వుంది. మీ ఇంట్లో భోజనం చెయ్యాటమంటే నాకు చాల ప్రీతి. ఇక్కడ అంతా క్షేమం. కేవలం మూలవ్యాధివల్ల రక్తస్రావం ఎక్కువ కావటంచేత నీరసంగా వున్నాను.

మీరు కులాసాగానే వున్నారనుకుంటున్నాను భూపేన్ బాబు ఎలా వున్నాడు? నీకు నా ఆశీస్సులు.

—మీ అన్నయ్య, శరత్.

౧౧౩

సామతాబేడ్, పానిత్రాస్ పోస్టు,
27-8-1927

మణీంద్ర! నీ వుత్తరం చేరింది. నీ వుత్తరం చదువుకున్న తక్షణమే బయలుదేరి వద్దామనిపించింది. కాని తమ్ముడూ! నాకు ఆరోగ్యంగా వుండటంలేదు. రెండు వారాలనుంచీ ఇన్‌ఫ్లూయింజాలాగ జ్వరం వచ్చి చాలవరకు సత్తువ లాగేసింది.

అప్పీగాక స్టేషన్‌కు వెళ్ళే రోడ్డు... ఇటీవల వర్షాల మూలంగా తలచుకుంటే భయం వేస్తోంది. పాలకీలో ఎక్కి పోవాలను కుంటే ఏ మాత్రం మీదనుంచైనా పొరపాటుపడితే బోయీలు కాలుజారి కాలవలో పడేస్తారేమోనని భయం. ఇక్కడ భలే చోట్లో వచ్చి పడ్డాను. ఇక్కడి ప్రజలకు ఒక విశేషం ఉంది. వర్షాకాలంలో వాళ్ళకు గిట్టలు మొలుస్తాయి. ఎంత బురదలోనైనా సంతోషంగా నడిచి వెళ్ళగలరు. జారి పడతామేమోనన్న భయం వాళ్ళకు లేదు నాకు మాత్రం ఇంకా గిట్టలు మొలవలేదు. ఇంకా రెండు మూడేళ్ళు ఇక్కడే వుంటే నాకూ గిట్టలు మొలుస్తాయని అంతా అంటున్నారు. మొలిస్తే మొలుస్తాయేమో! కాని నాకు గిట్టలు మొలిచే నక్కర్లేదు. ఇదివరకల్లా ఎక్కడ వుండేవాడినో అక్కడికే వెళ్ళి పోతాను" అని చెప్పాను నేను.

ఇంకా మీ నాన్నగారిని కలుసుకోకుండా ఎన్నాళ్ళిలా గడుపుతానో చెప్పలేను. వారిది మధురమైన స్వభావం. వారి యెడల నాకు చాల శ్రద్ధ వారికి నా నమస్కారాలు. కొంచెం ఆరోగ్యం కుదురుకుంటే వచ్చి కలుసుకుంటాను.

షోడశీ నాటక ప్రదర్శనం ఒక్కసారే చూశాను. వానలో తడిసి, బురదలో నడిచి ఇన్ఫ్లూయింజా తెచ్చుకున్నాను. వీలుగా వుంటే నువ్వు ఒకసారి వచ్చి చూసిపో. నిజంగా శిశిరబాబు, చారు (జీవానందుడు, షోడశి) అభినయిస్తూంటే చూసి తీరాలి. నీకు నా ఆశీస్సులు.

—మీ అన్నయ్య శరత్.

## ౧౧౬

24 అశ్వినీ దత్తరోడ్, కలకత్తా,
25 వైశాఖం 1344,

సుద్రదేవీ !

ఉత్తరాలు రాయటానికి నాకు కాగితం ఇంకా చేర లేదు. బహుశః మరచిపోయారనుకుంటాను. మళ్ళీ జోరుగా జ్వరం తిరగబెట్టింది. నెత్తురుతీసి పరీక్ష చేసినమీదట ఏమీ కనిపించకపోయినా...ఇది మలేరియా తప్ప మరేమీ కాదని ఆయన నిశ్చయం చేసేశాడు. నా రోగంగాథ వదిలిపెట్టెయ్యి. ఒకమాట : ఇప్పుడు గొప్పవారి యిళ్ళల్లో ఆడపిల్లలకు 'అంజలి' అని పేరు పెడుతున్నారు. కాని అందరూ 'అంజలీ!' అని దీర్ఘంగా రాస్తున్నారు. 'అంజలి'ని 'అంజలీ' అని రాసినంత మాత్రాన స్త్రీలింగం ఔతుందా ? వంగభాషలా అలా ఔతుందని కొంతమంది అంటున్నారు — నాకైతే తెలియదు. వీలుగా వుంటే ఒకసారి నువ్వు ఇక్కడికి వచ్చిపో. నీకు నా ఆశీర్వాదాలు !

—నీ అన్నయ్య, శరత్.

## ౧౧౭

[1913 చివరలో రాసింది]

...కొన్నాళ్ళు సెలవుపెట్టి బర్మాలోనే ఆరోగ్యవంతమైనచోటికి ఎక్కడికేనా వెళ్ళి కాలక్షేపం చేద్దామనిపిస్తూ వుంటుంది అప్పుడప్పుడు. కలకత్తాకు వెళ్ళాలనిపించటం లేదు. ఏదో నిర్ణయించుకుని మున్ముందు రాస్తాను. మొత్తంమీద కులాసాగానే ఉన్నాను చదువు, రాత బందైపోయాయి పూర్తిగా. మీరు నన్ను కలకత్తాలో వచ్చి ఉండమని రాస్తు

చిందన్న మాట. నాకు మళ్ళీ బాగా ఆరోగ్యం చిక్కితే ఇది వరకు సంకల్పించినట్టుగానే చేస్తాను.

ఇంతకూ అది ఒక స్త్రీ రచించిన గ్రంథం అనుకుని ఎవరూ తీవ్రంగా విమర్శించటానికి పూనుకుని ఉండకపోవచ్చు. అది నేను రాసిందేనని మణిలాల్‌కు ఎలా తెలిసింది? మానసి ప్రవాసి, సాహిత్య మొదలైన పత్రికల వాళ్ళకు కూడా ఎలా తెలిసింది? నువ్వు ప్రచారం చెయ్యలేదుకద! ఔను. నా రచనల్ని బాగా ఎరిగినవాళ్ళు గ్రహించగలరు; సాధారణ పాఠకులకు మాత్రం తెలియదు.

—శరత్.

[ ౯ ]

54, 36, వ స్ట్రీట్, రంగూన్,
1-1-26

...మీతో నాకు పరిచయ భాగ్యం లేకపోయినప్పటికీ మీ ప్రశంస, ఆశీస్సు పొంది ధన్యుడనైనాను. మీరు ఒక వృద్ధులని వ్రాశారు, నేనూ ఒక రకంగా వృద్ధుడినే. నాకు 39 ఏళ్ళు ఒకవేళ వయసులో మీకన్న చిన్నవాడినైతే... నా నమస్కారాలు స్వీకరించండి.

ఉత్తరంలో మిమ్మల్ని గురించి మీరు ఎక్కువగా తెలుపుకోనలేదు. వివిధ సభ్యతలకు కేంద్రస్థానాలైన వివిధ ప్రాంతాల్ని చూసివచ్చినవాడనుగనే ఓరాను మాతృదేశంమీద మమతసడలలేదు. పైగా వృద్ధిచెందింది అని రాశారు. ఆ మాట కూడా సరికాదేమోననిపిస్తుంది. జ్ఞానం, అనుభవం ఆధారంగా

జన్మభూమిలోని గ్రామసీమలమీద నేను ఉత్పన్న మౌతుం డన్న మాట సరికాదు. అనేక గ్రామాల నుంచి వచ్చి కలకత్తాలో కాపురం ఉంటూన్న వాళ్ళను చాల మందిని చూశాను. వారి వారి జన్మస్థలాలు నే నెరుగుదును. కాని వారి హృదయంలో అంతు లేకుండా వున్నది వారికిగల సామర్థ్యాన్ని ఏ కొంచెమైనా మరో మార్గంలో వినియోగించినట్లయితే ప్రస్తుతం దుఃఖ భూయిష్టములైన గ్రామసీమలు సౌభాగ్యవంతము లౌతాయి.

నాకు అట్టి తీరికా లేదు. సామర్థ్యమూ లేదు. నే నేమీ చేయ లేకపోతున్నా నంటే నా తప్పేమీ లేదు. కాని ప్రతివాని దృష్టి గ్రామసీమలవైపు ఆకర్షితం కావాలి. కాబట్టే అత్యంత అప్రియములు, క్లేశదాయకములూ అయినప్పటికీ నేను గ్రామ సీమలను గురించి మంచి మాటలే రాస్తూ వుంటాను. పల్లె వాస ప్రజలు కాల్పనిక దృష్టితో గ్రామ జీవితాన్ని గురించి చేసే ప్రశంసలు చాల వరకు నిజం కావు. గ్రామాలు రోజు రోజుకూ అధోగతివైపే నడుస్తున్నాయి. ఈ అంశాన్నే 'గ్రామీణ సమాజ్' అను పుస్తకంలో ప్రస్ఫుటం చేయుటా నికి ప్రయత్నం జరిగింది. కాని ప్రయత్నానికి ఫలితానికీ ఎంత అంతరం వుందో నా రచనకూ ఫలసిద్ధికీ అంతే అంతరం ఉంది.

మీరు దాన్ని నాటకంగా ప్రచురించ వలసిందిగా కోరారు. అలా చేస్తే బహుశః బాగానే ఉండవచ్చు. కాని నాకు ఓపిక లేదు. ఓపిక ఉన్నదో లేదో కూడా నేను పరీక్షించి చూచుకోలేదు. ఇంకెవరన్నా ఓపిక ఉన్నవాళ్లు ఆ పనిచేస్తే బాగుంటుంది. కాని ఆ పనికి నేను పూనుకున్నా వ్యర్థపరిశ్రమే

పోతుంది. ఏ నాటక సమాజమూ దాన్ని ప్రదర్శించటానికి పూనుకోదు. కాని మీ సలహా జ్ఞాపకం ఉంచుకుంటాను. వీలుగావుంటే అటువంటి ప్రయత్నం చేయగలిగితే చేస్తాను. ఇదివరకు ఒకసారి మా గ్రామంలోని పండిత మహాశయుడు ఆ పుస్తకాన్ని ఎవరో నాటకంగా రాయటానికి పూనుకున్నట్టుగా తెలిపాడు. కాని ఇంతవరకూ ఆ పని జరగలేదు.

ఏమైనా మీ సలహా నేను మరచిపోను—మీకు నా నమస్కారాలు!

—శ్రీ శరచ్చంద్ర చట్టోపాధ్యాయ్.